కథా రత్నాకర గ్రంథమాల :—
పుష్పము. ౧.

# మంగళసూత్రము.

గ్రంథకర్త.

అబ్బూరి రామకృష్ణరావుగారు.

కథా రత్నాకర గ్రంథమాల వారిచే,
మచిలీ పట్టణము నందలి
శారదా ముద్రాక్షరశాలయందు
ముద్రింపబడి ప్రకటింపఁ బడియె.



1924

మూల్యము—

| | |
|---|---|
| చందా దారులకు | ౧—౦—౦ |
| ఇతరులకు | ౧—౮—౦ |

# సంపాదకీయము



ఆజాతియొక్క సారస్వతౌన్నత్యమును బట్టియె పరిణామ మార్గమున నెంతవఱకా జాతి సాగిపోయిన దియు స్పష్టము కాగలదు. సారస్వతము, ఒకజాతికాల యాత్రలో పొందిన పరివర్తనములయొక్క యనేకయుగ ముల చరిత్రను తనయందు సుభ్రృతముగ నొనర్చుకొని యుంటదుయేగాక వర్తమాన జీవ జగత్తునకు వివిధము లైన ప్రాపంచిక పరిస్థితులయొక్క సత్య సందేశముల బ్రకటించు గురుస్థానమగు చున్నది— లక్ష్యసూచియగు చున్నది.

ఒకజాతి బలవత్తరముగా వలయునన్న నాజాతిని దాని సారస్వతముద్వారా శిక్షింప వలయును. ఏవిధ ముగా ప్రపంచతత్వము నాజాతి యర్థము చేసికొనగల దో, యావిధముగా సారస్వత సృష్టి కావలయును. సారస్వతము సత్యభావపునీతమును బలీయము నైన యెడల జాతియు సత్యభావపునీతమును బలీయము నగును. జాతినిబట్టి సారస్వతము, సారస్వతమును బట్టి

జాతియు, సత్వాను క్రమవృద్ధి వికాసముల నందగలవు – ఒకసత్యస్పర్ధయు నేర్పడ గలదు,

ఒక్క పరిస్థితిని గ్రహించి, దానిని రసోల్లసితము గను, ప్రమోద స్ఫోరకముగను, చిత్రించి ఒక జాతికి బోధింప వలయు నన్న కథా శిల్పమువంటి దివ్యసాధనము మఱొండుండదు. బాలురుగాని, స్త్రీలుగాని, కడకు జ్ఞాన వృద్ధులైనను, నేడుగాని లలితోక్తుల కథారూప మున నివేదింపబడు చున్నపు డెంతయు నుత్సాహమును జూపుట స్వభావ సిద్ధముగా నున్నది. కవిత్వము మనోహర ముగా నుండుటకు హేతువు నూహించినచో నది యాకల్ప నా శిల్ప సౌందర్యమేయని తోచును. కావ్య సంసారము కూడ బ్రహ్మ సృష్టివలెనే యపారమును బ్రకాశమాన మునై యున్నది– దానికొక ప్రతివలెను నున్నది.

ప్రాక్తన భారతవర్షము యొక్క సారస్వతము వివిధ తత్వ సత్యదోహినియగు పురాణ శిల్పసాహిత్య సాహిత్యముచే పునీతమైనది. వారు గాధలను గీతా ఛందస్సులో పాడి మానవ జాతిని తన్మయత్వము నొంద జేసినారు- పవిత్రమును బలీయము నొనర్చినారు.

ఆంధ్ర సారస్వతమున నేడు వెలయుచున్నకధలు ఆఖ్యాయికలు, నాటకములు, కావ్యములు, జాతియొక్క ఉన్నత సాధనకు, బల సంపాదనమునకు చాలి నంతగా యింకను, ప్రచారమును చెందుటలేదు. ఎన్ని పద్ధతుల మీదనో, యెన్ని గ్రంధశాలలో యింకను వెలువడవలసి యున్నది. శక్తి యున్నంతవఱకు సారస్వత సేవ నొనర్పనే మేమీ "కథా రత్నాకర గ్రంధమాల"ను స్థాపించి యున్నారమని ఆంధ్రలోకమునకు నివేదించుకొను చున్నారము.

నేటి సంఘ పరిస్థితులబట్టి, యెక్కుడు నాఖ్యాయికలు, సాంఘికములుగాని, చారిత్రికములుగాని, రహస్య పరిశోధకములుగాని, సాధ్యమైనంతవఱకు ఆంధ్రకవుల స్వతంత్ర కల్పనా సంభావితములనే -- జాతీయములనే ప్రచురింప గలము.

అన్యభాషల యందలి మహాకవుల యుద్గ్రంధములను భాషాంతరీకరించి "అనుబంధ గ్రంధశాఖ" యందు ప్రకటించు చుందుము.

మేము కోరుటతోడనే శ్రమ యనుకొనక, మా యుద్యమమును మన్నించి, ప్రధమ పుష్పముగా నీగ్రంధ

మును మాగ్రంథమాల కనుగ్రహించిన శ్రీయుతులు అబ్బూరి రామకృష్ణ రావుగారికి మేమెంతయు కృతజ్ఞులము.

"మంగళ సూత్రము" నేటి మన సంఘము నందలి యొక చిత్రసంఘటనమును — పరిస్థితిని — గ్రహించి స్వాతంత్ర్యముగ కథా కల్పన మొనర్చి విరచింపబడినది. ఇందలి కథా సంవిధాన పోషణమును పాఠకులు గ్రహింతురుగాక!



# మంగళసూత్రము.



## వేశ్యాగృహము.

రాజపురమునందంతటి రమణీయమగు సౌధ మెచ్చటను లేదు. ఆసౌధమునందలి యనంత సౌభాగ్యము లెచ్చటను లేవు! ఆగృహమునందు చిరకాలము నుండియు లక్ష్మి యపూర్వ వైభవముతో రాజిల్లినది. బాధాజనకమగు నీప్రపంచమున నంతటి మహదానందము మన మొక్కయింటిలో నెక్కడను కనియుండము. అచ్చటి దాసదాసీజనముల శరీరములపైనున్న వెండి బంగారములు సామాన్యముగ మనము ధనికులనుకొను వారికే యుండవు. ఆసౌధమునకు 'కేళీనికేతన' మని పేరు. అను దినమును పర్వదినములవలెనె యచ్చట సంగీత గోష్ఠియో, కథాకాలక్షేపమో, క్రీడావినోదములో మహాకోలాహలముతో జరుగుచుండుటను చూడని వారాప్రాంతమున లేరు. కాని యొకనాడాదారిని పోవుచున్న పాంథుడిట్లనుకొనుచుండెను.

"ఈకేళీనికేతనము నందేదుకో నానాటికి కళ తప్పిపోవుచున్నది."

వేఱొక డిట్లనుకొనెను.

"కడచినరాత్రి యీసౌధమున నెప్పటివలె నుజ్జ్వలముగ దీపములు వెలిగింపబడలేదు. ఈఆనంద సౌధ

మున నెట్లో సందుచేసికొని దుఃఖము ప్రవేశించి నట్లున్నది."

ఆ నికేతనము రత్నవల్లి స్వగృహము. రత్నవల్లి వేశ్య. అపూర్వలావణ్యరాశి. మంచి బ్రాహ్మణ వంశమున జన్మించి, చిన్నతనముననే భర్తను కోల్పోయి విపరీతమగు సాహసమవలంబించి, తోటివారి దూషణ తిరస్కారములు నిగ్రహించి, తుదకీవృత్తిని స్వీకరించి నది. అప్పటికి రత్నవల్లికి పదునారేండ్లు. ఆనాటి నుండియు విశేష పరిజ్ఞతో మెలగుచు సంగీతమునందు సాహిత్యమునందు, అభినయ విద్యయందు పండితు రాలై సమస్త విటలోకమును తన పాదాక్రాంత మొనర్చుకొనినది. రత్నవల్లి శరీరసౌందర్యము నంత గావర్ణించుటకు వీలులేదు. ఆమె యవయవములందలి సౌష్ఠవము సౌకుమార్యమును అపూర్వములు కావు. ఎందఱికో సాధారణస్త్రీలకా లక్షణములుండును. ఆమె వినీల కేశరాశి యాగుల్ఫలంబితమై శ్రావణమునందలి చిన్నమేఘమువలె రమణీయముగ నుండును. కాని యందునుగూడ ప్రత్యేకముగ మోహనశక్తి యేదియు నులేదు. ఆమె మందస్మితము చంద్రికవలె ధవళమై యుండునుగాని కేవలమానవ్వునకై యేరసికుడును మోసపోలేదు. ఆమెచూపులు! సాగరముల యందంత గాంభీర్యములేదు. నక్షత్రముల యందంతకాంతిలేదు. అంత తళతళలేదు. రత్నవల్లి రామణీయకమంతయు

నామెస్నిగ్ధములగు వీక్షణములందు చిరనివాసమేర్పరచు కొనినది. ఆనిశితములగు నేత్రాంచలములందలి సౌభాగ్యము, తెప్పపాటున కోకరీతిగా మాఱుచుండును. ఆనేత్రము లొక్కక్షణకాలము తమ చాంచల్యమును వీడి, యేకముఖమై ప్రకాశించుటను గాంచి యందలి మధురమగు నాహ్వానమును సాభిలాషులై యందుకొనని రసికులుగాని యరసికులుగాని యుండబోరు. ఈనేత్రములుమాత్రమే యామె జైత్రయాత్రకుఁజాలును. మరి యేయితర సాధనములును ఆవశ్యకములుగావు. అయినను, ఈఅసమాన్య శోభాధురీణములగు నేత్రములకు తోడుగా, నమృతస్యందియగు వాక్కు రత్నవల్లికి చిన్ననాటనుండియు నలవడినది. హాస్యపు ప్రసంగములందును, వినోద సల్లాపములందును, దుఃఖమునందును సంతోషమునందును నామె వాగ్ధోరణి యద్భుతముగ ప్రవహించుచుండును. నాయకుల యధికారము ననుసరించి, యభిరుచి ననుసరించి అభిప్రాయముల ననుసరించి మెలకువతో, జాగరూకతతో, నైపుణ్యముతో నామె ప్రసంగించునపుడు ఆమె సమ్మోహనశక్తికి బుద్ధిపూర్వముగ నందఱును వశులగుచుందురు. ఇది రత్నవల్లి మహాద్భాగ్యము. ఆమె యందరిపై చలాయించు అధికారమునకు గారణము; సమరక్రీడాలోలుడై శత్రువు నోడింపవెడలు సేనానివలె, నామె యలసగమనముతో అందరాని యాలోచనతో, వ్యూహములు నిర్మించుచు,

మోహమును నటియించుచు, తనసౌందర్యమునకు మన సుపడి వలచివచ్చినవారి హృదయముల నొకమాఱు ఖేదపెట్టుచు, నొకసారి యానందమున నూగించుచు నిష్టమువచ్చినట్లు తనశక్తికి తానే యుప్పొంగుచు సాధా రణస్త్రీవలె నిరంతరము వశ్యయై చకితయై యుండక పురుషునివలె కాఠిన్యమును దాల్చక యందఱను మెప్పించుచుండును.

ఈ సన్నాహ మందంతయు పైపై మనకు గాన్పించు సౌఖ్యము సౌందర్యమును మాత్రమే లేవు. రత్నవల్లి ధీరహృదయము నందొక గొప్పలోపమున్నది. ఆలోపమునే కులకాంతలు మకుటమణిగా దాల్చి యానం దింతురు. గౌరవమును గౌరవమును సంపాదింతురు. కాని చంచల హృదయములను, సాధించి, నిర్మించినెంచి స్థిర సంకల్పయై అసలు మోహమును గాక, దాని యాభాస మునే అనుసరించుచు, కేవల జయకాంక్షతో తన సక లాధిపత్యమును నిలుపుకొనదలచిన వేశ్యాకుల తిలక మగు రత్నవల్లి కది పెద్ద కళంకమే యని తోచినది. ఆలోపమేదియో సావధానముగా నాకర్ణింపుడు.

రత్నవల్లి యొకానొక సుందరుని కృత్రిమముగ గాక, యథార్థముగ, తన హృదయము నందు, తనబుద్ధి యందు, తన మనస్సునందు కామించి సంపూర్ణముగా నిష్కళంకముగ ప్రేమించినది. రామమూర్తి యందరి వలెనె తన యొద్దకు, తన యధికారము నొప్పుకొని, తన

సౌందర్యమునకు దాసుడై తన సౌందర్య సీమయందు భిక్షుకుడై నమ్రుడై వచ్చెను. కాని యతీవచంచలమగు రత్నవల్లి మనస్సున నతనికిని స్థిర నివాస మేర్పడినది. రత్నవల్లి మొట్ట మొదట భయపడినది. పిదప ధైర్య మవలంబించి యీ యనురాగాంకురమునకు నీళ్ళు పోయక కుదురు చేయక నిర్లక్ష్యముతో త్రుంచివేయ ప్రయత్నించినది. కాని యేగంభీర ప్రదేశమునుండియో ప్రవాహమువచ్చి యీ యంకురమును కాపాడినది. రత్నవల్లి కానాటినుండియు జయకాంక్ష హెచ్చినది కాని, ఫలము తగ్గినది. గిచ్చి కయ్యము పెట్టుకొని రామమూర్తితో పగసాధించియైనను, అతనిపై నను రాగము చంపుకొనవలయునని యోచించినది. అది యును సాధ్యము కాలేదు, రామమూర్తి యాలింగ నములందు, సల్లాపములందు రత్నవల్లి కీ కారణమున సగము తన యధికారము తగ్గినదను మనఃక్లేశము, సగము సంతోషము వ్యక్తమగు చుండెను. కాని యొక మాట మాత్రము సత్యము. తానచిరముననేసర్వ స్వతంత్రురాలు కావచ్చునను నాశ ప్రబలమగు చుండెను. అందుకు తగిన సూచనలు కూడ నగపడు చుండెను. మరల నెప్పటివలె విముక్తురాలై కోల్పోయిన తన సర్వాధి పత్యమును బడయవచ్చునను సంతోషసమయ మున స్వభావ ప్రీతిపడగు నుత్కంఠ మాత్రమామెను విడువలేదు. అందువలననే ఆనాటి రాత్రి చిత్ర...త్ర

ముగ నలంకరింపబడిన తన శయ్యపై యాసీనయై రామమూర్తి రాకకై నిరీక్షించుచుండెను.

కేళీనికేతనమ్ము నందొక విశాలమగు గదిలో రత్నవల్లి మోహనముగా తన సహజ సౌందర్యమునకు మెరుగులు పెట్టుకొని, దుర్నిరీక్ష్యయై కూర్చుని యుండెను. ఆమె భావాంబుధియందు తరంగముపై తరంగము లేచి యంతయు కల్లోలముగ నుండెను. ఆమె యిట్లు తలపోసెను.

"నాస్వచ్ఛందజీవన మార్గమునందు ననుల్లంఘనీయమగు సేతువువలె సీతవచ్చి నిలచిననాట నుండియు నామనస్సునకు విశ్రాంతిలేదు. ఈసేతువును పగులగొట్టుటకై నాసకలశక్తులను వినియోగింప నెంచితిని. నేటికాశుభక్షణము దాపునకు వచ్చినది. కాని నాకింత విచారమెందుకు? రామమూర్తి తప్పక నన్ను విడనాడును. అదినాకు సంతోషవార్తయే. అయిన నీజగదేక సుందరుని త్రోసిపుచ్చి వెడలిపోవుటంత సులభ కార్యమా? అంతసుళువుగ నీపని ముగియకూడదు. అతడు నన్ను విడనాడకూడదు. నేనే అతనిని విడనాడెదను. ఇదియే నాకర్తవ్యము!"

అప్పటికి రాత్రిపదిగంటలు దాటినది. కేళీనికేతన పరిసరాంగణములయందు కాలిచప్పుడు వినవచ్చినది. రత్నవల్లి చెంగున లేచి కిటికీనుండి వికటమంద

హాసముతో నిదానించి చూచినది. రామమూర్తి వెనుకటివలె విలాసముగా మెల్లగా నడచివచ్చుటలేదు. అతడు దీర్ఘ గమనముతో నేదియో పనియున్నవానివలె నడచువచ్చుచుండెను. రత్నవల్లి యంతట మఱియొక సారి నిలువుటద్దము నొద్దకేగి తనయలంకారములను సవరించుకొని నిశ్చలయై కూరుచుండెను. రామమూర్తి ప్రవేశించినతోడనె రత్నవల్లీ పక్కున నవ్వినది.

రామ:— "వల్లీ! యేమట్లు నవ్వితివి"

రత్న:— "నేను నవ్వినపుడెల్ల నీవీ విధముగ నెన్నడును కారణమడుగలేదే!"

రామ:— "నేనెన్నడును నిన్నడుగనివాడను గావుననే యిప్పుడు నాకు కారణమెఱిగించుట భావ్యము."

రత్న:— "కారణములు చెప్పుటలో నాకెప్పుడును అభ్యాసములేదు. ఇప్పుడు రమ్మనిన నెట్లువచ్చును?"

రామ:— "సరేకాని బల్లపై నాయుత్తరమెక్కడిది?"

రత్న:— "రాజశేఖరము వ్రాసినాడు. యతనికి అవశ్యముగా నూఱురూపాయలు కావలయునట."

రాజశేఖరము రత్నవల్లి తమ్ముడు. రాజపురమునకు ఇరువదిమైళ్లదూరమున నున్న సత్యవాటి యను పట్టణమునందు కాలేజిలో చదువుకొనుచుండెను.

రామ:— "ఇవిగోరూపాయలు. వెంటనేపంపించుము."

అంతట రామమూర్తి లేచి యటునిటు తిరిగిమరల యథాస్థానమునవచ్చి కూర్చొని సానునయముగా నిట్లనియెను.

"వల్లీ! ఇటుచూడుము. నీవలన నాకొకకార్య ము కావలసియున్నది. చేసిపెట్టెదవా?"

రత్న:— "చేయజాలను."

రామ:— "ఎఱుగనిదే యిట్లుపల్కెదవేమి."

రత్న:— "తెలియనిదానిని తెలిసికొనలేక"

రామ:— "నీవు, నేనునుకలసి తీసికొనిన ఛాయాపటమును నీకువ్రాసిన యుత్తరములును నాకొకసారి కావలయును."

రత్న:— "ఇంతసాహసముగ బ్రశ్నింప నీకెవరధికార మిచ్చిరి."

రామ:— "నీవే"

రత్న:— "అట్లయిన నేటినుండి నీకాయధికారములేదు. ఇక నన్నడుగకుము."

రామ:—"ఈహాస్యపు ప్రసంగము లెప్పటినుండి నేర్చితివి?

రత్న:— హాస్యప్రసంగముల నన్నిటిని మరచిపోయితిని. నేనిక స్వతంత్రురాలను."

రామ:— ఎవరైన నావిషయమై కట్టుకథలు కల్పించిచెప్ప గా వింటివా?

రత్న:— అసలుకథ వినవలెనని యున్నది. కట్టుకథలతో నాకు పనిలేదు.

రామ:- కథలనిన నీకు సంతోషమని నేనెఱుగుదును. కాని యట్టి సందర్భమేమియును లేదు. ఛాయాపటమును ఉత్తరములను ఒక్కసారిచూడవలయునని యున్నది. మరల త్వరలో నీ కిచ్చివేసెదను.

రత్న :— నేను మాత్రము నీ కెన్నడును యిచ్చివేయను. రామమూర్తి యిక మాట్లాడలేకపోయెను. అత డింత వికటముగ రత్నవల్లి మాట్లాడునని యనుకొనలేదు. రత్నవల్లి తన యభిప్రాయము లన్నిటిని గ్రహించినదని మాత్రమతడు కనుగొనెను. అందుకే కపట నాటక మాడిన లాభము లేదని తలచెను. ఇటువంటి ప్రవర్తన మెన్నడును రత్నవల్లియం దాతడు చూచి యుండలేదు. అతని కంతట కేళీ నికేతనము కారాగృహము వలె కనుపించినది. అచ్చటనుండి వెడలి పోవుటకు ముందు, తన ప్రేయసి నొక ముద్దునకై యాచించెను. అదియును లభించలేదు. ఇక నేమిచేయగలడు? వెంటనే యత డచ్చట నుండి కదలి పోయెను. రత్నవల్లి యే మాత్రమును అభ్యంతర పెట్టలేదు. ఆతడు వెలుపల కేగిన తర్వాత రత్నవల్లి మరల నతని కిటికీలోనుండి నిదానించి

చూచెను. తలవంచుకొని చింతాపరుడై కేళీనికేతన పరిసరములను దాటిపోవుచుండగా చూచియుల్లాసముతో మరల పకక్కున నవ్వెను.

రామమూర్తి సదాచార సంపన్నమగు బ్రాహ్మణవంశమున జన్మించినవాడు. అందునను వైదికశాఖ. చిన్నతనముననే జననీజనకులను గోల్పోయి రెండువందల యకరముల సారవంతమగు భూమికి స్వామియయ్యెను. చదువు సంధ్యలంత విశేషముగానబ్బకున్నను తనయీడుగల పోకిరులతో సాంగత్య మలవడెను. అంతట సులభముగా నతనికి భాషయుండుగాకున్నను వేషమునందు డంబమును చాతుర్యమును హెచ్చినది. ఇరువదియేండ్లు నిండకమునుపే రాజపురమునందలి వేశ్యలయంతఃపురములన్నియు నతనికి విలాసగృహములయ్యెను. ఆసమయమునందే రత్నవల్లి యాయూరికివచ్చినది. దానిని చూచినవెంటనే తన ఆస్తియంతయు దానికి ధారవోయనెంచెను. రత్నవల్లి కేళీనికేతనమునందలి యైశ్వర్యమంతయు రామమూర్తి భూభాగములనుండి సంక్రమించినదే. నాలుగు సంవత్సరములలో రామమూర్తి మహావైభవమంతయు తాకట్టుపత్రములతోను, దావాలతోను ఆవరింపబడెను. ఎన్నిదుర్గుణములున్నను రామమూర్తి యాకృతియందవి కాన్పింపవు. అతడు చాలచక్కని వాడు. అప్పటికాల మర్యాదననుసరించి పాఠశాలలో గాని పండితులయొద్దగాని చదువు నేర్వకపోయినను,

నతఁడు జ్ఞానశూన్యుడని యెవ్వరును అనుకొనలేదు. విద్యాసంపన్నుల సాంగత్యమునకు వలసిన శిక్షణ మొట్లో యాతనికి కుదిరినది. ఇదియునుగాక రత్నవల్లీగాథ ముగియువేళ కాతనికి యిరువది మూడేండ్లు నిండీ నిండకుండెను. అందువలన పెండ్లియీడు వచ్చిన బాలికల జననీజనకులాతని నిర్లక్ష్యము చేయనెంచలేదు. ఏమో! యింత చిన్నవాడుకద! బ్రదికి బాగున్న యెడల మరల సన్మార్గమునకు రాగూడదా యని వారనుకొనిరి. అంతులేని సంబంధములు వచ్చినవి. రామమూర్తి వానిని పాటింపలేదు. కాని తనయాదాయమును ఆస్తియును రత్నవల్లి యట్టహాసమునకే వ్యయమై యుండుటచే తోటివారిలో తక్కువగా నుండుట కత నికచాలకష్టముగా నుండెను. ఇట్లుండగా వేలూరి సంస్థానాధీశ్వరుడగు రామేశ్వరశర్మయొక్క తనయకు మంచి సంబంధమునకై వెదకుచు నతని యనుచరులు రామమూర్తిని తగినవరునిగా నెంచి యతనితో వివాహ మును స్థిరపఱుప నెంచుకొనిరి. రామేశ్వరశర్మయును మంచిచెడ్డలన్నియు విచారించి తుదకు సమ్మతించెను. పిల్లవైపున కనీసము లక్షరూపాయలైనను తనకు సంక్ర మించునని రామమూర్తికి తెలిసిననాట నుండియు రామే శ్వరశర్మకన్న తానే యీవివాహమున కెక్కువ కుతూ హలపడుచుండెను. తుదకన్నియు సిద్ధమై తన కశేష సౌఖ్యకారణమగు సంఘటనము త్వరలో నొనగూడునని

నిశ్చయము తెలిసినపిమ్మట, రామమూర్తి దురదృష్టము మరలతలయెత్తెను. క్రొత్త సంకటమొకటి దాపురించెను. ఎవరో రామమూర్తి కయిష్టులు రామేశ్వరశర్మ పేర నొక యుత్తరము వ్రాసిరి. అందున రామమూర్తికిని రత్నవల్లికినిగల సాంగత్యమునుగురించి చెప్పి యామాటలను లక్ష్యపెట్టకున్నయెడల రామమూర్తి రత్నవల్లి కలిసి తీయించుకొన్న ఛాయాపటమును, అతడు రత్నవల్లిపేర వ్రాసిన యుత్తరములను ప్రకటించెదమని బెదిరించిరి. రామేశ్వరశర్మ యొద్దనుండి వచ్చినవారందఱితో రామమూర్తి ఆభయమేమియు లేదనియు తానుత్తరములు వ్రాయలేదనియు ఛాయాపటము మాటయబద్ధమనియు చెప్పెను. ఆతడీయుత్తరములను పటమును ఎట్లైన హరింపవలయు నని పట్టుబట్టెను. అతని యూహాలతనిలో నుండగనే రత్నవల్లికెట్లో తెలిసినవి. కష్టముచే నెట్లో సాధింపవచ్చుననుకొన్న విషయమిపుడతని కసాధ్యమనిపించినది. ఇంతరహస్యమెట్లు బయటపడినది గోచరముకాలేదు. ఆతనివివాహమును గూర్చినవార్తలాయూరిలో నెవ్వరికిని తెలియకుండ నేర్పాటుచేయబడెను. అందువలన నతని సందేహము మఱింతయెక్కువయయ్యెను. ఈసంశయమును తీర్చుకొనుటకు రత్నవల్లి యొద్దనుండి యుత్తరములను పటము తెప్పించుటకై సాధనాంతరముల నాలోచించుటకును తనమిత్రుడగు దుర్గా

ప్రసాదరావును కలిసికొని మాట్లాడవలయునని అతని యింటికి ప్రయాణమయ్యెను.

ఇంతలో రత్నవల్లి యొక్క సేవకునిచేతికిచ్చి యీ క్రింది యుత్తరమును తనతమ్ముడగు రాజశేఖరమునకు పంపెను.

"చిరంజీవియగు నా ప్రియసోదరుడు రాజశేఖరమునకు.

నీవు కావలయునని వ్రాసిన నూఱురూపాయలను నీకు జేపే చేరునట్లుగా పంపించెదను. నీవానాడు, సత్రములో రామేశ్వరశర్మవద్దనుండి పెండ్లిసంబంధమును విచారించుటకై వచ్చిన బ్రాహ్మణుల సంభాషణమును దాసిదానికి లంచమిచ్చి వినియుండుట మనకు చాలా మేలైనది. లేకున్న చాలమోసము జరిగియుండును. రామమూర్తి నిన్నరాత్రివచ్చి ఉత్తరములకై నన్నడిగి పోయినాడు. ఇవ్వనని కఠినముగా ప్రత్యుత్తరమిచ్చితిని అతడింకేమి పన్నాగములు పన్నునో తెలియదు. నీవొకసారి తప్పక వచ్చిపోవలసినది. గ్రహించవలెను.

నీప్రియసోదరి,

రత్నవల్లి."

సేవకుడీయుత్తరమును గైకొనిపోయి మరల రెండుగంటలలో తిరిగివచ్చి, ఊరుదాటి వెళ్లుచుండగా నొక యాబోతు బెదిరి తనపైకి వచ్చినదనియు, ఆభయ

ముతో కొంగునకట్టియుంచిన లేఖతో తనయుత్తరీయము ను వదలి పరువెత్తిపోయితిననియు, దానినాబోతు తన కొమ్ములకు తగిలించుకొని చించుటచే, లేఖకూడ పొడి పొడి యైపోయినదనియు, మరల వ్రాసియిచ్చిన తక్షణమె వెళ్లి జవాబు తెచ్చెదననియు చెప్పెను. అంతటవిసుగు కొనుచు రత్నవల్లి మరల న్డాయుత్తరమె వ్రాసియిచ్చి సేవకుని బంపించెను.

రామమూర్తి దుర్గాప్రసాదుని యింటి కేగునప్పటికి నత డింటి వద్ద లేడు. అందుచే రామమూర్తి వసారాలో నేదియో ఆలోచించుచు కూర్చుండెను. కొంత సేపటికి దుర్గాప్రసాదుడు చేతిలో రెండు చిన్న కాగితములను పట్టుకొని వచ్చుచుండెను. రామమూర్తిని సమీపించిన తోడనే

"సందేహములే వైన తీర్చుకొన వచ్చితివా మూర్తి" అని కొంచెము నవ్వు మొగముతో పలికెను. రామమూర్తి కొంచ మాశ్చర్యముతో నేమి సందేహమో చెప్పుచూతము అని ప్రశ్నించెను. అంతట దుర్గాప్రసాదు నవ్వుమొగముతోనే "ఆ రత్నవల్లి దగ్గర నీ కేదో శృంగభంగము జరిగి నట్లున్నది. అంతే కాదు?" అనెను.

రామమూర్తికిదుర్గాప్రసాదుని ప్రజ్ఞావిశేషములు సంపూర్ణముగా తెలియును. అతడు మహారహస్య మను

కొన్ని వివాహవిషయము, మిూఁగ మిక్కిలి కడచిన రాత్రి రత్నవల్లి యొద్దతనకు సంభవించిన పరాభవము సంగతి కూడ తనస్నేహితున కెట్లు తెలిసినదో దురూహ్యముగ నుండెను. దుర్గాప్రసాదు డా ప్రాంతములలో నల్లరి చిల్లర వార లందరకును చోరసిఖామణులకును హంతకులకును గూడ గురుపీఠము నలంకరించి యుండెను. అతని తెలివితేటలు మంచిపనుల కుపయోగించినను, దుర్వినియోగము చేసినను చక్కగా రాణించును. అతఁడు దుష్టకార్యములు నిర్వహించుచున్నను మిత్రులనినను ఆప్తులనినను ప్రాణము లిచ్చు స్వభావము కలవాఁడు. ఏ క్రూర కార్యమును నిర్వర్తించినను కేవలము ధనాశచే గాక, కేవలక్రౌర్యమునకే గాక, తనబుద్ధివివేకములను ప్రదర్శించి యానందించుటకు, అందలి పన్నాగములను నిర్జించి తనబోటివాఁడు లేడని పించుకొనుటకును చేయుచుండును. అందువలన నతఁడు దుర్మార్గుఁడని క్రూరుఁడని భయపడినను ప్రజ లందఱు నతని శరణాగతరక్షణమునకు మెచ్చుకొనుచుందురు. ఈ ప్రజాదరము వల్లనే పోలీసు వా రతని నింత వరకును నెంత నురాగతము చేసినను నిర్బంధింప లేకుండిరి. అటువంటి సర్వజ్ఞశేఖరుని బుద్ధిబలవిశేషమునకే రామమూర్తి మిక్కుటముగ నచ్చెరు వొందుచుండెను. అంతట రామమూర్తి వైపునచూచుచుదుర్గాప్రసాదరావు "ఆశ్చర్య మంతయు తగ్గినదా? ఏదీ చెప్పుము. సమా

చార మంతయు సావధానముగా విన వలయు నని యున్నది?"

రామ:— అంతయు నెఱుగుదువు గదా! నీవే యుపాయ మును చెప్పరాదా? కాలయాపన మెందులకు.

దుర్గా:— ఈమాత్రమునకే యింత భయపడువాడ వీ లోకమున నేమిచేయ నేర్తువు? నా కేమియు తెలియదు చెప్పుము. నా యొద్ద సగమునోటు మాత్రమే యున్నది. నీయొద్దనున్న సగమును కూడ కలిపిన గాని యంతయు స్ఫుటముగాదు. చెప్పుము.

రామమూర్తి యంతట పూస గ్రుచ్చినట్లు వివాహవృత్తాంతమును రత్నవల్లితోడ సంభాషణమును నివేదించి ఈ దుర్మార్గు డెవరో నాకు బోధపడకున్నది. అత డెవరో సాధించి తెలిసి కొనిన గాని యీ వివాహము కా నేరదు. లక్ష రూపాయిలకును తిలోదక మీయ వలసి నదే యనెను.

దుర్గా:— అంత వరకును సగము నోటు. ఈ సగమును కూడ కలిపి విచారించుకొనుము. అనిరత్నవల్లి చేవ్రాలుతో రాజశేఖరమునకు వ్రాసిన యుత్తరమును రామమూర్తి చేతి కిచ్చెను. రామమూర్తి పూర్వపు టుత్తరమంతయు చదివియాశ్చర్యపడి దీనినెట్లు సంపాదించితివి? నీ మాయా

వ్యూహమున చిక్కుకొనిన వస్తువేయున్నట్లు కనుపడదు." అనెను.

దుర్గా:— ఇంకను పూర్తి కాలేదు. దీనినికూడ కొంచె ము తిలకింపుము. అని యింకొక యుత్తరము నతనిచేత నుంచెను. రామమూర్తి యిట్లు చదువ దొడగెను.

"ప్రియసోదరి రత్నవల్లికి,

అనుకొనిన సంగతియే నిజమైనది. చింతించి లాభములేదు. జాగరూకతతో నుండవలయును. ఆయుత్తరములును, పటమును నీయొద్దనుండుట భావ్యము కాదు. అవి నాయొద్దనే భద్రముగా నుంచెదనని మొన్న నిన్నడిగినపుడు నీవు సమ్మతించ కుంటివి. ఇక నైనను జాగ్రత్త పడవలయును. నేనాయుత్తరములను తీసుకొని వెళ్లి రామమూర్తిని భయపెట్టి కనీసము ఏబది వేల రూపాయలైనను కక్కునగాని యవి ప్రకటింపక మాననని బలవంతముచేసి యతనిచే పత్రమును వ్రాయించుకొని వచ్చెదను. రేపు నేను రాజపురమునకు వచ్చినపుడవి తప్పక తీసుకొనివచ్చెదను. ఇంతవఱకును జయము మనపక్షముననే యున్నది. నే వచ్చులోపల జాగ్రత్త!

నీ ప్రియసోదరుడు.

రాజశేఖరము."

ఈయుత్తరమును సాంతముగా పఠించి సగము భయముతో సగము విస్మయముతో రామమూర్తి "దుర్గా! ఇక కర్తవ్యమేమి?" యని ప్రశ్నించెను. దుర్గాప్రసాదుడు నవ్వుచు "ఇంకేమున్నది. కర్తవ్యం షబ్బు సంగ్రహం" అనియున్నదిగదా!

రామ:— ఆసంగ్రహమునకు నీరందఱును తప్పించుకొనుట యెట్లు? నీవేమైన నపుడే యాలోచించితివా?

దుర్గా:— అన్ని యాలోచనలు ముగిసినవి. ఇక నాలోచనలతో పనిలేదు. కార్యము ఫలోన్ముఖము కావించుటయే మనకు గావలసినది. నీకు తెల్పవలసినది కొంచెము మాత్రమే యున్నది. రాజశేఖరము నీయొద్దకిక లేపోయూపోరాగలడు. నీవాతడు వచ్చిన తక్షణమె నాకు కబురంపవలయును. ఈపని ముగియువరకు నేనిచ్చటనే యుందును. నీకబురు వచ్చిన వైదు నిముషములలో నీచెంతకు వచ్చి చేరెదను. ఈరాత్రియె యొక నవలయొక్క వ్రాతప్రతిని పంపించెదను. రాజశేఖరము వచ్చునప్పటికి నీవా వ్రాతప్రతిని చూచి వేఱొక ప్రతిని తెల్ల కాగితములపై వ్రాయుచుండవలయును. అది నీస్నేహితుడొకడు వ్రాసిన నవలయని చెప్పుము.

తరువాత నింకొకమాట; నీ సేవకులలో మంచి నమ్మకమున్న వారిని బలిష్ఠులనుగా చూచి నాయొద్ద కీరాత్రి పంపవలయును. బలముకన్న నమ్మకమున్న ప్రధానము. రెండును కలిగినె మఱీమంచిది. ఇకపోయి వచ్చెదను.

రామమూర్తి యీ సన్నాహ మంతయు నేభీషణ పరిణామము నొందునో యని విస్మయము నొందెను. అతడొకసారి మరల దుర్గాప్రసాదునితో "ఇకనేమియు నాకు తెలియ నక్కరలేదు గద!" అని ఆవిచిత్రసన్నాహము నందలి నిగూఢభావమును తెలిసికొన గోరెను. కాని దుర్గాప్రసాదు డింకేమియు చెప్పక "నీవేమియు శంకింప వలదు. ఈపనిని స్వామికార్యముగా భావించి కొనసాగించెదను. ఇక 'పోయివత్తునా" యనెను.

రామ:— ఆఁ సరచితిని. ఆరెంటుత్తరములు నెట్లు లభించినవో చెప్పనే లేదు.

దుర్గా:— చేయవలసిన దెంతయో ముందున్నది. దానిలో నేమి సారస్యమున్నది. అయినను చెప్పెదను వినుము. నాచెల్లెలి కనారోగ్యముగా నుండుటచే వైద్యశాల నుండి మందు తెచ్చుటకై యేగితిని. త్వరగా రావలసియుండుటచే సత్యవాడకు బోవు కాలిబాట యున్నదే దాని

కడ్డముగాబడి వచ్చుచుంటిని. ఆదారిని బడి యొకఁడు మాటికి మాటికి బట్టలు సవరించుకొనుచు పోవుచుండెను. నే సమీపించు సమయమున వాఁడు నావంక నదేపనిగా రెండు మూఁడు నిముషములు చూడ నారంభించెను. "ఏమిటది" యని గట్టిగా గద్దించితిని. అట్లదే పనిగా నేల చూచెదవని నా యర్థము. వాఁడంతట భయకంపితుఁడై "ఏమి లేదండి ఉత్తరం తీసుకొని వెళ్లుచున్నానండి" యనెను. నేనును సందేహించి "ఏదీ తెమ్మని" గట్టిగా నరచితిని. అంత నాలేఖలోని వృత్తాంతముండుటచే నది సంగ్రహించి యతని కొక సాకుచెప్పి మరల నింకొక ఉత్తరము వ్రాయించుకొని వెళ్లుమని చెప్పితిని. అదేరీతిగా రాజశేఖరమునొద్దనుండి కూడ నొకటినునకు నొకటి రత్నవల్లికి రెండుత్తరములు వ్రాయించి తెమ్మంటిని. అతనికీనాముగా పదిరూపాయి లిచ్చితిని. ఏమి యీబహుమాన మంత యెక్కువ యని తలచెదవా? చూచెదము దానితో నెంత నాటకమగునో. పోయెదను."

# 2

## ఈ శూరాగ్రేసర డెవడు?

అర్థరాత్రియైనది. అంతయునంధకారము. మహా భీషణమగు నానిశీథ సమయమునందు కేళీ నికేతనము వెనుకటివలె వేయి దీపములతో వెలుగు మనక్షత్రమండలమును తిరస్కరించుట లేదు. అంతయు నిశ్శబ్దముగ నుండెను. ఏ పూర్వకాలముననో గొప్ప ధనవంతులకో, గొప్ప యధికారులకో నివాస గృహమై పాడుపడి వన్నెదక్కినట్లు నెల వెలబోవుచుండెను. ఆ మందిరమున రత్నవల్లి లేదా యేమి! లేకేమి రామమూర్తితో కలహము పెట్టుకొన్నప్పటి నుండియు తన సహజమగు మనశ్శాంతి నంతయు పోగొట్టుకొని, కళాహీనయై మానయై నిరుత్సాహముతో నున్నది. అతని చేతి నుండి జీవనది వలె స్రవియించు ధన ప్రవాహము లిప్పుడా వైపునకు పాఱుట లేదు. అందుచే రత్నవల్లి తన పరివారమును చాల వరకు తగ్గించుకొనవలసి వచ్చెను. అదియును గాక రామమూర్తిని సాధించి యతనియొద్ద నుండి తన తమ్ముని సహాయమున నింకను ధనము సేకరింప వలయునను నాశతో తక్కిన కోలాహలమంతయు మాని తదేక దీక్షతో పనిచేయుచున్నది. అందు వలననే యా కేళీ నికేతన మంతగా తన యజమానురాలి, మానమునే యాపె నిస్తేజ స్వరూపమునే పూని యున్నది.

కనులు చీల్చినను కానరాని యామహాంధకార మధ్య మున నెవ్వరో కొందరు చేతులతో భయంకరములగు పెద్ద కర్రలు విసరుచు వే ఘోశబ్దమును చేయక ఆమందిర ప్రాంతమునకు నడచివచ్చు చుండిరి. అంతలో వారు ప్రాకారమును దూకి పూలచెట్లగుండ పందిళ్ళను దాటి మందిర సాన్నిధ్యమును చేరిరి. అంతలో నా విశాల మందిరము నందంతఃపురమునందు హాహారవములు ప్రారంభమయ్యెను. మొదట కొంచెము కొంచెముగా ప్రారంభమై యాక్రందన ధ్వనులు రోదనధ్వనులు హెచ్చగుచుండెను. కేశీ నికేతనము విశాల మగు భవనమని చెప్పి యుంటిమి. అట్టి సందర్భములో చుట్టుప్రక్కల నిండ్లున్నను ఆ యంతః పురము నెవరో కొందరు స్త్రీలు ఎంత గొంతెత్తి కాంభోజీ రాగముతో నేడ్చినను ఆధ్వని యిరుగు పొరుగు వారికి వినిపించుట దుస్సాధ్యము. అందులో నామందిరమునకు కొంత దూరము వరకు వాసగృహములే లేక యుండిన నికేమి చెప్పవలయును. ఆ కేశీనికేతనమట్టి యవస్థలోనుండెను. అంత కంతకు రాళ్లు రువ్వేడి దుర్మార్గులు మఱింత యాక్రోశముతో నల్ల కల్లోలముగ, భీతావహముగ ప్రవర్తింప జొచ్చిరి. రత్నవల్లి గడ గడ వణకి పోయినది. గడియారము నందొకను తెల్లవారుటకు నైదు గంటల వ్యవధి కనుపించెను. అంతవరకును, నెవ్వరును తన సహాయమునకు రారనుభీతి యామె

నావరించెను. ఎంత చేసినను ఆ దుర్మార్గులు బయటనె బెదరించుచు నిల్చిరి గాని, తలుపులు గోడలు చించుకొని లోపలికి వచ్చు ప్రయత్నములను చేయ రైరి. ఎప్పుడు లోన బ్రవేశింతురో యప్పుడె తనకు పరాభవమగు నని రత్నవల్లి నిశ్చయ పరచుకొనెను. కాని వీరెవరు? కేవల మన్య ద్రవ్యాపహారణమునకే వచ్చినచో తమ పని ప్రారంభించుట కింత యాలసింతురా? ఇంత యల్లరి నొనర్తురా? కాదు. ఇది తప్పక రామమూర్తి చేసిన దురంతము. ఈ భావ మామె మనస్సునకు నచ్చినది. ఆమె హృదయము నందలి రాగాంకురము లన్నియు నొక్క త్రుటిలో నీ భావోన్మాదముచే మలమల మాడి పోయినవి. ఇక రామమూర్తి తనకు శత్రువు. ప్రబల విరోధి. అతడేమాత్రమును తన కిక ప్రేమ పాత్రము కాజాలడు. తన గర్వము నణచుటకై తనను చిన్న బుచ్చుటకై తన యధికారమును చలాయించుటకై యిట్లు చేసెననుట నిశ్చయము. అంతట కాలభుజంగము వలె నిలు వెల్ల సాగి నిలువబడి నా సాహసము నేడు చూపెదననుకొనెను. కాని యావచ్చిన పదిమందియు నా రాత్రి వేళ యందు నూర్గురు వలె కాన్పించిరి. రత్నవల్లి ధైర్యమా కారణమున సన్నగిల్ల చొచ్చినది. ఉపాయమే మున్నది?

ఆ యర్ధరాత్రము నందు చల్లని సల్లని గడియలందు ఎక్కడ నుండియో రత్నవల్లికి బండి చక్రముల

మోాత విన వచ్చెను. భ్రమ యనుకొని మరల నిదాన ముగ నాలించినది. అవు నది యేదో శకటమే. అం దెవరైన నున్న తన యిక్కట్టు తీర్పరా? అయిన నిందర పై నొక రిద్ద రేమి చేయగలరు? ఏమైన కానిమ్ము. మరల నిం కొక శకటు మీా దారిని రాబోదు. అని ముక్త కంఠముతో కంపితస్వరముతో నార్తాలాప మొనర్చెను. రత్నవల్లి యొక్క ఆర్త నాదము కేళీని కేతన ప్రాకారమును దాటి, యా యంధకారమును జీల్చుకొని యా శకట ప్రాంతమును చేరినది. ఆయార్తి స్వరాఘాతమున నాబండి యట్టె నిలిచిపోయినది. ఆజానుబాహువును స్ఫురద్రూ పియునగు నొక బలిష్ఠపురుషాకృతి యాబండిలోనుండి దిగి యొక్క గంతున, వెనుక ముందు విచారించక, నిమ్నోన్నత ములు పాటించక, చుట్టు గోడనవలీలగ దాటి యా దుర్మా ర్గులను సమీాపించి మేఘ గంభీరస్వరముతో నిట్లనెను.

“దుర్గా ప్రసాదుని యొడలిలో ప్రాణము లుం డగా నొక యబలను బాధించుటకు హాని చేయుటకు సమర్థులైన యసహాయశూరు లీ రాజపురమున నున్నారా యేమి! ఛీ! ఛీ!” యని, యతి సాహస ముతో, “రండు దుర్మార్గులారా! రండు! ఈ కత్తి పోటున కాగుదు రేమో చూతము” అని భీషణముగ నాక్రో శించుచు ముందుకు దుమికెను. వెంటనే వా రందఱు మంత్రోచ్చారణముచే కట్టు వడిన మహాసర్పముల వలె నమ్రులై చేతులు జోడించి “స్వామీా! దుర్గాప్రసాదుల

వారూ! ఈసేవకుల యపరాధమును మన్నింపుడు. మీ యాజ్ఞ నెన్నడు నుల్లంఘింపము. మాకు ప్రాణ భిక్ష సేయుడు. మీ దాసాను దాసులము అని యేక కంఠముగా నందఱును నతని శరణు జొచ్చిరి. "మరల నీ వైపున కాన్పించినచో చర్మముల నొలిపించెదను" అనుమాటలతో వారలను మందలించి పంపెను. రత్న వల్లి యాశ్చర్యపడినది. చేత నొక దివ్వెను పట్టుకొని మెల్లగా శరీరకంపనముతో సుభ్రాంత హృదయ ముతో మేడపై నుండి దిగివచ్చి వాకిట నిలువబడెను. తన కట్టెదుటనే యున్న యా పురుష శ్రేష్ఠుని దీపపు వెలుతురున కనులార గాంచెను. రెండు నిముషము లెవ్వరును మాట్లాడ లేదు. ఆపురుషుండు నిశ్చలముగ నట్లే కదలక మెదలక నిలచి యుండెను. రత్న వల్లి ముఖారవింద మా యర్ధరాత్రమున నసామాన్య శోభా సముజ్జ్వలమై యుండెను. సుస్నిగ్ధము లగు కపోలపాలి కల యందొకటి రెండింకని స్వేద బిందువులు, చీర చెఱగున తుడిచినను పోక నిలిచి యుండెను. అధరము కంపిల్లుచు నెన్నియో ప్రేమక ధనము లెన్నుకొనుచున్న ట్లుండెను. ఆకసము నుండి దిగివచ్చిన సౌదామినీ లతిక వలె మెఱసి పోవుచున్న రత్నవల్లిని తప్పవాల్పక నిలు వెల్ల పరీక్షించుచు, నీడులేని యా సౌందర్యమున కచ్చెరు వందుచు గుర్వాప్రసాదుడు నిలిచి యుండెను.

అంతట రత్నవల్లి

"ఏనాటి పుణ్యమో? యర్ధరాత్రమున నాప ద్బాంధవులు మాయింటికి వచ్చితిరి. అయ్యా! లోనికి దయచేసి యీ యభాగ్యురాలి యాతిథ్య మంగీకరింపు డు" అని మాట మాటకు తడవు కొనుచు పలికెను.

దుర్గా:— నే నవశ్యము పోవల్లయును. వేఱొకప్పుడు వచ్చెదను. పోయి వచ్చెదను. ఈరామమూర్తి నుండగములకు భీతిల్ల నవసరము లేదు. నే నీ యూరనే కొంతకాల ముందును.

దుర్గాప్రసాదుడు వెనుకకు తిరిగి వెడలిపోయెను.

"ఇందఱ దురాత్ముల నొక దర్శన మాత్రముననే వంచించిన యీ మహా శూరాగ్రేసరు డెవడు?" అని రత్నవల్లి మాటిమాటికి ప్రశ్నించుకొనియెను.

—

# 3

## రత్నవల్లి సేవకురాలైనది.

రత్నవల్లి కా రాత్రి యంతయు సరిగా నిద్ర పట్ట లేదు. “ కేవల దర్శనమాత్రమున నంత బలిష్ఠు లగు నా కుటిలాత్ములను సహితము పాదాక్రాంతులనుగా నొనర్చిన యీ మహాశూరాగ్రేసరు డెవడు? నామధేయము దుర్గాప్రసాదరాయలనిగదా వింటిని. నిజముగ నతనికి జగజ్జనని యగు దుర్గామహాదేవి ప్రసాద మున్నట్లే యున్నది. ‘ రామమూర్తిని గురించి భీతిల్ల నలదు ’ అని నా కతడు ప్రసాదించిన యభయ వాక్యముల యందు తప్పక యేదో అర్థ మున్నది. రామమూర్తి కుటిల తంత్రము లతనికి తెలిసియైన నుండవలయును. లేకున్న నతడు విరోధియై యుండ వలయును. అర్థరాత్రమున క్షణ భంగురముగ నా యెదుట సాక్షాత్కరించి పోయిన ఆ తేజోమూర్తిని, బల పరాక్రమ సంపన్నుని, ఆపద్బాంధవుని దుర్గాప్రసాదుని నా వలపు వలలలో చిక్కు కొనునట్లు చేయ గలనా? అవు నాతడు తాను కేళి నికేతనపు వాకిటనిలిచిన నాలుగు నిముషములును రెప్ప వాల్పక యీ రత్నవల్లీ మోహనవిలాసమును చూచి చూచి యచ్చెరు వొందెనని నే నెఱుగుదును. సుదూర రహస్యములను సహితము నప్రయత్నముగ తిలకింప గల యితడు, తులలేని నా యీ శరీర కాంతిని కనులార గాంచి పులకితుడై, తన కామ్య వస్తువులలో నెల్ల

నిదియే నుత్కృష్టతమ మని తలంప జాలనంతటి యవివేకి
యా? ఏమో? ఆ యంధకారమును తన ముఖము నందలి
తేజఃపుంజములచే జీల్చివైచుచు నిశ్చలమై లావణ్య
మయమైన యాతని మూర్తి నేనే ప్రమత్తనై కన్నులార
గ్రోలితిని. ఆ సుందరుని ఆ బలిష్ఠుని మోహిల నే నెన్న
డును అనుభవింపని దాస్యము ననుభవించితిని. నా
కష్ట సమయము నందు నాకు సాయమును చెప్పి నన్ను కడ
తేర్ప గల యాప్తుడు నా కతని తప్ప నింకెవ్వరును లేరు.
అతనికి నా సౌందర్యము నందలి మాహాత్మ్యము నంతయు
చూపెదను. నా మాయావ్యూహము లన్నియు సన్నని
మేలి ముసుగు వలె నాతని చుట్టును కప్పియుంచెదను.
నా నయనాంచలము లందలి సౌభాగ్యమున కెందఱు
రసిక శిఖామణులు చేతు లెత్తి జోహారు లొనరింపలేదు.
మద్రూపశ్రీసమాన కవి యన్నియు వ్యర్థము లగునా? కావు.
రత్నవల్లి సమ్మోహనశక్తి నతడంధకారమున నొక
క్షణకాలము తప్ప నెక్కువగా నెఱుగడు. రాత్రులు
పవళ్లు సర్వకాలముల యందు నా యందమును కను
లార గాంచి బలిష్టములగు తన చేతులతో స్పృశించి
యందలి పరిమళముల నాఘ్రాణించినచో నతని పని యే
మగును." అని యూపరాని భావోన్మాదముతో నిటు
నటు దిరుగుచు తుదకు నిలువుటద్దమున కెదురుగ నిలిచి
యందలి ప్రతిబింబము నందలి రామణీయకమునకు తానే
యచ్చెరువంది విజయ సూచకముగ నొక చిరునవ్వు

నవ్వేను. ఇక రామమూర్తి నవలీలగ వంచించ వచ్చునని దాని యర్థము. దుర్గాప్రసాదుని సుఖోప భోగముసకు కేళీని కేతనమే యిక నిలయ మగును. మనఃపూర్వకముగ వెల యడుగక, మాటు మాట చెప్పక నతనికి సమర్పించిన యీ సుఖానుభవమునకు తన బలమును, తన పరాక్రమమును దుర్గాప్రసాదుడు బదులుగ నీయకుండునా? ఈ సందేహము లేందుకు. రత్నవల్లి యింకను చింతింప దొడగెను. "ఈ నాడే సేనాతని సఖ్యమును సంపాదించ వలయును. వే ఱొకప్పుడు నా యాతిధ్యము నంగీకరింతు నని చెప్పి యుండెను గదా? నిశ్చయముగ నేదో కామితార్థ మిచ్చుట లేకున్న యెడల నా యాహ్వానమే నిరాకరించి యుండును." అంతట చివాలున లేచి కలమును కాగితమును దీసికొని యీ దిగువ యుత్తరమునతని పేర లిఖించి పంపెను:

"ఆపద్బాంధవులును శరణాగతరక్షకులు నగు దుర్గాప్రసాదరాయల వారి చరణ సన్నిధిని మీ దాసి రత్నవల్లి వినయ పూర్వకముగ వ్రాసు కొన్న విన్నపములు..

మీ రా నాటి రాత్రి యీ దీనురాలికి తలవని తలంపుగా సాక్షాత్కరించి మహత్తర మగు నాపదనుండి విముక్తురాలిని చేసితిరి. ఈఋణమును తీర్చు కొనుటకీ యభాగ్యు రాలి కేదియు నవకాశము చూపకుండుట

భాగ్యము కాదు. తప్పక మీ రీ నా డిచ్చుటికి విచ్చేసి యొక తాంబూలము నైన స్వీకరించి పోవలయును.

సేవకురాలు

రత్నవల్లి.,

ఆ యుత్తరము నొక సారిమరల చదువుకొనెను. తన వ్రాతలకు తానే సిగ్గు పడెను. ఏమి? ఎంతటి శూరుడైనను ఎంతటి శౌర్యబలశక్తిసంపన్నుడైనను తా నింత సత్వరముగ నొక్క గడియసేపు సంభాషించి నంత మాత్రమున తన సర్వస్వము నర్పింప నెంచి తుదకతని సేవకురాలని కూడ వ్రాయ సాహసించినది. ఎంత పతిత యైనది. కాదు. ఇదియంతయు తన పని నిర్వహించు కొనుటకు పన్నిన పన్నాగము. అక్షరముల తో నెంత సేవజేసిన నేమి? అసలు తలచినది గట్టెక్కిన చాలును. రత్నవల్లి తన సందేహము లంతటితో బాపు కొని యా లేఖను సేవకున కిచ్చి యంపినది.



# 4

## కపటనాటకము.



రామమూర్తి రెండుమూడు దినము లతిశ్రద్ధతో వేచి యుండెను. కానిరాజశేఖరము తనయుత్తరములో నున్న బెదిరింపును సార్థకము చేయ లేదు. అందువలన రామమూర్తి కొక సందేహము తగిలెను. దుర్గాప్రసాదుని చేతిలో బడ్డ యుత్తరములు యథార్థములా లేక రాజశేఖరము సంగతులన్నియు నెఱిగి వంచించెనా? ఈసంశయ మతని కెంత యాలోచించినను తీరలేదు. తనస్నేహితుడు దుర్గాప్రసాదరావు రత్నవల్లితో నప్పుడె సఖ్యము చేసికొన్నాడన్న సంగతిగాని కేళీనికేతనము నొద్ద జఱిగిన బొమ్మలాటగాని యతనికి తెలిసియున్న యెడల నతడట్లు సందేహించి యుండడు. దినమునకు రెండు మూడు సారులు దుర్గాప్రసాదునకీ సందేహమును వెలిబుచ్చెను. కాని యతడు తనగూఢాలోచన లేమియు నెఱుక పఱుపక, రామమూర్తి యాతురతను సరకు సేయక యోపికతో నుండుమనియు, రాజశేఖరము తప్పక వచ్చుననియు హెచ్చరించెను. అంతకన్న నేమియు చెప్పకుండెను. రామమూర్తి యొకనాడు దుర్గాప్రసాదుని యాజ్ఞానుసారముగ నవల నొకదానిని తన మేజాపైనుంచుకొని యందునుండి వేఱొక పుస్తకమున వ్రాయుచు కూర్చుండి యుండెను. అతనికి నానాటికి విసుగు పుట్టుచుండెను. మధ్యమధ్య లేచి యిటునటు చూచుచు, తిరుగుచు, మరల తప్పనిసరిగా వ్రాతపని

నారంభించుచు పొద్దుబుచ్చుచుండెను. అతని మేజబల్ల కెదురుగా నున్న కిటికీగుండ నతడకస్మాత్తుగా తనసేవకులు కొందఱు ఒక యాగంతుకునితో ప్రసంగించుటను చూచెను. వెంటనె యొకడు పైకివచ్చి యెవరో యొకరు రామమూర్తితో మాట్లాడుటకు వచ్చినారని తెలియబరచెను. అంతట రామమూర్తి సంతోషముతో దుర్గాప్రసాదుని కడకు కబురంపెను. రాజశేఖరమును కొంతసేపు క్రిందనే గదిలో కూర్చుండ చేయుమని సేవకునిచే కబురంపి, దుర్గాప్రసాదుడు దొడ్డిగుమ్మము గుండ నొక మైదారు నిముషములలో వచ్చి రామమూర్తిని కలిసికొనెను. అంతట రాజశేఖరమునకు పైకి రావచ్చునని చెప్పనంపిరి. ఆతడు వచ్చునంతలో, నీవే మాత్రమును కోపమును తెచ్చుకొనక శాంతముతో మెలగవలయును. అతనిని హృదయపూర్వకముగ సన్మానించుచున్న ట్లగపడ వలయును. రాజశేఖరము రెండు క్షణములలో చేసికొని పోదలచికొన్న పనిని రెండు గంటలైన నగున ట్లొనర్పవలయును. నీహృదయమునందలి యుద్వేగము నణచుకొని యప్రమత్తుడవై వర్తించుము, అని దుర్గాప్రసాదుడు రామమూర్తికి హితోపదేశ మొనరించెను.

రాజశేఖరము ప్రవేశించెను. ఏమియును మాట్లాడలేదు. బలవంతముగ తెచ్చుకొనిన యతనినవ్వు చూచుట కసహ్యముగ నుండెను. రాజశేఖరము

తన సోదరి పోలికగా నుండకున్నను, చక్కనివాడు మాత్రమగును. అతని కాలేజియందలి విద్యాభ్యాసము నకు రామమూర్తియే మొదటినుండియు సహాయము చేసి యుండెను. అతడు సామాన్యముగ విద్యార్థిబృంద మునకున్న దారిద్ర్యము నెఱుగడు. రత్నవల్లి పుష్కల ముగా నతనికిధనసహాయము చేయించినది. అతనియొడలి పై వస్త్రములు మహితెలు పడిగ్గాని, కొంచెమైనమాసిగాని యుండలేదు. అతడు క్రొత్త జరీయుత్తరీయము నొక దానిని పైన వేసుకొని రామమూర్తి గదిలోనికి క్రొత్త లేకుండ నిర్భయముగ ప్రవేశించెను. కాని లోలోపల మొలక లెత్తు చిలుతలంపును కొంత యూపుకొనలేక పోయెను. సాధారణముగ నతడు ప్రసన్నమైనకన్న నోరుమూసికొని మౌనముగా నున్నపుడే యతని ముఖ ముందముగ నుండును. అందువలననే యతడు నాలు ద్రవ్యముల నణచుకొనజాలక నఖ్యమొనరించుచు సవ్విస మందహాసము చూపుట కసహ్యముగ దోచెను. రామమూర్తియె ప్రప్రథమమున నప్పమైముల సంభాషణము నారంభించెను. మర్యాద సాచుక బల హీనునివలె వస్త్రులను ధరియించి ముఖమును చిట్లించి రామమూర్తికన్న కొంచెము క్రిందిగా నాసీనుడై వంచిన తలయెత్తకుండ వ్రాయుచుండెను.

రాము:— ఏమోయి! రాజశేఖరం! ఎప్పుడురాక? ఈమ ధ్య రాజపురమునకు వచ్చి చాలదినము లైనది.

రాజ:— పరీక్షలు దగ్గరకు వచ్చుచుండుటచే తీరికలేక రాలేదు.

రాజశేఖరము దుర్గాప్రసాదుని వంక యింకను చూడలేదు. దుర్గాప్రసాదుడు మాత్రము రాజశేఖరను నాపాదమస్తకమును పరీక్షించుచుండెను.

దుర్గా:— రామమూర్తిగారు! వీరినెచ్చటనో చూచినట్లు జ్ఞాపకముండి.

రామ:- రాజశేఖరము సత్యవాడ యందలి కాలేజిలో చదువుచున్నాడు. ఆయూరనో యిచ్చటనో మీరుచూచి యుండవచ్చును.

రాజశేఖర మేమియును మారు పలుక లేదు. బల్లపై నున్న కాగితములపై నేదో పిచ్చి పిచ్చిగా వ్రాయుచుండెను. అంతలో నొక కాగితపు ముక్క గాలికి గొట్టుకొని వచ్చి దుర్గాప్రసాదుని యొడిలో పడెను.

దుర్గా:— కొంచెము ఫలాహారము తెప్పించెదరా? చాల యాకలిగానున్నది.

ఇంకేవో రెండుమాటలు మాట్లాడి రామమూర్తి యింటిలోనికేగెను. రాజశేఖరమునకు తన కార్యభంగమగునట్లు తోచెను. ఆవేళకు రామమూర్తి యింటరిగా నుండునని తలంచి యతడు వచ్చియుండెను. కాని యట్లు కాలేదు. ఆయినను దుర్గాప్రసాదుని లక్ష్య

పెట్టక రామమూర్తి మరలవచ్చుటతోడనే యతనితో నొంటరిగమాట్లాడి చెప్పదలచుకొని వచ్చిన నాలుగు మాటలు చెప్పివేసి పోదలచుకొనెను. దుర్గాప్రసాదు నాతడు వేఱొక సందర్భమున నెక్కడో చూచినట్లు లీలగా జ్ఞాపకమున్నదేకాని, యంతకన్న నతనితో నెక్కువ పరిచయములేదు. అతని చూచినంతనే రాజశేఖరమున కయిష్టముతోచినది. దుర్గాప్రసాదుడు మాత్రము తనకు సహజమగు సంతోషము నేమాత్రమును వదలుకొనక రాజశేఖరము నామాటయు నీమాటయు శ్రద్ధతో నడుగుచుండెను. గాలికి వచ్చిపడిన కాగితపు ముక్కను చేతనుంచుకొని

దుర్గా:— కాలేజిహాస్టలునందు 20 నంబరుగదిలో నామీరున్నది.

రాజ:— మీకెట్లు తెలిసినది.

దుర్గా:— 'Room No. 20,' 'Room No. 20.' అని యీ కాగితపు ముక్కపై మీరువ్రాసిన దానిని బట్టి బహుశః అది మీగదియైయుండునను కొంటిని.

రాజ:— మీరప్పుడప్పుడు సత్యవాడకు వచ్చుచుందురా?

దుర్గా:— ఈమధ్య కొంచెము పనియుండి చాలసారులు రావలసి వచ్చితిని. మొన్న నొకనాడు మీహాస్టెలు చాకలివాడు- అతనిపేరేమిటండి-

రాజ:— చాకలిరాముడు.

దుర్గా:-- అన్నిటికేమిగాని సుకుమారహృదయ యగు రాజాబాయి మరణించు సందర్భము మాత్రము అసమానమగు కని కల్పన మని చెప్పకతప్పదు.

రాజ:-- ఆసందర్భ మెట్టిది?

దుర్గా:-- నామాటలతో చెప్పిననేమి యందము? మీరు స్వయముగా చదివి తీరవలయును. ఇది మన రామమూర్తిగారి స్నేహితు లొకరు వ్రాసినా రట. దీనిలో తుడుపులెక్కువగా నుండుటచే శుద్ధమగు వేఱొక ప్రతిని తయారు చేయు చున్నాము. మీకంతగా విన కుతూహల మున్నచో నా చేతనైనంతవఱకు కొంత చెప్పెదను. రాజాబాయి చిన్నతనమున తనభర్తను గోల్పోయినదాదిగా వృద్ధయగు తనతల్లి యొద్దనే కాలముగడపుచు భగవత్కథా లోలురగు వారి సాంగత్యము సేయుచు గురు జనమునకు పరిచర్య లొనర్చుచు కాలము పుచ్చు చుండెను. ఇట్లుండగా శాంతమూర్తియును తేజస్వియునగు నొక సన్న్యాసి యాత్రాంతము నకురాగా రాజాబాయియు నతని ప్రాపునుజేరి యుతని వచనామృతమును గ్రోలుచుండెను. ఆసన్న్యాసియల్పవయస్కుడు. రాజాబాయియు జవ్వని. అతనిపరిచర్యయందు రాజాబాయికి బల సంతముగ నణచి వేయబడిన యౌవనము సరస

నిబంధములతో మొలకలెత్తినది- ఆమెహృదయ
మునందొక బ్రహ్మాండమంత పరివర్తనము ప్రా
రంభమైనది. సన్న్యాసి కాపరివర్తనము కొన్నా
ళ్ళవఱకు గోచరముకాలేదు. తుదకతనికంతయు
తెలిసినది. ఆతడొకనాటి సాయంకాలమున సుఖా
సీనుడై యుండగా రాజాబాయి యచ్చటకు
వచ్చెను. సూర్యాస్తమయవేళ యైనది. కృష్ణా
నదీజలములు వారి కనతి దూరముననే నిర్మ
లములై ప్రవహించుచుండెను. సన్న్యాసి
శాంతముగ బ్రహ్మ తేజముతో రాజాబాయి
వంకనొకమాఱు చూచె! సన్న్యాసిమనస్సునందొక
విషకీటము ప్రవేశించినది. నేనీయూరినుండి
నేడే పయనమై పోవుచున్నాను" అని సంక్షిప్త
ముగ నామెతో చెప్పెను. అంత నారాత్రియే
రాజాబాయి తల్లికొకయుత్తరము— అదియే
యామె కడసారి చీటి—వ్రాసి నిశీథ సమయమున
కృష్ణా నదీ తీరమునకేగి తన మనోగత విషాద
వృత్తాంత మంతయు నా నదీజననితో విన్న
వించి యామెలో లీనమైపోయెను. ఆమెమరణ
వార్త నొక్క నక్షత్రములు తప్ప—ఒక నిశాకాంత
తప్ప-ఒక్క కృష్ణవేణి తప్ప-నిక నెవ్వరు నెఱుగరు.
దుర్గాప్రసాదుడీ వృత్తాంతము నంతయు విపుల
ముగ చెప్పిన తోడనే రాజశేఖర మునకు

దురూహాలు దారితప్పినట్లయ్యెను. ఆ సంగతి నెఱిగి దుర్గాప్రసాదు డిట్లనియెను.

"విన్నారుగదా? మీరే స్వయముగ చదివిన యెడల నింతకన్న వేయింతలు రమ్యముగ నుండునని చెప్పగలను. కొంచము శ్రమయైనను కొనక తమరు కూడ నాలుగు కాగితములపై వ్రాసిపెట్టుడు. వచ్చినవారినెల్ల నీవిధముగనే రామమూర్తిగారును నేనును శ్రమ పెట్టు చుందుము. క్షమించ వలయును."

అని కొన్ని తెల్లకాగితములును సిరా కలమును రాజశేఖరమునకందించెను. రెండుకాగితములు వ్రాసెను. మూడవది యింకను ముగియలేదు. అంతట దుర్గాప్రసాదుడు—

"ఏది? యెంతవఱకు వ్రాసితిరి? యిక చాలును. ఆపేజీ నిచ్చటితో నాపివేయుడు. గ్రంథకర్త యీసందర్భమున నేదియో యింకను వ్రాసి చేర్పవలయునని చెప్పి యున్నాడు. అతని కామాత్రము ఖాళీ నుంచి పెట్టిన బాగుండును." అనియెను.

రాజశేఖరము వేరొక విడికాగితముపై రాజా బాయి తన జననికి వ్రాసినమరణలేఖను వ్రాయనారంభించెను.

"తల్లీ, ఇకనీదుఃఖము భరింపజాలను. నేను నాబుద్ధి పూర్వకముగ మరణించుచున్నాను. దీనికై యెవరిని

దండింపవద్దు. ఇన్నాళ్లనుండియు పంచునిప్పు లోడిలో బెట్టు కొన్నట్లు నాదుఃఖమును సహించితిని. అది నా సర్వాంగకములను దహించి వేయుచున్నది. నాయపరాధముల మన్నింపుము.

రాజ.

అంతటితో రామమూర్తి ఫలహారములతో గదిలోనికి వచ్చెను. దుర్గాప్రసాదుడా కాగితముల నన్నిటిని బొత్తి పెట్టి బల్లపై నుంచెను. వ్రాతపని యంతయు ముగిసెను. రాజాబాయి కథతప్పవేతే గాధయును ఫలాహారసమయమునందు రాలేదు. ఫలహారమైన తరువాత "మీతో కొంత మాట్లాడవలసి వచ్చితిని, వేరొక చోటికి కేగుదమా? కొన్నిరహస్యము లున్నవి." అని రాజశేఖరము మెల్ల మెల్లగా ననెను. "అభ్యంతర మేమియు లే"దని రామమూర్తి రాజశేఖరముతో కలసి యింకొక గదిలోని కేగెను. ప్రపథమమున గుసగుసలతో సంభాషణము నారంభించిరి. పోనుపోనది తీవ్రమగువాదముగా పరిణమించినది. కుచ్చితముగా తనకు 50 వేలరూపాయలైన నీయకున్ననంతయు బైటపెట్టెదనని రాజశేఖరము బెదరించి బల్లపై బిగ్గరగా చరచెను. ఆదెబ్బకు బల్లపైనున్న గాజుదీపము కదలి క్రిందపడి పగిలిపోయెను. ఆధ్వనివిని సేవకులందరును గుమిగూడిరి. రామమూర్తి "నీతోనిక నేమిమాట్లాడియు లాభము లేదు.

మనమిరుపురము నెవరిదాగిని వారు పోయిన మేలు" అని మాత్రము రామమూర్తి చెప్పి యావలికేగెను. రాజశేఖరుఁ డంత కనులెఱ్ఱ చేసుకొని "తమయిష్ట మట్లున్న నాకేమి" యని వెడలిపోయెను. ఆతఁడు వచ్చి నప్పటికన్న పోవునప్పు డెక్కుడు వ్యాకులుఁడై యుండె నని ద్వారము నొద్దనున్న వారను కొనిరి.

# 5

## హితోపదేశము

---

ఆనాడు సాయంకాలము రామమూర్తి యింటి నుండి వెడలిపోయిన తర్వాత, దుర్గాప్రసాదునకు రత్న వల్లి యంపిన యాహ్వానము జ్ఞాపకమునకు వచ్చెను. రత్నవల్లి వ్రాసిన యుత్తరమును మరల జేబులో నుండి తీసి యొకసారి చదువుకొనెను. రత్నవల్లి ముక్కిలి ప్రౌఢ యనియు, గర్వాణి యనియు సతడెఱుగును. అందువలన నా లేఖయందలి వ్యక్తమగుచున్న విషయమంతయు తెచ్చి పెట్టుకొనిన వినయముగాని యాథార్థమైనది కాదని యతడు కనుగొనెను. కాని యాలేఖ యందెచ్చటను దుర్గాప్రసాదునకు తనముఖోద్దేశ్యము రత్నవల్లి గ్రహించినదను సూచనలు లేవు. రత్నవల్లి మూఢురాలై, తన మాహాత్మ్యమును గమనింపక, పిన్నమ్మవలె తన నమ్రత్వమును పూర్ణముగ గ్రహింపజాలక, దుర్గా ప్రసాదుని మాయవలలో చిక్కుపడుచున్నదని యాలేఖ చెప్పక చెప్పుచుండెను. కేళీనికేతనమునకు ప్రయాణ మగు సమయమున నీయాలోచనలు మాత్రమే దుర్గా ప్రసాదుని మనసునకు తగిలెను. అతడంతట నిర్భయ ముతో యథావిధిగ వస్తువులను ధరించి రత్నవల్లి సందర్శనార్థమై బయలుదేరెను.

దుర్గాప్రసాదుడు వచ్చువేళకు, కేశిని కేతనపు సింహద్వారమునందు పరిచారకు లెవ్వరును లేకుండిరి. అందువలన నతడెవరికిని చెప్పకుండ, నెవ్వరిచేతను కబురంపకుండ మేడపై కేగెను. సగము దూరము మేడ మెట్లెక్క నప్పటి కెవరో మేడపై గదిలో నిరువురు మాట్లాడు చున్నట్లతనికి వినబడియెను. ఆపై నొక్క యడుగైనను పెట్టక ప్రతిమవలె నిలుచబడి యాలకించెను.

రత్న:— శేఖరం! నీకు మతిపోయినట్లున్నది. అతడు నాకాప్తుడు కాడు. నీకును గాదు. అతనిని గురించి యింతయార్భాట మెందులకు?

రాజ:— అవును నిజమే. నీవతనితో సాంగత్యము చేసితివని విన్ననాటి నుండియు నాకు మతిపోవుచునే యున్నది.

రత్న:— ఎవరితో సాంగత్యము?

రాజ:— ఆ దుర్గాప్రసాదునితో, నీగౌరవ మేమంటలో గలిసినది?

రత్న:— అతనిపై నాకెట్టి మమతయును లేదు. నిజముగ చెప్పుచున్నాను. అతడు నాకాప్తుడు కానేరడు. నాసేవకుడైన కావచ్చును.

గాని త్రాచుపాముతో కరచినదాక సాంగత్యము
చేయగూడదు.

రత్న:— అతనిపై నీకుగల ద్వేషమునకుఁ గారణము నాకేమియును బోధపడుటలేదు. నీవతనితో నెప్పుడైన కలహించితివా?

రాజ:— నేను తెచ్చుకొన్న కార్యములను నీయొద్దకు విన్నవించ నిచ్చుటకు రాలేదు. నీకు రానున్న విపత్తును జ్ఞాపకము చేయుటకు — ఇప్పటికైన తెలియ వచ్చినదా?

రత్న:— అటులనైన వేదాంతము మాట్లాడిన నేనెట్లు తెలిసికొనగలను. రానున్న విపత్తు—అపాయము— ఇదేమో నాకిప్పటికి నర్థము కాలేదు. వృధాగా నన్ను సంభాషణమున నేల దించితివి. నామాటల వలన దుర్గాప్రసాదుని వెనుక వేసికొని వచ్చి, నట్లర్థమైనదేమో, నీవు మాత్రమట్లు భ్రమ పడకుము. నన్ను నూరక భయపెట్టకుము.

రాజ:— హితవాక్యము లంత రుచిగా నుండవని నీవెఱుగవు కాబోలు. ఇక నేను వెళ్లవలయును.

రత్న:— వెళ్లవచ్చునులే, రెండు నిముషము లుండుము.

వెంటనే దుర్గాప్రసాదుడు క్రిందికి దిగ నారంభించెను. ఆతని ముఖము మొదటికన్న నెక్కువ భీకరమగు రూపమునుదాల్చెను. బొమలు ముడి

వడి కన్నులా కుంచితములై రాగ రంజితములై ఉచ్ఛ్వాస నిశ్వాసముల వేగమధికమైతోచెను. అతడేమియును సందేహింపక వచ్చిన దారిని వచ్చినట్లు మరలి యింటికి పోయెను. ఆసమయమున నతని నెవ్వరును చూడలేదు. పిదప నొక యరగంటకు రాజశేఖరుడును వెడలిపోయెను.

ఈ సందర్భమున నొక విషయము విస్పష్టముగ చెప్పవలసి యున్నది. రత్నవల్లికి దుర్గాప్రసాదునిపై గల విశ్వాసము రాజశేఖరమున కేల లేదు? ఆవిషయమున రాజశేఖరము సలహా నేల రత్నవల్లి లక్ష్యపెట్టలేదు? అని పాఠకులు సంశయించిన సంశయింపవచ్చును. రత్నవల్లి మొదట రాజశేఖరముతో తానున్నట్టి పటము ఉత్తరములను గూర్చి సంప్రతించినను నవి యతని పరముగా నీయ దలచుకొనలేదు. ఆ విషయమున తన సోదరునిపై కూడ నమ్మిక యుంచుకొనలేదు. తన మానమునకు గౌరవమునకు నవి కవచములని యామె తలంచెను. రాజశేఖర మెన్ని సలహాలైన నీయవచ్చును. కాని యాలేఖలను స్పృశింపనైన స్పృశింపజాలడు. ఆనాడు రాజశేఖరము తన సోదరిపేర వ్రాసిన యుత్తరమున దప్ప నావిషయము వారిరువురి మధ్య నెన్నడును రాలేదు. ఇక దుర్గాప్రసాదునితో రత్నవల్లి యాప్రస్తావనమే తేదల

చుకొనలేదు. ఆతడు బలిష్ఠుడని, యందగాడని యామె యొప్పుకొనునుగాని, బుద్ధి విశేషములందు తనకు లోకువ యనియే యామె దలచెను. ఆతని ధైర్య సాహసములను తన యద్వితీయ సౌందర్యముచే భ్రమయించి, వినియోగింప దలచుకొనెను. దుర్గాప్రసాదుడు తన వశమైన స్త్రీ యనతనితో "నాకీపనిచేసి పెట్టవలయును" అని యాజ్ఞాపించ దలచుకొనెను గాని, యందలి సాధక బాధకములను, గుట్టుమట్టులను నతనికి ప్రశంసించ నిష్టములేదు. "దుర్గాప్రసాదుని కాలేఖల సంగతియే తెలియకూడదు. ఆతనికి తెలియవలసిన పనిమాత్ర మేమున్నది? రామమూర్తి దాక్షిణ్యము సంపాదింపగలిగిన జాలును." అని యామె తలపోసెను. ఆమె తన కాపుడగు రాజశేఖరమును గాని, యామె నెతుకుచుండెడు దుర్గాప్రసాదుని గాని నమ్మలేదు.

# 6

## ఆత్మహత్య.

సింహాచలము తెనుగుదేశము నందన్ని ప్రాంతములను పేరొందిన పరిశోధన కళావేత్త. దొంగలు, ఖోటు నోటులు, జమీందారులు, ధనికులు వీరందఱిలో నతని మన్ననలు బడయనివారు లేరు. అతనికి నాలుగైదు భాషలయందు సలయు పాండిత్య మున్నది. మానవుల యందలి వేషభాషా మర్యాదలను బట్టి, వారి ముఖ వైఖరినిబట్టి, హాస విశేషమును బట్టి, ముఖము నందలి వికాసమునుబట్టి, వికారమును బట్టి, యెవ్వరెట్టి వారో సమగ్రముగ సూక్ష్మముగ నతడు తెలిసికొన గలడు. నవ్వులో నలువది రకములతనికి సుబోధములు. అందు నాలుగు వంచనైనను కనిన నతనికి రహస్యములు స్ఫురణకు వచ్చును. మనుష్యుని చూపును బట్టి యతని లోతుపాతుల నెఱుగగలడు. వేయేల? ఏయల్పవిషయమో విమర్శించుచూచి, యందెన్నియో విశేషార్థములతడు గ్రహించును. సామాన్యముగా నేరము లొనర్చువారి కుటిల తంత్రములన్నియు నతనికి సులభగ్రాహ్యములు. అతనికంటికి గోచరించని పదార్థము గాని యతని యాలోచనకు తగులని యూహగాని యుండబోదు. అతడేయింట ప్రవేశించినను అందలి విశేషాంశములన్నియు- అనగా నక్కడ నొడతెగనియెత్తుగ నున్నవి?

ఆ యింటి కెన్ని వాకిళ్లు, దొడ్డివాకిలికిని బావికి నెంత దూరము? మొదలగు విశేషము లెన్నియో, మన కల్పవిషయములుగా పొడకట్టునవి- యతని మనఃఫలకమున ఛాయాపటమునందలి చిత్రములవలె నంకితములై యుండును. ఈ యల్పాంశములన్నియు, తన యపూర్వ ధారణాబలముచే నతడు కావలసినప్పుడెల్ల వినియోగపఱచుకొనుచుండును. అందువలననే యతడపరాధ పరిశోధనమునందప్రతిమానప్రతిభ కలవాడని, ప్రభుత్వమువారిచేతను, ప్రజాసంఘముల చేతను కొనియాడబడుచుండెను.

సింహాచలము వయస్సు ముప్పదియేండ్లకేమాత్రమోతక్కువ. ఆతనిశరీర మూరడుగుల పొడవుగలిగి చక్కని చామనచాయతో నొప్పారుచుండును. ఆతని ముఖమునందు స్త్రీజన మనోరంజకమగు గడుసుదనముగాని సౌకుమార్యముగాని లేవు. నిడుపైన నాసికయు విశాలములగు స్ఫురన్నేత్రములును ఆతని కందగాడను కీర్తి తేలేక పోయినవి. కాని యాముఖమండలము నొకమాఱుచూచి మఱలనింకొకసారిచూడగోరనివారుండరు. దానిప్రధాన లక్షణము గాంభీర్యము. క్లిష్టమగు సమస్యనేదైన పరిష్కరించు సమయమున నతని భ్రూమధ్యభాగము తీవ్రతీక్ష్ణమగు తేజస్సుచేనుజ్జ్వలమై యుండును. అగాధమగు సముద్రమున నట్టడుగువరకు మునిగి ముత్యములుపైకి గొనువచ్చునట్లు సామాన్యమానవుల కభేద్య

ముగ కానుపించు వ్యూహము నతఁడు చెంపకు చేయిచేర్చి యర్ధనిమీలితములగు నేత్రములతో భేధించుకొని వచ్చునపుడ తనిని చూచితీరవలయును. ఏక్షుద్రపదార్ధమో యతనిని హఠాత్తుగా తదేకధ్యానమున ముంచివేయును. అతఁడు వృధాగా నేవిషయమునుగూర్చిగాని యింతవ్యాకుల మనస్కుఁడుకాఁడని యతని ముఖ్యస్నేహితుల కెవరికో తెలియునుగాని సాధారణముగా నందఱును హంతాత్సాంభవములగు నతని యావేదనలను యాలోచనలను గ్రహింపజాలకుండిరి. సింహాచలము పరమ సాధువు. కేవల మతఁడొక ప్రాణములేనియంత్రమువలె గంట కింతయని పని చేయుచుండువాఁడుకాఁడు. అతఁడే యింటి కేగినను బాలికా బాలకు లాతనికి మున్ముందుగా స్వాగతమిత్తురు. అతని యుల్లాసమును, మానవసంసారముపై నతనికిగల యనురాగమును నిర్మలములగు నాతని గుణముల యందే చూడవలెను. లేక కార్యపరుఁడైయున్న సమయమున నతని చెంత కేగితిమేని, చిన్నలుగాని పెద్దలుగాని యతని యేకాగ్రతను భంగపఱుపజాలరు.

సింహాచల మప్పటికి కొలది దినములక్రిందటనే, రాజు నగరపు జమీందారుల యింటజరిగిన ఘోరమగు హత్యా సందర్భమున జమీందారుచే స్వయముగా నాహ్వానింపబడి, విశేషశ్రమపడి యాశ్చర్య జనకమగు ప్రజ్ఞతో హంతకుని వారము దినములలో పట్టియిచ్చెను.

పోలీసువారుగాని ప్రజలుగాని, హంతకుని పట్టుకొనుట సాధ్య కార్యమని కలనైన ననుకొనలేరు. అందును, వారము దినములలో నపరాధి పట్టుపడుట వారికి నవర్ణ్యమగు నాశ్చర్యమునకు గారణమయ్యెను. ఆవిషయమును గూర్చి వార్తా పత్రికలన్నియు గంభీరములగు వ్యాసములను వ్రాయుచుండెను. 'సుదర్శనీ' పత్రిక యొక ప్రధాన వ్యాసమున సింహాచలము ప్రతిభా విశేషముల నుగ్గడించుచు, సమగ్రమగు నతని జీవితచరిత్రను ప్రకటించెను. 'కల్యాణి' యను మాసపత్రిక యందతని చిత్రపటమును, నొకపెద్ద వ్యాసమును వ్రాయబడి యుండెను. అందిది యొక వాక్యము. "సింహాచలము గారి వంటి మేధా సంపన్నులు మన తెనుగు సీమయందింకను నిలిచి యుండుట మన మహాద్భాగ్యమని చెప్పవచ్చును. అపరాధి దండనము నందు పలుమారు పొరబడు పోలీసు శాఖవారీతని పద్ధతులను సావధానముగ నభ్యసించినయెడల, చోరులవలన, హంతకుల వలన మనసంఘమున కింత యపాయముండ బోదని నిశ్చయముగా చెప్పగలము" దేశమంతయు తన్నభినందించుచున్న యీసంతోష సమయమున సింహాచలము బాల్యస్నేహితుడగు చలపతి మిత్రసందర్శ నార్థమై వచ్చెను. సింహాచలము చేసిన మహాత్కార్యము లన్నిటి యందును చలపతి స్వాయముగా పాల్గొని యుండెను. అతనికి సింహాచలముపైగలయనురాగ విశేషముచే నెల్ల

పుడును స్నేహితుని వెంటనే యుండి వీలైనపుడెల్ల నతనికి సహాయము చేయుచుండును. పోను, పోను సింహాచలమునకు చలపతి లేనిదే పనిసాగకుండెను. అతడే పని యైన తలపెట్టునెడల తప్పక దానిని గూర్చి చలపతితో సాధక బాధకములన్నిటిని చర్చించు నలవాటుపడెను. చలపతి యీనాడచటికి వచ్చునపుడు సింహాచలమును గూర్చి వార్తా పత్రికలలో వ్రాసిన భాగములను కత్తిరించుకొని తెచ్చెను. ఆదినపు వార్తాపత్రికగూడ నొక దానిని తీసుకొనివచ్చెను. అతడు వచ్చువేళకు సింహాచలము కుర్చీలో సుఖాసీనుడై యేదోయొక పద్యమును తనలో తాను గొణుగుకొను చుండెను. స్నేహితుని తన యెదుటనున్న సోఫాపై కూర్చుండుమని చెప్పి,

,, ఎన్నాళ్లకు చలపతీ! యెన్నాళ్లకు? రామ నగరమునకు నాచెంతనీవు లేనందున నెంతవగచితి నను కొంటివి? ”

చల:— నాకేదిరనుచ్చట లేకపోయిన నేమి? హత్యను గూర్చిన వార్తలు ప్రతిదినమును శ్రద్ధతో చదివితిని.

సింహా:- ఏవైన క్రొత్త విషయము లున్నవా? ఆపత్రిక యీనాటిదేనా? ఏది యిటు తెమ్ము-నాకింకను రాలేదు.

చల:— అపుడు నేనును చదువలేదు.

సింహాచలమంత నావార్తా పత్రికనటునిటు విప్పి చూచి, వార్తాసంగ్రహముండు భాగమునకై వెదకెను. కొంతసేపటి కతని ముఖము ప్రఫుల్ల మయ్యెను.

చల:— మరల నేమైన మునిగినదా యేమి?

సింహా:— దీని నొకసారి బిగ్గరగా చదివి వినిపింపుము. అని పెద్ద యక్షరములతో ముద్రింపబడియున్న యొక విచిత్రవృత్తాంతమును వ్రేలితోఁ జూపుచు పత్రికను, స్నేహితుడగు చలపతి కందించెను. చలపతియు మందస్మితముతో నది గైకొని యిట్లు చదువ దొడగెను. అది ఆదివారపునాటి పత్రిక.

# భయంకరమైన ఆత్మహత్య.

సత్యవాడ కాలేజి హాస్టెలునందు ఒక విద్యార్థి పిస్తోలుతో కాల్చుకొని మృతినొందుట.

---

శనివారము నాడు సాయంకాలము 8 గంటలకు సత్యవాడ కాలేజి హాస్టెలునందు 20 నెంబరు గదిలో విద్యార్థు లందఱును భోజనముచేసి వచ్చువేళకు రాజశేఖర మనునొక విద్యార్థి పిస్తోలుతో నెదురు రొమ్మున నెడమ వైపు కాల్చుకొని మృతినొంది

యుండెను. గదియందు కళేబరము చుట్టును రక్తప్రవాహమై యుండెను. విద్యార్థి కోటుగాని బూట్సుగాని విడువకయే హఠాత్తుగ మరణించి యుండెను. ప్రాణము పోయినపిదపగూడ చేతిలో పిస్తోలట్లె నిలిచి యున్నది. అతని గదిలో నొక పెట్టెపై రాజశేఖరము స్వహస్తముతో తన సోదరియగు రత్నవల్లికి వ్రాసిన యుత్తరము కూడ కనుపించినది. అందు స్పష్టముగా తన యాత్మహత్య విషయమై వ్రాయబడి యుండెను. ఆరాత్రియే పోలీసువారు శవమును ఆసుపత్రికి గొనిపోయిరి. హాస్టెలంతయు నల్లకల్లోలముగ నున్నది.

చల:— ఈ దినములలో విద్యార్థులయవస్థ యెంత శోచనీయముగ నున్నది. పరీక్షా భయముతోను దౌర్భాగ్యముతోను దుఃఖ భాజనులై పోవుచున్నారు.

సింహా:— చలపతీ! ఏమి విచిత్రమగు నాత్మహత్య! ఇట్టి వృత్తాంతమును నే నెప్పుడును చూచి యుండలేదు.— నిజమే! కడువింతగా నున్నది.

చల:— ఇందులో విచిత్ర మేమున్నది. ఇటువంటివార్త లెన్నిసారులు మనము విని యుండలేదు. కుఱ్ఱవానికి మనస్సు కొంచెము స్థిరము కానట్లు తోచు చున్నది.—హత్యకు కారణ మేమి యును పత్రికలో తెలుపలేదు. ఏమో? ఆత్మ

హత్యకు కారణ మొకటియా? ఎన్నియున్నవో మెవ రెఱుఁగ గలరు.

సింహా:— చూడగా, చూడగా నిందేదియో విపరీతమున్నట్లు నా కగపడుచున్నది. యని చింతామగ్నుడయ్యెను.

చల:—ఇది ఆత్మహత్య కాదనియా, తమ యభిప్రాయము. యని హేళన చేసెను.

సింహా:— (సన్నని గొంతుతో నేతి బీరకాయయందు, 'నే', కెంత యర్థమున్నదో, ఈ, 'ఆత్మహత్య' యందు, 'ఆత్మ' కంతే యర్థమున్నది. తెలిసినదా?

చలపతి:— బాగున్నది. ఇది యాత్మహత్యయని తెలిసికొనుటకు సింహాచలముగారి పరిశోధన పరిజ్ఞానమంతయు నక్కరలేదు. మృతుడైన విద్యార్థి వ్రాసిన యుత్తర మున్నది. అది స్వహస్తముతో స్పష్టముగా వ్రాయబడి యున్నది. "మఱచితిరి గాబోలు" అని పత్రికనుండి యీ భాగమును మరల బిగ్గరగా చదివి వినిపించెను.

సింహా:— మనమీ వార్తలన్నియు సవిమర్శ బుద్ధితో జాగ్రత్తగా చదువ వలయును. చదివిన దంతయు నమ్ముట నారంభించిన మొదల సత్యాసత్యము లెట్లు బయలు పడును!

చల:—నమ్మికమునకుగాని యపనమ్మికమునకుగాని యిచట తావెక్కడ నున్నది? హత్య జరిగిన స్థలము నంతయు పరీక్షించి ఉత్తరమునచూచి విశేషములన్నియు చూచిన తరువాత సందేహించిన సందేహించవచ్చునుగాని, కేవల మీవార్తను చూచి నంతమాత్రమున నేమి విశదమగును?

సింహా:— అట్లుకాదు. ఆత్మహత్య కాదనుట కిందనేక నిదర్శనము లున్నవి. అది యీవార్త నంపిన వారి పొరబాటై యుండవచ్చును. కానిసూక్ష్మదృష్టితోనంతయు విచారించిన తెలిసికొనసంగతులెన్నియో యిందున్నవి.

చలపతి కంతులేని యాశ్చర్యము కలిగెను. సింహాచలమింత గట్టిగా వాదించునని యతడను కొనలేదు. ఇపుడు సింహాచలము నోటినుండివచ్చు పరిశోధన రహస్యములను విన నత్యంత కుతూహలుడై "నట్లైన సావధానముగ విందు" ననెను.

సింహా:— ఇందలి ముఖ్యవిషయములను వేర్వేరుగా గైకొని పరిశీలింతము. మొదట హత్యజరిగిన సమయమును వివరించెదను. శనివారమునాడు సాయంకాలము 8 గంటలకు భోజన సమయము. అదియును ముప్పావుగంటకన్న నెక్కువపట్టదు. ఈ ముప్పావు గంటలో విద్యార్థులు భోజనమునకై తరలిపోవు సన్నాహమునకు లేచివచ్చు

సన్నాహామునకు నొక పావుగంట తీసి వేయవల యును. ఆ మిగిలిన పావుగంటలో నీరాజశేఖ రమను కుఱ్ఱవాడు ఆత్మహత్యను చేసికొనవల యునుగదా! సాధారణముగ నాసమయమున పిస్తోలు శబ్దమువినగాని మఱియే యితర కారణమువలన గాని తోటివిద్యార్థు లచ్చటికి రావచ్చును. లేక పిస్తోలు గుఱి తప్పినయెడల నందఱికి నది తెలియవచ్చుటయేగాక ప్రతిభంగమగును. కాన ఆత్మ హత్య చేయదలచుకొనిన నేపిచ్చివాడును సాయంకాలము 8 గంటల కుపక్రమించడు. అందునను శనివారము రాత్రి మరునాడు కాలేజికి సెలవగుటచే విద్యార్థు లందరు నెవరి పనిలో వారుండక కోలాహలముగా విహరించు చుందురు. ఎటుచూచినను నాత్మహత్యకది సమయముగాదు.

ఇక రెండవ కారణము. "ఎవరు రొమ్మున నెడమ వైపుగా కాల్చుకొని మృతినొందియుండెను" అనియున్నది గద. ఏదీ! నీవొకసారి యీపత్రికను చుట్టగా చుట్టి యాస్థానమున గుఱిపెట్టియుంచుకొనుము. చూచితివా నీకే తెలియవచ్చినది. అది యస్వాభావికము. అసంభ వము. ఎప్పుడైన నెవరు ఱొమ్మునకాల్చుకొని చచ్చిన వారి నెప్పుడైన కని, విని యుంటివా? పోనీ పొరపాటున నట్లు జరిగినదని నిశ్చయించుకొన్నను నంత తేలికగా నా

ప్రదేశమునకు చేయరాదు. ఆత్మహంతకుడు సామాన్యముగ ననాయాస మరణమును గోరునుగాని వక్షస్థలమున గాయము చేసికొని శ్రమతో వేదనతో నాలస్యముగా మరణింపనెంచడు.

ఇంకొకటివినుము. "కోటుగాని బూట్సుగాని విడువకయే" మరణించెననియు "చేతిలో పిస్తోలట్టెనిలచియున్నదనియు" కూడనున్నది. దీనికేమందువు? పిస్తోలునుండి గుండుపైకి దుముకుటకోడనే ఆక్షణమే యామహావేగమునకు ఆ ప్రచండాఘాతమునకు చేతిలోనేమియున్నను నాలుగు బారలదూరమున పడదా? కనీసము క్రిందనైన రాలిపోదా? మృత్యువాతకూడ శరీరమును స్వాధీనము నందుంచుకొనగలిగిన మానవుడెవ్వడుండును.? తన గదిలో నేకాంతమున నుండియు కూడ కోటు బూట్సు కూడ విడువలేదనుట నాత్మహంతకుని యెడల నస్వాభావికమె. పోనీ యివన్నియుగాక నతడా నాడున్మత్తుని వలె నుండి యుండవచ్చుననియు నందువలన నీయసందర్భములు తటస్థించెననియు ననుకొందమన్నచో నతడట్టి స్థితియందున్నట్లు ఎవరును తలచినట్లులేదు. పైగా నతని స్వహస్తముతో వ్రాసిన యాలేఖ యొకటి యున్నది. నిజముగ నాత్మహత్యయే యైన యెడల అర్థరాత్రముననో విజన ప్రదేశముననో జరిగియుండవలయును. రాజశేకరము వంటి స్వతంత్రవిద్యార్థి కిట్టి యవకాశములు సులభముగ లభించియుండును, సర్వసాధారణముగ నిట్టివారు కొంతపై

కాల్చుకొందురు. ఎందువలననగా నది చాల నీళ్లైన పద్ధతి. ఈవార్తా పతనమువలన నాకు తోచినవిషయము లివి. ఏమందువు చలపతీ! ఈఆత్మహత్య చిత్రమైనదని యొప్పుకొందువా?

చల:- సింహము గర్జించిన యెడలసాలేయు నిశ్శబ్దమే. ఒక్క ప్రతిధ్వని తప్ప వేరేశబ్దమునురాదు.

సింహా:— ఎవరైన మన సహాయ మపేక్షించినచో నింకను పరిశీలింప నలసిన పదార్థములు ప్రదేశములు నెన్నోయున్నవి.

చల:— ఎవరైన రావచ్చునని యే మీయభిప్రాయమా?

సింహా:— ఆ చలపతి గారికి కూడ పని తగులునట్లే యున్నది. భోజనము చేసిన తర్వాత నింకొక సారి యిటురమ్ము. రాక, రాక వచ్చినందుకు మరల వార్తలతోనే ప్రొద్దు పుచ్చితిమి. తప్పక రావలయునుసుమా?

చలపతి యంతట 'సరే' యని వెడలిపోయెను. సింహాచలమును భోజనమునకు వేళ యగుటచే స్నాన మొనర్చుటకై లేచి యింటిలోని కేగెను.

---

# 7

## ఆత్మహత్య కాదు.

సింహాచలము నివాసస్థానము ధనవల్లి. ధనవల్లి కేవలము పట్టణముగాని, పల్లెగాని కాదు. రెంటికిని మధ్యస్థముగ నుండును. అచ్చట పట్టణములందువలె జన బాహుళ్యము సెగన సంత యిరుకుగా నుండదు. కుగ్రామములందువలె నాగరికత నెరుగనిదియు కాదు. అచ్చట విశాలములగు నారామప్రదేశము లున్నవి. సాయం విహారముల కత్యంతానుకూలములగు మార్గములు కూడ ననేకము లున్నవి. ఇండ్లు క్రిక్కిరిసి యుండక దూర దూరమున విశాలములగు నావరణములతో రాజిల్లుచుండును. ఆపట్టణమున సింహాచలమునకొక స్వంతయిల్లున్నది. అది తన తండ్రి తాతలనాడు నిర్మింపబడి యీనాటికి కూడ రమ్యముగ నున్న యొక రెండంతస్తుల హర్మ్యము. సింహాచల మెన్ని దూరదేశముల కేగినను ఎందరు ధనవంతులచే నాహ్వానింపబడినను తనపని పరిపూర్తియైన వెంటనే ధనవల్లి చేరుచుండును. అచ్చటనే యతని యాలోచన లన్నియు నిర్మలములగుచుండును. ధనవల్లి చేరువగా నొక రమణీయమగు తటాకమున్నది. అను దినమును సాయంకాలమున గాని, యుదయమునగాని సింహాచలమా తటాక పరిసరములందు ప్రచారము సేయుచు తనలో తానేదియో చింతించుచుండగా

ధవవల్లీ నివాసు లాతని పలుమారుచూచి గుర్తించి యుందురు. ఇతర వేళ లందతడు సావకాశముగ తన యింటియొద్దనే కూర్చుని యుండును. ఇంతకు మునుపు చలపతి యతనితో సంభాషించిన దాగృహమునందే.

చలపతియుగూడ నా పట్టణవాసియే. అతడొక సంపన్న గృహస్థుడు. మెట్రిక్యులేషన్ ప్యాసయినప్పటి నుండియు నతడే యుద్యోగము నభిలషింపక యింటి వద్దనే సుఖముగ కాలక్షేపము చేయుచుండును. అతడు చిన్నతనమున నొకటి రెండు తరగతులలో సింహాచలముతో కలసి చదువుకొనిన వాడగుటచే చిరపరిచితుడు. అతనికి సింహాచలము సహవాసము వలన నపరాధ పరిశోధనము నందంత యాసక్తి గలిగినదో, లేక యిదివరకే యున్న యీ యాసక్తి వలన సింహాచలముతో స్నేహము కుదిరినదో చెప్పజాలము. కాని వారిరువురును ప్రాణస్నేహితులనుట నిర్వివాదాంశము.

చలపతి త్వరలో భోజనమొనర్చుకొని, యీనాడాదివార మగుటచే బడికిపోని కుర్రవానిని వెంటబెట్టుకొని పదకొండు పండ్రెండు గంటలకు సింహాచలము యొక్క గృహమునకు వచ్చెను. మొట్టమొదట కొంత కాలము కుర్రవాని విద్యావిషయమును గురించియు అన్యోన్య కుశల వార్తలను గురించియు సావకాశముగా మాట్లాడుకొన్న తరువాత సింహాచలము హఠాత్తుగా

నేదియో జ్ఞాపకము వచ్చినట్లు సహజమగు ముఖవికాసముతో నిట్లనియెను.

"పొద్దున మనము చదివిన వార్త నాకింకేదియు తలపునకు రానిచ్చుటలేదు. మనయాతట మన మోదులకు జోక్యము కలిగించు కొనవలయునని చూచుచున్నాను గాని యిందేదియో యపూర్వ సందర్భము లున్నట్లున్నవి. ఏమంటావు?"

చల:— మీరు ప్రొద్దున వివరించిన విషయము లన్నియు విశదముగా యింపుగా నున్నవనియు, మీ మేధా విశేషము శ్లాఘనీయమనియు నను కొంటినిగాని యంతకన్న నెక్కువగా మీరు చేసిన సిద్ధాంతమందు నాకు నమ్మకము కుదురలేదు.

సింహా:— నీ వనిన దంతయు నిజమే. ఒక వార్తపత్రిక యందు చదివినంత మాత్రమున నేమియు కాజాలదు. కాని యెందుకో యీ హత్య సంగతి యంతయు సంపూర్ణముగ తెలిసికొన వలయునని నాకు కుతూహలముగ నున్నది. అంతకన్న నేమియు లేదు. అయినను విదారించిచూతము.

చల:— అటైన నొకసారి వెళ్లి వృత్తము రంపు లేకున్న, నీడిననే బహుశః పోలీసు ఇన్స్పెక్టరు. వెంకటస్వామి యిచ్చుటకు రావచ్చును. అతడే యంతయును పూసగ్రుచ్చినట్లు వర్ణించి చెప్పగలడు.

సింహా:- రామనగరమునుండి వచ్చినతరువాత నింత
వరకును వెంకటస్వామిని చూచియుండలేదు.
ఈహాత్య కేమిగాని యతఁడు వచ్చిన కాలక్షే
పము మఱింత బాగుగా నుండును.

అంతలో నొక సేవకుఁడు వారు మాట్లాడు చున్న గదిలోనికి వచ్చి, రాజపురమునుండి యెవరో గుఱ్ఱపు బండి నెక్కి వచ్చిరనియు, సింహాచలముగారి దర్శనమున కనుజ్ఞ వేఁడుచున్నారనియును వచ్చి చెప్పెను. వారము దినములనుండియు సింహాచలము నభినందించుటకై స్నేహితులును, ప్రశంసకులును చాలమంది వచ్చిపోవు చుండిరి. ఆవచ్చినట్టి వారెవరో యెయుండురని యా స్నేహితు లిరువురును మరల మాట్లాడుకొను చుండిరి.

సర్వాంగ సుందరియగు నొక్క యువతీమణి యా గదిగుమ్మమునొద్ద నిలువబడి, గదిలో నిరువురు పురుషు లుండుటను గాంచి సందేహించి లోనికి రాకుండెను. వెనుకటి ప్రౌఢ విలాసములన్నియును పోయి, యించుక స్విన్నయై, యించుక లజ్జితయై యున్న యా సుందరి యపూర్వ లావణ్యముచే నొప్పారు చున్నను, ఆమెను మరల నొకసారి వర్ణింప మాకిష్టము లేదు. ఆమెయే రత్నవల్లి.

సింహాచల మంతట "మీ రేమియు సందేహింప వలదు. ఇతఁడు నా బాల్య స్నేహితుఁడు. సంశయింపక లోపలికి రండు" అని ప్రక్కగానున్న త్రివాచీ

కూర్చుండుమని సైగ జేసెను. రత్నవల్లియు నొసటినుండి రెండుమూడు చెమటు బిందువులను తుడిచికొనుచు నాసీనయయ్యెను. రత్నవల్లి కొంచెము గద్గదస్వరముతో తావచ్చిన పనినిగూర్చి ముచ్చటింప దొడగెను.

రత్న:— సత్యవాడలో నిన్నరాత్రి జరిగిన భయంకర వృత్తాంతమును వినియుందు రనుకొందును.

సింహా:— ఈపాటి కందఱును వినియుందురు. ప్రొద్దుటి నుండియు నేనును నాస్నేహితుడును సత్యవాడ వృత్తాంతమును గూర్చియే ప్రసంగించుకొను చున్నాము.

రత్న:— రాజశేఖరము నాతమ్ముడు.

సింహా:— అతడాత్మహత్య చేసికొనలేదను భయముచే నిచ్చటికి వచ్చితిరా? మ్రొక్కబోయిన దైవ మెదురుపడి నట్లైనది.

రత్న:- మీకుగూడ నీసంశయమే వచ్చియుండు నను కొని మీదర్శనార్థమై యిచ్చటికే తెంచితిని. చలపతి యత్యాశ్చర్యముతో నంతయు నాల కించుచుండెను.

సింహా:— నాసందేహమున కేమి? మీ సంశయమునకు గారణములు తెల్పిన సావధానముగ విందును.

రత్న:— నాకుగూడ నెక్కువగా నేమియుఁ దెలియదు. నాతమ్మునకు ప్రబల విరోధు లెవ్వరును నేనెఱిగి నంతవరకు లేరు. అతనిమనస్సంత విపరీతముగు మార్పునొందుటకుఁ గారణ మేమియు నాకు తెలియకున్నది. శనివారము నాఁడుదయమున పదిగంటలవరకు నతఁడు రాజపురమున నాయింటనే యుండెను. విపత్సూచకములగు లక్షణము లేవియు నాతనియందు నాకుఁ గాన్పించలేదు. అతఁడు నాకువ్రాసిన యుత్తరమును సాంతముగ పఠించితిని. 'దుఃఖమును భరించలేన'నియు "క్షమించవలయు" ననియు నేనో నాకర్థము కాని, విషయములంగున్నవి. ఆదుఃఖ మేమో నాకదివర కెన్నఁడు నతఁడు చెప్పియుండలేదు. నాకును తెలియదు. దస్తూరి మాత్రమతనిదే. ఆవిషయమై నాకేవిధమగు సంశయమును గలుగ లేదు. వ్యాకులపాటుగాని, చిత్తభ్రాంతిగాని సూచింపక, యక్షరములన్నియు స్పష్టముగా నున్నవి. ఇందులో నాకుగాని మాబంధువుల కెవ రికిగాని, నాతమ్ముని స్నేహితులకుగాని తెలియ రాని మహారహస్య మేదియో యున్నట్లు న్నది—!!

సింహా:- ఆ యుత్తరమిప్పుడు మీాయొద్దనున్నదా?

రత్న:— పోలీసు వారియొద్దనున్నది. చదువుకొనుటకై నాకొకసారి యిచ్చిమరల వారే తీసికొనిపోయిరి. వారిది యాత్మహత్యయే యని నిశ్చయము చేసుకొన్నారు.

సింహా:— గతించిన దానికై యంతగా వగచి లాభము లేదు. రాజశేఖరము నిక బ్రతికింప జాలము. అది ఖూనీయైన యెడల హంతకుని పట్టుకొనగలము. అదియును సావకాశముగ చేయవలసినపని- తీరిక చూచుకొని నేనే మరల మీదర్శనము చేసుకొందును. మీరిక రానక్కరలేదు."

అంతట రత్నవల్లి కనుల వెంబడి రాలునశ్రువుల తుడిచికొనుచు సింహాచలమునకు నమస్కరించి యటనుండి వెడలిపోయెను. సింహాచలము కొంతసేపేమియు మాట్లాడలేదు.

చలపతి నిర్ఘాంతపోయి యంతయు తిలకించుచుండెను. ఒక్క దినముగ, నొక కొన్నిగంటలలో నిట్టి విపరీతము సంభవింప వచ్చునని యితడు తలచియుండలేదు. సింహాచలము చెప్పిన మాటలన్నియు నిజముకానున్నట్లున్నవి. ఖూనీయనికూడ నిర్ధారణయగునేమో! హంతకుడుకూడ పట్టువడునేమో? అని యతడూహించి తన స్నేహితుని యప్రతిమాన ప్రతిభా సామర్థ్యములను వర్ణించుకొను చుండెను.

---

# 8

## 20 వ ప్రకరణము.

సింహాచలమును చలపతియు నా గదియందే యప్పు డప్పుడొక్కొక మాట మాట్లాడుచు చాలవరకు మౌనముగా కూర్చుండి యుండిరి. రత్నవల్లి వెడలిపోయి యింకను అరగంట యైనను కాలేదు. అప్పుడే పోలీసు ఇన్స్పెక్టరుగారు తమకోసము వచ్చియున్నారని కబురు వచ్చెను. సింహాచలము దిగ్గునలేచి గదివాకిలి వైపున కేగెను. వచ్చినది వెంకటస్వామియే. వెంకటస్వామి యంత యాజాను బాహుడు కాకపోయినను పోలీసు వర్గము నందు సాధారణముగ నుండవలసిన దేహదార్ఢ్యమును, తీక్ష్ణములగు చూపులును, నిడుపులగు మీసములును, అతని యాకృతికి వన్నె వెట్టుచుండును. అతడంత ధీమంతుడుకాడు. కాకున్న నేమి, క్రూరుడు మాత్రముకాడు. ఏ కేసు వచ్చినను క్రౌర్యమే ప్రధానముగా నతడు శిక్షితులను హింసించు స్వభావము కలవాడు కాడు. ఏదో విధముగా కొంత దయా దాక్షిణ్యములతో ప్రవర్తించి యపరాధులను సామాన్యముగా వదలి పెట్టుచుండును. అట్టి ప్రవర్తన మెన్నటికిని పనికి రాదని సింహాచల మతనితో పలుమారు వాదించుచుండును. ప్రపంచమున సాధారణముగ దోషియగువాడు నిర్దోషివలెను, నిరపరాధి యపరాధివలెను,

కన్పించుచుందురు. ఆకారణమున నపరాధము యొక్క స్వభావమును, అందలి సత్యాసత్యములను మాత్రమే కనుఁగొనుట రక్షకభటుని ధర్మమనియు, కనికర మచ్చట ప్రధానము కాదనియును నొక్కి చెప్పుచుండును. ఏమైనను వెంకటస్వామి మాత్రము సరసుడు. ఆకారణమున నే యతఁడెన్ని సారులు తప్పుత్రోవను బడి మరల్పబడినను కోపించుకొనక మరల సింహాచలము నొద్దకు వచ్చుచునే యుండును. కాని యెన్నాళ్లు వచ్చినను ధనవల్లి యందలి ప్రసిద్ధపరిశోధకుని తత్త్వమతని కేమాత్రమును బోధపడినట్లు లేదు. ఆసంగతి సింహాచలముకోరి నానాఁడొనరించిన సంభాషణము మఱింత తేటపఱచెను.

వేంకటస్వామి వచ్చుటతోడనే సింహాచలము "ఈదినము మాయదృష్టము పండినట్లున్నది. కోరికొని నంతమాత్రమున నందఱును తమంతవారే మాయొద్దకు వచ్చుచున్నారు" అనుచునొక కుర్చీపై యతనిని కూర్చుండబెట్టి యిట్లనియెను: "స్వామీ! ఈవేళ తీరికయున్నదా?"

వేంక:— ఈపాడుద్యోగమునకు తీరికి యెక్కడిది. హత్యలు, దెబ్బలాటలు, ఆత్మహత్యలు, దొంగతనములు, మాపని మాకుండనేయున్నది. మనకు విసుగు వచ్చిన దుర్మార్గులకు విసుగుపుట్టునా?

సింహా:— ఈక్రొత్త వింత యేమిటి?

వెంక:— సత్యవాడ కాలేజి హాస్టెలు నందొక విద్యార్థి ఆత్మహత్య చేసికొనినాడు. వైద్యులది యాత్మహత్యయే యని నిర్ధారణచేసినారు. మేమును సమ్మతించితిమి. ఆ విషయమై సందేహము లేదు.

సింహా:— సందర్భము లన్నియు విశదముగ చెప్పవేమి?

వెంక:— తమ బొంట్లు శ్రమపడవలసినంత యగత్య మేదియును లేదు. మాయదృష్టవశము నమృతవిద్యార్థి యుత్తరమే లభించినది. పైవారికి సక్రమముగా రిపోర్టుచేయుట, పీనుగు నాసుపత్రినుండి పంపివేయుటయే యిక చేయవలసినపనులు. కొంచెము తీరిక చేసుకొని మిమ్మును చూచిపోవుటకై వచ్చితిని.

సింహా:- ఆయుత్తరము మీయొద్దనున్నదా?

వెంక:— ఇక్కడలేదు. అయినను మీరందు చూడదగిన దేదియును లేదు. ఆవిద్యార్థి సోదరియగు రత్నవల్లికూడ తనతమ్ముని దస్తూరియేయని గుఱుతు పట్టినది.

సింహా:— వెంకటస్వామిగారి దంతయు గుడ్డిదర్బారు. హత్యలకు, దొంగతనములకు, ఆత్మహత్యలకు భేదమేలేదు. మీరందఱు నేకృతయుగముననో పుట్టవలసినవారు. స్వామీ! ఎంతనిశ్చయముతో మాట్లాడు చున్నావు.?

వెంక:— అయ్యా! మీ కాయుత్తరము నందుగాని, మఱి యింకెచ్చటను గాని రహస్యము లేవి యను వ్రాసిలేవు. మీరు పొరబాటు పడు చున్నట్లున్నది. ఏమియును లేదు.

సింహా:— ఆ యుత్తరమునుకూడ చూడక పూర్వమే నాకు రహస్యములు కొన్ని తెలిసినవి. ఉత్త రములో నేమియు లేక పోవచ్చును. కాని నాకొకసారి దానినికూడ చూడ వలయునని యున్నది.

వెంక:— మీ సమక్షమున నెన్నియో యద్భుతములు సంఘటిల్లినవి గాని యీనాడుకూడ నొక విచి త్రము జరుగనున్నదని నేనెఱుగ నైతిని. నాకం తయు నయోమయముగ నున్నది.

అంతట సింహాచలము నవ్వుమొగముతో చల పతితో చెప్పిన సంగతులన్నియు నొక్క టొక్కటిగా తెలియ చెప్పెను. వెంకట స్వామియును తను పట్టిన పట్టు విడువక పోలీసువారి చర్యయంతయు సమర్థింప చూచెను. కాని యతనికి త్వరలో నీ యాత్మహత్యే యందేదియో విపరీతమున్నదని తోచెను. సింహాచలము రత్నవల్లి యాగమన వృత్తాంతమును గూడ చెప్పిన పిదప వెంకటస్వామి మనస్సు మఱింత కలతవడెను.

వెంక:— నయమే. ఇంతవఱకేమియును మించి పోలేదు. ఏమాత్రమును జాగుసేయక ఉత్తరమునుచూచి వచ్చెదమా?

సింహా:— అంతకు మునుపే హత్య జరిగిన ప్రదేశమును మృత కళేబరమును పరీక్షింప వలయును. ఉత్తరము నటు పిదప చూడవచ్చును. అందేమి యును లేదని మీరన్న తరువాత నాకును దానిని చూడవలయునను *ఉత్సాహము తగ్గుచున్నది. ఇక బయలుదేరుదమా? చలపతీ నీ కుర్రవాని నింటి కంపివేయుము. నీవును రావలయును.

రెండు గంటల కచ్చటినుండి సత్యవాడకు మోటారుబండి పోనుండుటచే నందఱును సత్వరమె బయలు దేరిరి. ఒక యరగంటకు సత్యవాడ చేరిరి. వారు హాస్టెలు సమీపించిన తోడనే మరలనేమి మునిగి నదో యని విద్యార్థులును ఉపాధ్యాయులును వారి వారి గదులలోనుండి బయటకువచ్చిరి. తోడనే వెంకట స్వామి తాము వచ్చినపనినిగూర్చి ముచ్చటించెను. అంతట హత్య జరిగిన గదివైపునకు నడచి పోయిరి. కాలేజియును హాస్టెలును ఒక్క యావరణమునందే [illegible] దూరముగ నిర్మింపబడి యుండెను. హా[illegible] భవనము [illegible] రెండు వరుసలుగా నొక దాని నొ[illegible] యానుకొని యుండెను. అది రెండంతస్తుల మేడ. భో[illegible]లయచ్చటికి

నేబది గజములదూరమున నుండెను. భోజనశాలకును విద్యార్థి వసతి గృహమునకును మధ్యగా నొక యినుపగేటున్నది. కాని ప్రత్యేకముగ హాస్టెలునకు గాని కాలేజికి గాని శిలానిర్మితమగు ప్రాకారము లేదు. చుట్టు నన్ని వైపులయందును చిల్లకంపయు నాగజెముడును కలిసి దట్టముగ పెరిగియుండెను. అందు జంతువులు చేసినవి కొన్ని, మనుష్యులు కల్పించినవి కొన్ని, విద్యార్థులు తీసిన వనేకమును దార్లున్నవి. అది యూరికి కొంచెము దూరముగనున్న స్థల మగుటచే సాయంకాలము మొదలుదయము వఱకును విజన ప్రాంత మనియే చెప్పవచ్చును.

20 వ నెంబరు గది తాళము వేయబడి యుండుటచే వెంకటస్వామి తనయొద్దనున్న తాళము చెవులను జేబులోనుండి తీయుచు "సింహాచలముగారు! మీతో నొక సంగతి చెప్ప మరచితిని. ఈ హత్య సంగతి తెలియ వచ్చునప్పటికి గదిలోపల గడియ వేయబడి యుండెను. ఇది క్రొయ్యగడియ యైనప్పటికిని తలుపులు చాల క్రొత్తవగుటచే బైటనుండి తీయుటకుగాని వేయుటకుగాని వీలులేదు." అనియెను.

సింహా:— వెంకటస్వామిగారు! మీరు మరల మొదటికి వచ్చుచున్నారు. దయుంచుడు. యిచ్చటి స్థితిగతులను మాత్రమె నాకు గావలసినది. గడియ

తీయనగునో లేదో తరువాత నింటియొద్ద విచారించ వచ్చును లెండు.

ఆ హాస్టెలు నది యారు గజముల పొడవును నాలుగు గజముల వెడల్పును గలిగి విశాలముగానుండెను. హత్యకు పూర్వమున్న విధముననే యచ్చటి సామానులన్నియు నొక్కటియును కదలింపక యుంచ బడెను. ఒకమూలగా నొకచిన్న గుండ్రని బల్లయును దానిపై నొక ట్రంకుపెట్టియు నుండెను. దానిపైననే రాజశేఖరము తన సోదరికి వ్రాసిన యుత్తర మందలేఖను కనుపించునట్లు పెట్టబడియుండెను. దానికి ప్రక్కగా నొక యలమారు. అందు పుస్తకములుతప్ప మరేవియును లేవు. కొందర నడిగి తెలిసికొనగా నందులో నొక విద్యార్థి "రాజశేఖర మాయలమారునందు పైయరలో నేదియో యొక చిన్న జపాను పెట్టెను ప్రతిసాయంకాలమును దాచిపెట్టుటను చూచి యుంటిననియు, పగలంతయు నది యతనియొద్దనే యుంచుకొను సలవాటు కలవాడనియు, నందులో యుత్తరములు తప్ప నేమియు లేవని తా ననుకొంటిననియు, రాజశేఖరము మరణానంతరము, ఆ పెట్టె కేబునందుగాని, అలమారునందుగాని, కన్పించలేదనియు, పరస్త్రీపై యను రాగమే యీహత్యకు కారణమని యనుకొంటిననియు చెప్పెను. తరువాత నింకను కొందఱను విచారింపగా నతనికి చంద్రమతి యనునొక వేశ్యాంగనతో సంబంధ మున్నదని

విసియుంటిరనీ యొకరు చెప్పిరి. ఆపై సింహాచలము హత్యజరిగిన ప్రదేశమును సవిమర్శ బుద్ధితో తిలకించుచు మధ్య మధ్య పక్కనున్న వారి నడుగు చుండెను. ఆగదికి రెండు వైపులను రెండు కిటికీ లున్నవి. ఈరెంటికిని ప్రక్కగానున్న నొక మూలయందు మృత కళేబరము పడియుండెను. నేలపై ముఖము నానించి బోరగిల పడి యుండెను. మరణము సంభవించినది. గదికి మధ్య భాగమునగాదు. ఏమాత్రమును వీలుగల ప్రదేశమున కాదు. అచ్చటకు అందుబాటు దూరమున కిటికీగాని బల్లగాని, మరియే యాలంబన మునుగాని లేదు. అంతట కిటికీ కడ్డీలను, తలుపు చెక్కలను పరీక్షించి చూచి సింహాచలము "ఏదీ గడియ నొకసారిచూచి యిక పోవుదము" అని వాకిలి యొద్దకేగెను. ఆ కొయ్యగడి యను చాలసారు లిటు నటు త్రిప్పిచూచి, వేంకట స్వామీ యిది యూడదీయించుము. మనకు కావల యును అనెను. ఆ గడియనుదీసి చేతనుంచుకొని యా హాస్టెలు భవనముచుట్టు నొకసారి తిరిగివచ్చి "చలపతీ నీ విచ్చటనే యుండుము. వెంకటస్వామియును నేను నిప్పుడే తిరిగివచ్చెదమని" వెడలి పోయెను. మొట్ట మొదట పోలీసు స్టేషను కేగి యచ్చటినుండి యుత్తర మును గైకొని యాసుపత్రికి శవమునుచూచి వచ్చుట కై పయనమైరి. దారిలో నతి సూక్ష్మముగ సింహా చలము రాజశేఖరము వ్రాసిన యుత్తరమును రెండవ

వైపునను పరీక్షించెను. తుదకు వెలుతురున కెదురుగ నిలిపి చూచెను. వెంకటస్వామి ఔత్సుక్యముచే నాపుకొనలేక బిగ్గరగా నవ్వెను. కాని సింహాచలము గమనింపలేదు. త్వరలో నాసుపత్రికి వచ్చిరి. శవము నప్పటికింకను తీసికొని పోలేదు. కాని పైవస్త్రము లన్నియు పరీక్షించెను. తరువాత గాయమును వంగి చూచెను. మరణానంతరము శరీర మంతయు నుబ్బియు స్వాభావికముగను లోతుగనున్న గాయము స్పష్టముగ గాన్పించెను. సరాసరి యొకరోమమున్నను పిస్తోలు గుండు లోనికి ప్రవేశించలేదు. కొంచెము మెటవాలుగ క్రింది వైపునకు దిగిపోయెను. "ఇక నంతయు ముగిసినది. యీశవము యొక్క వ్రేలు ముద్రలు మాత్రము కావలయును," అని సింహాచల మనియెను.

వెంక:— మీచర్యలతి చిత్రముగానున్నవి.

సింహా:— ఎంతచిత్రమైనను నాలసింపవలదు.

ఒక పావుగంటలో సామగ్రియంతయు గొనివచ్చి యాముద్రలను తెల్లని కాగితములపై, తీసికొనిరి. అంతట మరల కలసికొందుమని, వెంకటస్వామి నంపి సింహాచలము చలపతి యొద్దకేగి యతనితో ధనవల్లి సాయంకాలము నాలుగు గంటలకు చేరెను.



# 9

## సహాంతసుదేవుడు.

---

సింహాచలమును చలపతియును మరల ధనపల్లికి వచ్చి యింటిలో సుఖాసీనులై యుండిరి. సాయంకాలము కావచ్చుచుండెను. దారిలో వారిరువురు నొకరితో నొకరు మాట్లాడుకొన లేదు. చలపతి యేమియును పాలుపోక మౌనముగ కూర్చుండి యుండెను. సింహాచలము అగాధమైన యాలోచనలో మునిగి యుండెను. ఆ హాస్యసంగతి యంతయు నెప్పుడు విందునాయని యువ్విళ్లూరు చుండెను. కాని యెంత సేపున్నను సింహాచలము భావప్రపంచమునుండి బైటికి రాలేదు. ముడిపడిన కనుబొమలతో, అన్యాక్రాంతములగు చూపులతో, సీప్రపంచమును పాటింపక తదేకధ్యానమునం దుండెను. తుట్టతుద కింటికి వచ్చిన తరువాత సింహాచలము ముఖమున క్రొత్తవికాసము కన్పట్టెను. అనని కాపుకొన లేని యుత్సాహము వచ్చెను. అతడు మెల్ల మెల్లగ మాట్లాడ నారంభించెను

సింహా:— చలపతీ! చూచితివా? మనము చూచినది యెండమావి కాదు. నిజమైన సముద్రము. ఎంత మునిగినను దీని లోతుపాతులు తెలియుట చాల కష్టముగా నున్నది.

చల:— ఇంతవర కేమైన తెలిసినదా?

ఏమాత్రిమును సందేహాము లేదు. ఆవిషయము నిర్ధారితమైనది.

చల:— హత్యయనికూడ విశదమైనదా?

సింహా:- అది విశదమగుటయే కాక హంతకుని యన్వేషణమునకు గూడ కొన్ని యవకాశములు చిక్కినవి.

చల:— ఏమీ! నిజముగా మీకన్ని సంగతులు తెలిసినవా?

సింహా:- నిశ్చయముగా.

చల:— అది సవిస్తారముగ నాకెఱిగించుట కభ్యంతరము లేదుగద?

సింహా:- అభ్యంతర మేమున్నది. నీకు చెప్పవలయుననియే నాకును కుతూహలముగా నున్నది. మరల నీతో చెప్పుటవలన నాకును మనస్సునకు తెలుపియిచ్చును. కాని యెక్కడ మొదలు పెట్టియేవిధముగ చెప్పిన నీకు సుబోధమగునా యనివిచారించు చున్నాను. ముందు విషయము క్లిష్టమగునట్లున్నది. ఇంతవరకును సావధానముగా వినుము. రానున్నదంతయు నీవేయర్థము చేసికొన గలవు.

హాస్టెలు గదిలో మొదట పరిశీలించి చూచితేనే గాని నాకచ్చట నేదియు విశదము కాలేదు. ఆత్మహత్యయయియుండదను నూహానాకదివరకే గట్టిగానుండుటచే

నాయూహానే సిద్ధాంతముగా గైకొంటిని. ఏలననగా అచ్చట కళేబరము లేదు. ఉత్తరము లేదు. అవి లేనప్పుడేగో పథకము సృష్టియుంచుకొనినగాని సత్యాసత్యములు తేలవు. క్రమపద్ధతితో నేదియు నొకదానితో నొకటి యతకదు. హత్యజరిగిన చోటును బట్టిచూడగా నాత్మహంతకు డెవ్వరును కాంక్షించు నట్టిదిగా కన్పించదు. అట్టివాడు తన్ను దా చంపుకొను నప్పుడు గదిమూలలకేల నెళ్లవలసియుండును. ఎవరైన యెంబడించినచో నట్లుచేయునుగాని వేరొకప్పు డట్లు చేయడనుకొంటిని. కిటికీగుండ నెవరైన చూచిపోవుదురను భయముచే నట్లు చేసెననుకొన్నచో, తలుపులను లోపల బంధించినవాడు కిటికీలుమాత్రము తెరచి యుంచునా? కావున నిది హత్యయే యైన యెడల హంతకుడేమైన కిటికీగుండ కాల్చియుండునా? యని ప్రశ్నించుకొంటిని. పిస్తోలు మృతవిద్యార్థి చేతులో గట్టిగా పట్టుకొనబడి యుండుటచే నది యసంభవము. ఏదైన పొడువగు కర్రతో పిస్తోలు మృతవిద్యార్థి చేతికందించి కిటికీలోనుండి యదిమిపట్టె ననుకొన్నచో ఆత్మహత్యకే కాలము చాలదనుకొంటిమిగదా, యింతదీర్ఘమగు హత్యకెట్లుచాలును. అదియునుగాక, కిటికీ కడ్డీలపైగాని తలుపురెక్కలపైగా గోడలపైగాని యేవిధమగు గుఱుతును లేదు. కావున హంతకుడు లోపలికి వచ్చియే చంపిపోయియుండును.

అట్లైన నేరగాఁడొక యుపాయముచే బయటనుండి లోపలి గడియ వేయవలసి యుండును. ఉండవలసిన నా గడియపై నేదైన సూచన కల్పించకూడదా యను కొంటిని. కొంచెము పరీక్షించి చూడఁగా నొక సన్నని యినుపతీగె ముక్క గడియకు క్రింది భాగమున గుచ్చ కొని యుండెను. చూచితివా? యీ హంతకుఁడెవఁడో మంచి తెలివి గలవాఁడు. తీగె నొకదాని లోపలి గడి యకుగుచ్చి దానిని బయటికివచ్చి, గడియను పైనుండి క్రిందికిలాగి యీ తీగను తెంపుకొని పోయి యుండును. అందుచే నాగడియ నూడఁదీయించి తెచ్చితిని. ఇప్పు టికి నాకు కొంత యాధారము చిక్కినట్లయ్యెను. కాని యాధారము కేవలము పరీక్షించినగాని నిలుచునో నిలువదో చెప్పుటకు వీలులేక పోయినది. ఇంత నత్తి వేగముతో బండిని నడిపించితిని. పోలీసు స్టేషనువద్ద రాజశేఖరము వ్రాసిన యుత్తరము లభించినది. మరల నాసుపత్రికి వెళ్లుమార్గమున నది విమర్శించి చూచితిని. దస్తూరియందు నాకింతగా నేమియు కన్పించలేదు. నా భూతద్దమును తీసికొని పోవ మఱచితిని. అదియును గాక రాజశేఖరముయొక్క దస్తూరి మాదిరులు నాయొద్ద లేవు. అవి రెంటను దగ్గర నుంచుకొనినచో కొంత లాభ ముండవచ్చును. ఉండకవచ్చునను ఎందుకు? తప్పక యుండుననియె యిప్పటి నాయూహ. ఇటువంటి వస్తువులను పరీక్షించు నప్పుడు మన కేదియో దొరకు

నని మనసులో నుంచుకొనగూడదు. మన మనుకొన నిది యెన్నడును తల పెట్టని దేదియో కనపడుచుండును. ఈ సందర్భమునగూడ నట్లే జరిగినది. ఉత్తరము నందక్ష రముల నంతగ చూడక యేదైన గురుతు లుండునేమో యని యొకమారు వెనుక ప్రక్కకు త్రిప్పి చూచితిని. అచ్చట నేముప్న దనుకొంటివి? అంగుష్టముగాకతక్కిన నాలుగు వేళ్ళలో నేదియో యొకటిరెండు వేళ్లు ముద్రలు కొంచెము స్పష్టముగా కనుపించినవి.

మలినమగు చేతిలో చెమటపట్టి యుండుటచే నాయుత్తరమున కా ముద్రలంటినవి. అవి యంత స్పష్టముగా లేకున్నను నందలి రేఖలు మనము పోల్చు కొనుటకుం గావలయు నంతశుభ్రముగనే యుండెను. మన యదృష్టము మంచిది. లేకున్ననిక రెండుమూడు దినములలో నవిమాసిపోయి యుండును. ఒకగంటసేపది మన వెంకటస్వామి చేతిలోనున్న నతని వ్రేలిముద్రలు కూడ సంకీర్ణములై యుండెడివి. ఆముద్రలతో నాకు కొంత ప్రబలమగు నాధారము చిక్కినది. రాజశేఖర మే యాయుత్తరము వ్రాసినయెడల నంత రహస్యవార్త గలిగిన ఆయుత్తరము నెవ్వరికిని చూపియుండడు. వ్రేలిముద్రలు పడునంతకాలము ఎవరివద్ద నుండదనుట నిర్వివాదాంశ మనుకొంటిని. కావున నవి రాజశేఖ రము చేతి వ్రేళ్లయందలి రేఖలై యుండవలయును. కాకున్న నిది యాత్మహత్య కానేరదు. ఈయొక్క

పనితో నన్ని సందేహములను తీరుసనుకొంటిని. ఆసు
పత్రికి వెళ్ళినతోడనే శవమునొద్ద కేగితిమి. అది
వికృతముగ నుబ్బియుండెను. కాని పిస్తోలుచే తగి
లిన యాఘాతము స్పష్టముగనున్నది. తనచేతిని
పైకెత్తి పిస్తోలు ముంభాగమును కొంచెముగా క్రిందికి
వంచి కాల్చుకొనినట్లు దెబ్బ సరాసరి తగిలి లోనికి
బోక, కొంచెమున్నతే ప్రదేశమునుండి యెవరో
కొట్టినట్లు గాయము క్రిందివైపున కేటవాలుగ నుండెను.
తప్పక రాజశేఖరముకన్న నెవఁడో దీర్ఘతర శరీరము
కలవాఁడు అతనిని వెంబడించి, రాజశేఖరము వంగి
మూలలను దాగికొనగా పిస్తోలును కాల్చియుండును.
గదిలోని దూరమునుబట్టి చూచినచో నతఁడారడుగులు
పొడవు గలవాఁడై యుండునని తోచుచున్నది. ఆపైన
మృత విద్యార్థియొక్క వస్తువులను పరిశీలించితిని.
ఆవిషయమున గూడ నాసిద్ధాంతము స్థిరపడినది.
తన్ను దానే కాల్చుకొని యున్న యెడల దెబ్బతగిలిన
చోట, బట్టలు కాలి, పిస్తోలు పొగతో మలినములై
యుండును. కోటును లోపలి చొక్కాయును, పిగిలి
నట్లున్నవి గాని, కొంచెము నల్లగానైన నుండలేదు.
వానియందెచ్చటను ఆత్మహత్యా వాసనయే లేదు.
వీనికేమిగాని నాసిద్ధాంతమును సంపూర్ణముగ స్థాపిం
చినవి వ్రేలుముద్రలు. ఇవిగో నీవే పరీక్షించి

చూడుము. ఎంత బుద్ధిహీనున కైనను వీని యందు పోలిక కన్పించునా ? రాజశేఖరము వ్రేళ్లయందలి రేఖలు రెండుపాయలై రెండువైపులకు చీలిపోవుచున్నవి. ఈయుత్తరమునందు చూడుము రెండు పాయలును గుండ్రముగా తిరిగి యొకదానిలో నొకటి కలియుచున్నవి. ఇంకను నీకేమైన సందేహమున్నదా ? చలపతీ ! రాజశేఖరము దస్తూరిని మనము త్వరలో సంపాదింపవలయును. రత్నవల్లి నింకొకసారి చూచిరావలయును. హాస్టెలులో విద్యార్థి చెప్పిన చంద్రమతి సందర్శనముకూడ చేయవలసినట్లే యున్నది. చూచితివా మరల నొక మహాసముద్రమునబడి యీదుచున్నాము. గట్టెక్కుట యెన్నాళ్ళకో, ఆసుదినము రానేరాదో. కాని ఈహంతకుడు మాత్రము సామాన్యునివలె లేడు. ఇంతటి తెలివి తేట లెక్కడనైన కని యుంటివా ?

చల:— ఆ ధనవల్లియందు సింహాచలమను నొక మహానుభావుడున్నాడు. "అని ప్రయత్నముతో ననెను. చలపతి కిదియంతయు స్వప్న వృత్తాంతమువలె నుండెను. ఎక్కడి వార్తాపత్రిక ? ఎక్కడి హత్య ! ఎంత విపులమైన వ్యాఖ్యానము ? అంత చిన్న సూత్రమున కింతటి వ్యాఖ్యానమును

వ్రాయుగలిగిన వారెవ్వరు నుండియుందురా"
యని యతడనుకొనెను.

సింహా:— ఈనాటి కింతటితో. సభ చాలింతము. ఆపటి
కథ, తేపటిది. కాని త్వరలో ముగియునది
కాదని మాత్రము జ్ఞాపక ముంచుకొనుము.



# 10

## నయ సాంత్వన.

---

రత్నవల్లి తన సోదరుడగు రాజశేఖరము మరణము వలన సూచితమైన మాట నిజమె. అతడామె కెన్నియో సమయము లందు చేయూతగానుండెను. రత్నవల్లి యెన్నడును నతని వలన సహాయము నపేక్షించలేదు. బంధువు లందరు తన్ను విడనాడియున్న దీనావస్థయందు రాజశేఖరము తనచెంత నిలిచి వెనుకటి వలెనే యామెను గౌరవించుచు ప్రేమించుచు నుండెను. ఇప్పుడు రత్నవల్లికి తనవారని చెప్పుకొనుట కెవ్వరును లేరు. బంధువర్గము నసూయను, మిత్రవర్గము నంత్యమునను శ్లాఘించువారు కొందరు సూచించువారు కొందరును డిరి కాని రాజశేఖరమువలె తన యపరాధములన్నియు మన్నించి, యనురాగముతో చూచువా రెవ్వరును లేరు. కేళీ నికేతనము మహా వైభవమున నున్న కాలమున గూడ, సుఖపారవశ్యమున దేలుచున్న సమయములందు గూడ రత్నవల్లి తన సోదరునితో రెండు మూడాప్త భాషణము లాడు కొనుటకై పరితపించుచుండెడిది. ఎంత చెడినను ఒక్క తల్లిబిడ్డలుకదా. అందువలన రాజశేఖరము మరణమువలన నామెపొందిన దుఃఖము, సాధారణమైనది కాదని నిశ్చయముగా చెప్పవచ్చును. సామాన్యపు టెల్లాడ వలెగాక యామె జీవనము విల

క్షణముగ నుండుటచే కొందరకు కొన్నికొన్ని యపోహలు కలుగ వచ్చును. ఇంత దుఃఖములో నున్నను రామమూర్తి నవమానింప నామె చేయు ప్రయత్నములు మానకుండుట వలన నీవిషయమిచ్చుట హెచ్చరించ వలసి వచ్చినది.

ఇంత వరకు దుర్గాప్రసాదుడు కేళీ నికేతనమునకు రెండు మూడుసారులు వచ్చియుండెను. అందు వలన నతడచ్చట చిర పరిచితుడనియే చెప్పనగును. శనివారమునాడు హత్య జరిగిన సమయమున అనగా సాయంకాలము 8 గంటలకు దుర్గా ప్రసాదుడు రత్నవల్లితో మాట్లాడుచు తానిక నంత తరచుగా కేళీ నికేతన మునకు వచ్చుట భావ్యము గాదనియు, తనపని కూడ భంగమగుచున్న దనియు చెప్పి రత్నవల్లినే తన యింటికి రమ్మని యాహ్వానించెను. వచ్చిన యెడల రామమూర్తిని వేధించు మార్గములు కూడ చెప్పెదనని చెప్పి వెడలిపోయెను. మరల పిలిచినను రాలేదు. ఈ సందర్భమున నొకటి రెండు మాటలు చెప్పవలసి యున్నవి. దుర్గా ప్రసాదునకు రాజపురము నిల్లులేదు కాని యెవరిదో బంధువుల గృహము మాత్రమున్నది. రత్నవల్లి నాహ్వానించినాడు. ఆ బంధువు లూర లేకుండుటచే నదియే తన యిల్లని చెప్పి దుర్గా ప్రసాదుడు సుఖముగా రత్నవల్లిని వంచింప దలచుకొనెను.

రత్నవల్లి పాము పగపట్టినట్లు రామమూర్తిపై వైరమూనినది. దుర్గాప్రసాదుడు తన పక్షము వహించి నప్పటినుండియు రామమూర్తి దురాలోచనలు సాగుట లేదని యామె తలచినది. లేకున్న రామమూర్తి యేమియు చేయక యింతకాల మూరకుండునా? లేక యీ మౌనమున కింకేమైన గూఢార్థ మున్నదా? హఠాత్తుగా నామెకీ సందర్భమున తన తమ్ముని మరణము జ్ఞాపకమునకు వచ్చెను. రామమూర్తికి హత్యయందలి భాగ ముండియుండునా? అని యామె పలుమారు తలపోసినది. ఆ నాడుత్తరములకై తనయొద్ద కుత్తరములకై వచ్చుటతప్ప యింతవరకును కేళీ నికేతనము వైపునకే రాలేదు. ఆరాత్రి యం దెవరినో కొందరను లోకంబోతులను తనయింటి యొద్ద సల్లరి చేయుటకై పంపుటతప్ప ఆనాటినుండి మరియే యాగడమును చేసి యుండలేదు. ఈ మౌనమున కేమి కారణము. ఇది నిశ్చయముగ ధూర్తలక్షణమనియే యామె తలపోసెను. కాని యీవాద మంతయు నతనికిని తనకును గల వైరము వలన వచ్చినది. అందువలన న్యాయ మార్గానుసారముగ రామమూర్తిపై నేరము మోపుట కామె కేవిధమగు నాధారమును లభింపలేదు. ఈ యుత్తరముల సంగతి ప్రకటించినచో నతని తనపైగల వైరకారణమును, తనమూలమున తన సోదరునిపై యీర్ష్యా కారణమును, ఋజువొనర్చి

యూమె నేవిధముగనో హత్యకును రామమూర్తికిని సంబంధము కలుప వచ్చును. కాని యీ వృత్తాంతము బట్టబయ లైనచో రామమూర్తికిఁ అవమానమను మాట సిద్ధించునేమో కాని తన యవమానముమాత్రము సర్వసిద్ధము. ఇపుడు శ్రీని కేతనమునందలి వైభవమంతయు తగ్గినది. ఇపుడచ్చట ధనరాసు లేవియును మిగిలిలేవు. అందువలన రామమూర్తి వివాహమున కాటంకము కల్పించి రత్నవల్లి తనకు కావలసిన ధనమును సంపాదింప నెంచినది. అందెవ్వరికిని భాగము పంచి యీయ దలచుకొనలేదు. రామమూర్తికిని తనకును తప్ప నారహస్య మెవరికిని తెలియగూడదు. వారిద్దరికే తుదకు రాజీకావలయును. ఆ రాజీ కొక్కటియే షరతు. రత్నవల్లికి యేబది వేల రూపాయలు ధారాగతము చేయుట. ఆ కారణమున దుర్గాప్రసాదునకైన నా సంగతి చెప్పలేదు. ఆ కారణముననే రామమూర్తిని వేధించుటకు, అవమానించుటకు మార్గములున్నను వానిననుసరింప దలచుకొనలేదు. కేవల మిప్పుడామె ధనాశచే పీడింపబడుచుండెను. అది నానాటికి వృద్ధియైన కొలదిని తన సోదరుని మరణవృత్తాంతమునందలి విషాదము తగ్గిపోవుచుండును. రాజశేఖరము విచిత్ర హత్యవిషయమై యామె సింహాచలమునొద్ద కేగినందులకు హేతువు కేవలము హంతకుని యన్వేషించి దండించుటకే గాదు. కూనీయని తేలిన తరు

వాత దుర్గాప్రసాదుని సహాయమునేనైన యుపాయ
ములు పన్ని యతని వలలో నిఱికించుటకు రత్నవల్లి
కేళీనికేతనమునందలి యిప్పుడు భాగ్యదేవతగా నుండ
లేదు. ఆమె, యుపాసకులేని యొక క్షుద్రదేవతవలె
నున్నది.

ఆమె యొకనాడు ముందుగా కబురుపంపి దుర్గా
ప్రసాదునియింటికి ప్రయాణమైనది. ఇకననతికాలము
ననే దుర్గాప్రసాదుని తనకు వశవర్తిగా నొనర్చుకొనవ
చ్చునని యామెతలపోసెను. ఆనాడామె తనయావచ్ఛ
క్తియు చాతుర్యమును వినియోగించి శరీరమంతయు
సింగారించుకొని బయలుదేఱెను. ఎవ్వరి నేవిధమున
వంచింప దలచుకొన్నను నామె కొకటియే ఆయుధము.
అది యామె లోకమోహనమగు సౌందర్యము. అపరా
ధివర్గము నందాసౌదర్యమును గూడ పాటింపక తమ
దుస్తంత్రముల నీడేర్చుకొనువారున్నారను విషయ మా
మెకు తెలియదు. ఒకవేళ తెలిసినను రత్నవల్లి యామాట
యందు సత్యమును కనుగొనలేదు— అదితన యనుభ
వమునకు విరుద్ధమని యామెతలంపు. ఆమెయొద్దనుండి
కబురువచ్చినతోడనే దుర్గాప్రసాదుడు తన కపటనాటక
మును సిద్ధపఱచియుంచెను. అతనిసహవాసులలో కొంద
రను పిలుచుకొనివచ్చి యొకరిద్దరకు పారాజవానులగాను
వేఱొక కొందరను పాదసేవకులనుగాను వేషములు
మార్చి రత్నవల్లి యున్నంతసేపును తన యాజ్ఞపాలించు

చుండ నియమించెను. వారును దుర్గాప్రసాదుని మాట నుల్లంఘింపనేరక యొడంబడిరి. ఈవేషములన్నియు నియమితస్థానములందు నిలచిన కొంతసేపటికి రత్నవల్లి బండి వచ్చివాకిటనిలచెను. ఒకరచ్చటికేగి బండితలుపులను తెరచి భద్రముగా నామెను దించిరి. నేస్తకాండ్రామె వెంట నుండి లోనికిగొంపోయిరి. గృహాభ్యంతరమున నలుచదర మగు నొకగదియందొక పెద్దమంచము, ఆమంచముపై హంసతూలికాతల్పమునుబోలిన యొకపట్టుపరుపు, దాని పై దుర్గాప్రసాదుడు తలవైపున నాలుగుదిండ్లును, కాళ్ళ వైపున నాలుగుదిండ్లును పెట్టుకొని సుఖముగ శయనించి యొకపుస్తకమును చదువుచుండెను. ఇరుప్రక్కల సేవకు లతని పాదము లొత్తుచుండిరి. మఱియొకడు తలవైపున నిల్చి బ్రహ్మాండమగు విసనకఱ్ఱతో విసరుచుండెను. రత్నవల్లి ప్రవేశించుటతోడనే గ్రంథమును చాపపై కూర్చుండుమని దుర్గాప్రసాదుడు సైగచేసెను. రత్నవల్లి నమస్కరించి యొయ్యారముగా నియమితస్థానమున నాసీనయయ్యెను. దుర్గాప్రసాదుడు లేశమైన లేవలేదు. రత్నవల్లి వంకనైన చూడలేదు. ఏదియో మహాలోచనలో మునిగియున్నవానివలె నభినయించుచు గంభీరమగుకంఠస్వరముతో,

,, వల్లీ! నేను కార్యావసరముచే యొకదూర దేశమున కేగవలసియున్నది. అందువలన నిన్నిచ్చటికి సావకాశముగ మాట్లాడుటకై రప్పించితిని. జరుగ

వలసినదంతయు నీవొప్పగినే జఱుగ వలయును. ఆలస్యమున కేమాత్రమును సమయముకాదు.

రత్న:— మరల మీ రెప్పుడు తిరిగివచ్చెదరు?

దుర్గా:— తిరిగివచ్చునప్పటి మాట యిప్పుడేల? నే నిచటనుండగనే యన్నియును నెరవేర్చుకొన వలయును. ఆరాత్రి జరిగిన కల్లోలము తప్ప మఱింకేమి యాగడము నిటీవల తటస్థించలేదుగద?

రత్న:— మీ రేగిన పిదప మరల నారంభించునేమో?

దుర్గా:— అది నివారించుటకే మార్గము లాలోచింప వలయును,

రత్న:— మీరుమాత్రము దూరదేశమేగి రాకున్న నేయాలోచనయు కొనసాగదు. అదియే యితని కవకాశము.

దుర్గా:— ప్రస్తుతము నే నేగక తప్పదు. నేనిచట లేనని గాని, యొకవేళ నేనువెళ్లిన సంగతి తెలిసినచో మరల రానని గాని రామమూర్తి గ్రహించకుండను. అంతమాత్రము భయమున్నగాని కార్య సాధనము కానేరదు. నేను రేపటి దినమున సత్యనాథ కేగెదను. నీవు నచటికి మన మనుకొను సమయమునకువచ్చియుండుకొనుము. అచ్చటికి రామమూర్తినికూడ పిలిపించెదను.

నీయెదుట నతని నిలువబెట్టి యవమానమొనర్చి యంపెదను. ఆశాభంగముతో నతనికి తప్పక తెలివివచ్చు ననుకొందును. రాకున్న వేఱెవ్వియైన శైత్యోపచారము లాలోచింప వచ్చును.

రత్న:— కేళీనికేతనము మీస్వగృహముగా భావించి దాని పరువు మర్యాదలను నిలువబెట్టవలసిన భారము మీపైనున్నది. నేను పోయి వచ్చెదను.

రత్నవల్లి మనస్సున రాయిపడి నట్లయ్యెను. దుర్గాప్రసాదు డెచ్చటికో యేగిన తనగతి యేమగును? అతని నెంత మాత్రమును పోనీయగూడదు. తనసౌందర్యమతనిని కేళీనికేతనమునందే కదల మెదలలేకుండ బంధింప జాలకపోయినది. అయినను ప్రయత్నమును విసర్జించ కూడదు. దుర్గాప్రసాదుని యెడల నపూర్వమగు ప్రేమ పారవశ్యమును గూడ ప్రకటించెదను, అని రత్నవల్లి యనుకొనెను. "ప్రసాదుని నన్ను విడనాడి పోనియను."



# 11

## రసభంగము.

---

సత్యవాడ యందలి న్యాయస్థానమునకు కొంత దూరమున యాత్రిజనము విశ్రమించుటకై యొక చక్కని భవనము నిర్మింపబడియున్నది. ఆగృహము నందొక గదిని తీసుకొని యున్న వసారాయందు, దుర్గా ప్రసాదుడును, రత్నవల్లియును నిలిచి మాటలాడుచుండిరి. దుర్గాప్రసాదుడు ప్రొద్దుననే యచ్చటికి వచ్చి భోజనము కావించికొని విశ్రమించియుండెను. రత్నవల్లి మాత్రము రాజపురమునందే భోజనాదికము కావించుకొని దుర్గా ప్రసాదుని యాజ్ఞను జవదాటలేక యింతకాలమునకు తన యత్తవారింటికి వచ్చియున్నది. ఏదియో రహస్య మును గూర్చి చాలసేపు వారిరువురును మాటలాడుకొనిరి. అంతట దుర్గాప్రసాదుడు "సఖీ! రామమూర్తి నింక పిలి పింతునా?" యనెను.

రత్న:— రాజపురమున కిప్పుడైనఁ బురంప నెంచితిరా?

దుర్గా:— ఆవిషయమంతయు నిదివరకే ముగిసినది. నిన్ననే యూహ్యాన పత్రికఁ బంపితిని. అతని నీయూరికివచ్చి వేచియుండుమని చెప్పితిని. ఇక నరగంటలో నతఁడు వచ్చును. దుర్గాప్రసాదు నతఁడు వంచింప నెంచునంతటి బుద్ధిహీనుఁడు కాఁడు, అది నామనసునకుఁ జెరలాటము.

రత్న:— నేను చేయవలసిన దేమున్నది.

దుర్గా:— నీవేమియును మాటాడవద్దు. నీయెదుటనే రామమూర్తిని మందలించెదను. నీతో రాజీ యొనర్చుకొనినగాని బ్రతుకుపై యాశయుంచు కొనవలదని స్పష్టముగా చెప్పి యొప్పించెదను. ఈయూర నాబంధువుల యింటియొద్ద నొకింత పని తీర్చుకొని మరల రాజపురమున నేడో, రేపో కలసికొందును. నీవీ లోపున నతనితో సంభా షించి సారాంశమున నాకెరిగింపుము. నీవి మాత్రమునైనను తప్పక చేయవలయును.

రత్న:- నేను రామమూర్తితో నిక మాటాడజాలను.

దుర్గా:— నీవేమియు నతని సముఖమున వినయముతో వర్తించ నక్కరలేదు. అతడేనిన్ను పలుకరించును

దుర్గాప్రసాదు డొక సేవకుని బిలిచి రామమూర్తిని తోడ్కొనివచ్చుటకై యంపెను. రత్నవల్లి చింతాపర తంత్రయై కొంత తడవూరకుండి దుర్గాప్రసాదుని వంక తన విశాలములగు రెండు నేత్రములను విప్పి చూచుచు సాభిప్రాయముగా నిట్లనియెను.

“ నా తమ్ముని మరణ సందర్భమున రామమూర్తి కేమాత్రమో సంబంధమున్నట్లున్నదని నాకను మానము!”

దుర్గాప్రసాదు డా మాటలు విని నిర్విణ్ణుడై పోయెను. రత్నవల్లి తన్ను దారుణకర్మను రామమూర్తి పై మారోపాయమున నెట్లో యాలోచించ గోరు చున్నదని యతడు గ్రహించెను. తా నెదురాడిన ఎడల రత్నవల్లికి తనపై గల నమ్మకము తగ్గి పోవునేమో యని యతడు భయపడెను. తన భావవిపర్యయ మంతయు నడచికొని.

"వల్లీ! నీ తమ్ముని చావు నా తమ్మునిచావువలె భావించు చున్నాను. నీవు చెప్పకయే నీయనుమానము నాకును స్ఫురించినది, కాని యిది సమయము కాదు. అందువలన లేనిపోని యిబ్బందులు రావచ్చును. హత్యా నేరమును రామమూర్తిపై త్రోసిన యెడల నతనికిక సుఖ జీవన ముండదు. ఆ మాట నిజము. కాని మనకు మాత్రము సుఖ మెక్కడిది ? వేదాంత శాస్త్రమున చెప్పినట్లు గోవును బంధించి తెచ్చు గోపకునకు గోవున కెంత స్వతంత్రమో అంతే. గోపకు డిట్లనును "ఇదిగో! నీవు నాబంధనమున చిక్కితివి. నీవిక తప్పించు కొనిపోజాలవు" అందులకు గోవు చెప్పుప్రతి వచనమిది "నన్ను బంధించిన త్రాడే నిన్నును బంధించినది. నీవును నన్నుతప్పించు కొనలేవు. మన మిరువురమును ఖైదీలమే" మన స్థితియు నట్లుండును. తుద కేమగునో దైవమున కే యెఱుక. ముందుగా, న్యాయ స్థానముల కని, న్యాయ వాదులకని, రక్షక భటులకని, మన ధనమును, గౌరవము

నర్పింప వలయును. అదియును గాక రామమూర్తి మన కు తగ్గరవాడి కానేరడు. మనము, నతడును కలసి ప్రభుత్వమునకే యుత్తరవాదుల మగుదుము"

ఈసంభాషణ ముగియుకి మునుపే రామమూర్తి వచ్చెను. అతడు రత్నవల్లిని చూచినతోడనే యాశ్చర్యము నభినయించెను. రత్నవల్లి యతనిని కన్నెత్తి చూడలేదు. దుర్గాప్రసాదుడు రూక్షవీక్షణుడై రామమూర్తి వంక తేరి చూచుచుండెను. రామమూర్తి కూర్చుండుమని కూడ చెప్పలేదు. రామమూర్తి మాత్రమేమియును తోచనివానివలె నటునిటుచూచుచు మాట తడబుకొను నట్లు నటియింపసాగెను. అంతయు నొకగడియ సేపు నిశ్శబ్దముగనుండెను. దుర్గాప్రసాదుడంతట!

"రామమూర్తిగారు, మిమ్ము నెందుల కాహ్వానించితినో తెలియవచ్చినదా" యనియెను.

రామమూర్తి మాట్లాడలేదు. మరల దుర్గాప్రసాదుడు

"ఈసాధ్వీమణిమెదుట నీవు నీచుడవై ప్రవర్తించితివి. నీవావిషయమున నేదియుచెప్పనక్కరలేదు. అంతయు నేనెరుగుదును" అనిగద్దించెను.

రామమూర్తి దిక్కులుచూచుచు నిలువబడెను. కాని బదులుచెప్పలేదు.

దుర్గా:—నాకవసరమగు కార్యమున్నది. ప్రస్తుతము నీతో నొకటి, రెండు మాటలు చెప్పవలసియుండుటచే నిన్నిచ్చటకుబిలిపించితిని.రత్నవల్లిఇప్పుడు రామమూర్తి ని జయసూచికముగ కనులెత్తి చూచినది. రామమూర్తి యు నించుక దీనమగు దృష్టితో నామెను చూచెను. అతని ముఖము నందలి దైన్యమును గాంచినంతనే రత్నవల్లి యహంకారము మెఱుపుతీగవలె నొక్కసారి హఠాత్తుగా మెఱసినది— త్రిలోకసుందరియగు నావంటి యువతిని తిరస్కరించి నందుకు ఫలమిదియని యామె ముఖమండలము చెప్పకయే చెప్పుచుండెను.

దుర్గా:— అర్ధరాత్రమున నసహాయశూరుడవై పరస్త్రీల నవమానించుటకు తుంటరులను పంపుటకన్న నీబుద్ధికే యుపాయమును తోచినదికాదా? నీమగతన మెక్కడకేగినది—అందులో వలచిన యువతి నిట్లుచేయుట నీవుపరమనీచుడవని వెల్లడిచేయుచున్నది— మరల నేదైన పన్నాగమును పన్నుచుంటివా లేకయింతటితో విరమింపనెంచితివా?॥

రామ:— మీరంత ఖఠినము మాటాడవలదు.

దుర్గా:—నీవు నీచుడవు. నీయెడల కఠినముగనే ప్రవర్తింపవయును.

రామ:— ఆప్రవర్తించుటకు పూర్వము న్యాయాన్యాయములను సమదృష్టితో విచారించవలయును.

విరోధమంతయు ప్రణయ కలహము వలె సమాప్తి నొందిన బాగుండునని యతడనుకొనెను. కాని యది యెట్లు సంభవించును? ప్రణయ కలహముల వలన హత్యలు జరుగునా? ఎంతమాట! రత్నవల్లికిని రామమూర్తికిని మధ్యగానొక యగాధమగు జలరాశియున్నది. అది తరింప నెవరితరమగును. కాని రామమూర్తి యా సముద్రము మాట మఱచిపోయెను. ప్రేమ విహ్వలమగు కంఠస్వరముతో నత డకస్మాత్తుగా 'వల్లీ' యనెను. రత్నవల్లి యులిక్కిపడినది. ఆకంఠస్వరమున చిరకాలము నాటి, యనురాగము, మాధుర్యము నుత్కంఠయు నామెకును స్ఫురణకు వచ్చినవి. రత్నవల్లియూ రాగాంకురములను తల యెత్తనీయలేదు. రామమూర్తిపై తనప్రాచీన పాఱనదని యామె యుత్సహించెను. అతని నింకను మోహింపజేయ వలయునని యొక్క చెఱునవ్వు నవ్వినది. ఆ మందహాసముతో రామమూర్తి సకలావయవములును తమతమ నెలవులు తప్పినవి. అతడు మృదు మధురస్వరముతో,

"వల్లీ! నన్నును మరచితివా" యనియెను.

రత్న:— నాపేరు రత్నవల్లి. వల్లికాదు. మర్యాదను మరచిపోవలదు. పరస్త్రీ నిట్లవమానింప దగదు.

రామ:— నీవు నాదానవు. పరస్త్రీవి కావు.

రత్న:- ఈధౌర్త్యమును నేనిక సహింపను. నాకు కావలసినదియే బదివేల రూప్యములు. నీ ప్రేమ కాదు. దానిని రామేశ్వరశర్మ పుత్రికకిచ్చి రమ్ము. నాకక్కరలేదు.

రామమూర్తి యాంత రత్నవల్లిని సమీపించి యామె నాలింగనము చేసికొనబోయెను. రత్నవల్లి నిలువెల్ల సాగి నిలిచి యాపాదమస్తకము వణకుచు నొక్క త్రోపు త్రోసినది. ఆమె పైట చెఱగు కుడిభుజమునుండి జారి పోయినది. ఆమె యౌవన లావణ్య మించుకను తగ్గి పోలేదు. అప్సరసలను సైతము తిరస్కరించు శృంగార లక్ష్మివలె ధిక్కరించి యామె నిలువబడియెను. అంతట రామమూర్తికి తెలివి వచ్చినది. రసభంగమైనదని తెలిసినది.

రాము:- ఏబదివేల రూప్యములు నాయొద్ద లేవు.

రత్న:- లేకున్న సంపాదించుకొని రమ్ము.

రత్నవల్లి యటనుండి శీఘ్రముగ నేగి తన శకటము నెక్కినది. రామమూర్తి మహదాశ్చర్యమున మునిగి యుండెను.



పోకసారియైనను మరల రాలేదు. అన్నిప్రయత్నములును విఫలములైనవా యని యతఁడు సందేహించెను. దుర్గాప్రసాదు డికమీఁద వెనుకటివలె తనయింటికి వచ్చుచు పోవుచు నుండఁజాలఁడని యతఁడు గ్రహించెను. అందుచే యతని వార్తలు తనకెట్లు సకాలమున తెలియఁగలవు? దుర్గాప్రసాదు డెంతటి ప్రమత్తుఁడా? అతఁడేదియు నిమిత్తము లేకుండ నిట్లూరకుండఁడు. కాని యానిమిత్తమేమై యుండును? అని మరల రామమూర్తి ప్రశ్నించుకొనెను. సంశయ నివారణమున కతని కేమార్గమును కాన్పించలేదు. తాను వివాహప్రయత్నము లోనగుచుండవలసిన సమయమున నిట్లు సంశయగ్రస్తుఁడై యుండు టతనికి దుర్భరముగ దోఁచినది.

ఆనాఁడు సత్యవాడ న్యాయస్థానమున రత్నవల్లి యాడిన పీరాలాపములుగాక, మరల నొకసారి రామమూర్తికి కబురంపినది. ఉత్తరము వ్రాయలేదు. రమ్మనలేదు. మరి యాకబురెట్టిది? ఒక సేవకునిచే రెండుమాటలు మాత్రము చెప్పనంపినది. నిష్కర్షగ వివాహదినమునందు, ప్రొద్దుటిపూట, పసుపుతో, తోరణములతో నలంకరింపబడిన రామేశ్వర శర్మ యింటియందు, రామమూర్తి పెండ్లిపీటలపై కూర్చుండఁబోవు సమయమునందే, యుత్తరములకు నకళ్ళు వ్రాసి, ఛాయాపటమునకు ప్రతులు తీసి పంచిపెట్టెద నని చెప్పనంపినది. అంతకన్న నింకేమి పరాభవము

కావలయును? రామమూర్తి యీవివాహమును మాను కొనుటెట్లని యాలోచించెను. ఆ యాలోచనలు ముగి యకపూర్వమే, పరిణయము జరిగి తీరవలయునని నిశ్చ యించుకొనెను. ఆ మనోనిశ్చయమునకు వేఱొక నిశ్చ యము గూడ కావలసి యుండెను. లగ్నము నాటికి రత్నవల్లియొద్దనుండి యుత్తరములును, పటమును సంపా దింప వచ్చునను నిశ్చయము. అది యెట్లు కుదురును? అత డిట్లు తర్క వితర్కములలోబడి కొట్టుకొనుచుం డెను. అట్టి సందిగ్ధ సమయములం దతని కొక యల వాటున్నది. దుర్గాప్రసాదుడు వచ్చిన ఘడనే యేదే నొక యుపాయము లభింపక పోదను నమ్మకముతో నతని భయము లన్నియు శాంతించును. ఈ నాడును గూడ దుర్గాప్రసాదునికొఱకై వెఱ్ఱివానివలె నిరీక్షించు చుండెను. అంతలో క్రింద కాలిచప్పుడులు వినవచ్చెను. ఇంకొక ముహూర్తమున తన సేవకు డొకడు గదిలోనికి వచ్చెను. దుర్గాప్రసాదుడు రాలేదు. ఒక బంగీవచ్చినది. కొన్ని యుత్తరములు వచ్చినవి. సేవకు డంతట క్రిందికి దిగి పోయెను.

రామమూర్తి యంతట నిదానముగా నొక కుర్చీ యం దాసీనుడై యుత్తరముల నొక్కొక్కటిగా విప్పి చదువు కొనెను. అవి యన్నియు బంధువులు వ్రాసినవి. మిత్రులు వ్రాసినవి. ఒకటి మాత్రము రామేశ్వర శర్మ యొద్దనుండి వచ్చెను. దానియందు,

రామమూర్తి కుశల ప్రశ్నలును వివాహ ప్రయత్న ముల వర్ణనమును నిండియుండెను. రామమూర్తి దుఃఖ మంతయు మరల నొక సారి యుపొంగు నట్లుండెను. ఇంతలో బంగీని విప్ప మరచితినని యతడు తెలిసికొని, యొక చాకుతో దారములను కోసి యొక చిన్న పెట్టెను తెఱచెను! పై నంటింపబడిన కాగితమున సత్యవాడ పోస్టు ముద్ర యగపడినది. ఏమయియుండునో యని యాతురముతో నా పెట్టెనులోనుండి నొక కాగితపు కట్టను బైటికి తీసెను. అవన్నియు నుత్తరములు. ప్రణయ సూచకములగు వార్తలు. రత్నవల్లి ప్రశంసా వాక్యములు. రామమూర్తి విరచితములు. చిరకాంక్షి తములైన యీ లేఖలు మరల చేతికివచ్చుట రామమూర్తికి సంతోష వార్తయేకదా! అతనికోరిక ఫలించును గదా! అని మాపాఠకు లూహించి యుందురు. కాని రామ మూర్తి ముఖమండలమున సంతోషములేదు. అదియొక క్షణములో విచారగ్రస్తమై పోయినది. అతడాపాద మస్తకమును వడకిపోయెను. గదియంతయు ప్రతిధ్వనించు నట్లొక పెద్దనిట్టూర్పు విడిచెను. ఉత్తరము లన్నియు నటునిటు నొకసారి పరీక్షించి చూచెను. అంతట తనలో తాను బిగ్గరగా,

"తుదకంతయు నిష్ఫలమైనది. నరహత్యకూడ నిష్ప్రయోజనమైనది. దుర్గాప్రసాదుడు మోసపోయి నాడు." అనుకొనియెను. మరల నొకకొంత సేపు గదిలో

నాలుగుమూలలు తిరిగి "మోసము, మోసము" అని గొణుగు కొనసాగెను. అతని నోటివెంబడి వేఱొకమాట రాలేదు. అంతలో హఠాత్తుగా దుర్గాప్రసాదుడు తలుపు తెఱచి లోనికివచ్చెను. అతని వీక్షణములందలి యావేద నను రామమూర్తి పూర్ణముగ గ్రహించెను. అతడే మియు నడుగకయే రామమూర్తి యతనియొద్దకేగి,

"దుర్గా! చూచితివా? ఘోరమోసము జరిగినది. నీవు వంచింప బడితివి."

దుర్గా:— ఎందువలన? నేనంపిన యుత్తరములు మరల నెవరైన నపహరించిరా? అవి యింతవరకును రానేలేదా? అవిగో వచ్చినవే, ఏమిటీవంచన?

రామ:— ఇవి నేను వ్రాసిన యుత్తరములు కావు.

దుర్గా:— మఱియెవరివి?

రామ:— నే వ్రాసిన యుత్తరముల నకళ్ళు.

దుర్గా:— నిదానముగ పరీక్షించితివా?

రామ:— నాదస్తూరి నాకెంత క్రొత్తయా?

దుర్గా:— రాజశేఖరమేనా, యీనకళ్లు వ్రాసినది?

రామ:— అతడే. సంశయము లేదు.

దుర్గా:— ఇదియామోసము. ఏమియును మించిపోలేదు.

రామ:— పిచ్చుకపై బ్రహ్మాస్త్రము నంపినట్లైనది. ఈ మోసమునకే గదా నరహంతకుడ వనపించు కొంటివి. ఇంకనేమి మించిపోవలసి యున్నది.

లించి నంత మాత్రమున నుత్తరములు బయలుపడునని దుర్గాప్రసాదుడెన్నఁడు నూహించియుండలేదు. అందు వలన లేఖాసంపాదనమునకున్న నిర్బంధము లన్నియు తొలఁగిపోవునని యతఁడు తలంచెను. రాజశేఖరము బ్రతికియున్నచో దుర్గాప్రసాదునకు కేళీనికేతనమునందలి రాకపోకల కవకాశము లేదు. రత్నవల్లీసాంగత్యమత నికి లభించియుండదు. ఒకవేళ లభించియున్నను కార్యము ఫలించువరకును సిలిచియుండదు. ఆనాఁడా రాజశేఖ రము రత్నవల్లికి వ్రాసినయుత్తరము నందలి విషయము లలో నుత్తరములను తనయొద్దనుంచుకొందునని తెలిపిన విషయము ప్రధానము కాదు. ఆయుత్తరము తెచ్చుట నున్నను రామమూర్తియొద్దనుండియో బదివేలరూప్య ములను సంగ్రహించునంతవరకును రాజశేఖరము వృథా కాలక్షేపము సేయఁడు. అతఁడేదియో తంత్రము పన్ను చునే యుండును. రత్నవల్లి మనస్సును తనకనుకూలము గా త్రిప్పుకొన బ్రయత్నించుచుండును. అదియే ప్రధా నము. ఈరహస్యమంతయు రామమూర్తికి దుర్గాప్రసా దుఁడు చెప్పిపోయిన కొలఁదిమాటలవలన వ్యక్తమయ్యెను.



# 13

## చంద్రమతి.

---

సింహాచలమున నహోరాత్రములు నొక్కటే యాలోచన. అంతటి యల్పకాలమున, నంతటి చాతుర్యముతో రాజశేఖరమును మాయముచేసిన హంతకుని యన్వేషించుటెట్లు? ఆహత్యను గురించి విచారించిన కొలదియు హంతకుని యపూర్వ మేధాప్రభావము గోచరమగుచుండెను. రాత్రియైనను కాకపూర్వము, బహుజనసమూహమున్నచోట నంతటి భయంకర కార్యమెట్లు నిర్వహింపబడెను? ఆహంతకుని కుశాగ్రబుద్ధితో పోల్చిచూచిన సింహాచలము తెలివితేటలెందుకు పనికివచ్చును? దేశ దేశాంతరములందు ప్రశంసింపబడిన యతని రహస్య పరిశోధన విజ్ఞానమేమి నెరవేర్చినది? సత్యవాడ హాస్టెలునందు జరిగినది యాత్మహత్య కాదు, కూనీ, యని మాత్రము తేల్చినది. ఆ నిర్ణయము వలన నేమిలాభము? హంతకునకు కీర్తిలాభము. అతడు కేవల హంతకుడు కాడని నిశ్చయము కుదిరినది. అసమాన బుద్ధి బలసంపన్నుడని తెలియవచ్చినది. హత్యాసందర్భమున నతని నైపుణ్యమును నతని చాకచక్యమును కొనియాడవలసి వచ్చినది.

ఒక్క యడుగు జాడయైనను లేదు. హంతకుని రాకపోకలను చూచిన వారొక్కరును లేరు. అతని సహవాసులుగాని సంబంధులుగాని యెవ్వరును లేరు.

స్ఫుటమగు కొన్ని భేదములు కాన్పించినవి. 'రత్నవల్లీ' యను నక్షరములు తక్కిన యుత్తరమునందలి యక్షరములవలె విరివిగ వ్రాసియుండక యొత్తుగా నిటికించి వ్రాసినట్లుండెను. అందలి 'వ' కారము రాజశేఖరము సామాన్యముగా వ్రాయు 'వ' కారముతో పోలికలేక చాలనస్పష్టముగా వ్రాయబడియుండెను. 'దుఃఖము' నందును 'రాజశేఖరము' దస్కతునందునుగల 'ఖ' కారములకు విపరీతమగు భేదము గోచరించెను. మొత్తముమీద నుత్తరమంతయు సామాన్యదృష్టితో చూచినయెడల నిస్సందేహముగ రాజశేఖరము వ్రాసినట్లే యుండెను. కాని యీయుత్తరమును వేఱొక నిమిత్తమునకై వ్రాయించి హంతకుఁడో యతని సహవాసులో పైసంబోధనమందును, క్రింది దస్కతునందును మార్పులు గావించినట్లు సింహాచలమునకు తోఁచెను. ఆహత్యా సందర్భమంతయు రహస్యతంత్రమునందపూర్వ విజ్ఞానము సంపాదించిన వానిచే నిర్వహింపబడినట్లతఁడు గ్రహించి యచ్చెరువొందెను. కాని యేమి ప్రయోజనము? ఏమూల వెదకినను, ఎన్నినిమిత్తములు గోచరించినను హంతకునిజాడ యణుమాత్రమును గానరాకుండెను. ఆవంచకుని వంచించు నుపాయము లెవ్వియు నతనికి స్ఫురించలేదు. ప్రసిద్ధములైన తనశోధన పద్ధతులన్నియు సింహాచలము ప్రయోగించెను. ఆయంధకారమున నతనికి మార్గము తెలియలేదు. అందువలన విషణ్ణ

హృదయుడై యటు నిటు దిరుగుచు "ఆఁ మఱచితిని. చంద్రమతి. చంద్రమతి." యని లోలో నుచ్చరించు కొనుచు నతిశీఘ్రముగ ప్రయాణ సన్నాహ మొనర్చు కొని సత్యవాడకు బండి నాయత్తపరుపుమని యాజ్ఞ నిచ్చెను. హత్యజరిగిన మరునాడు స్థలపరీక్షార్థమై సింహాచలము హాస్టలునొద్ద కేగినప్పు డందొక విద్యార్థి రాజశేఖరమునకును సత్యవాడ యందొక వేశ్యాంగన కును గల సంబంధమును వెల్లడించినట్టిదివరకు చెప్ప బడినది. సింహాచలమున కేనాగ్రమును గోచరింపని యీసందర్భ సమయమున నావిషయము జ్ఞాపకమునకు వచ్చెను. ఆతడవసరముగ కే యావేశ్య పేరు చంద్రమతియ నియు, యిరువదియైదేండ్లప్రాయముగలదనియు వారివారి నడిగి తెలిసికొనెను. ఆమెను సందర్శించుట వలన నతని సంశయములు తీఱునని యతని కేమాత్రము నాశలేదు. ఆమెతో సంభాషింప వలసిన యవసరమును అతనికి గన్పడ లేదు. అతని యాలోచన లన్నియు కొంతవరకువచ్చి యా చ్చట నకస్మాత్తుగ నాగిపోయెను. అనుల్లంఘనీయమగు సేతువొకటి యడ్డమువచ్చినట్లతనికి పురోగమనము సాగ లేదు. అందువలన యాదృచ్ఛికముగ నేదైన తటస్థించి హత్యాన్వేషణమున కనుకూలమగు నేయల్ప విషయమైన నాకు లభించునేమోయను వెఱ్ఱియాశతో నతడా నాడు చంద్రమతీ దర్శనార్థమై యేగెను.

సింహాచలము తనవెంట నెవ్వరిని గొనిపోక యొంటరిగ నేగెను. ఆదినమున చలపతితో గూడ కలసి పోవలయునని యతడను కొనెను. కాని యిపుడతని కంతటి యోర్పు లేకుండెను. చలపతి వచ్చుదాక నైనను నిలువలేక పోయెను. సత్యనారాయణపల్లి రాజవీధులన్నిటిని దాటి, సందుగొందులబడి చంద్రమతి వాకిలిముందు బండియాగెను. జీర్ణవస్త్రముల కొకదాని కతుకులువైచుచు కూర్చొనియున్న వృద్ధదాసి యొకతె లోనికి దారిచూపెను. త్వరలో చంద్రమతి వచ్చి సింహాచలము నెదుట సగము లజ్జతో సగముభయముతో, నిలువబడినది.

చంద్రమతి పలుచని చామన చాయగల శరీరకాంతితో చక్కగ చెక్కినట్లున్న యవయవములతో, తనతోటివారి యందందకత్తెయనిపేరు సంపాదించినది. ప్రథమ పరిచయమున ననేకులామెను కులాంగనయని భ్రమింతురు. సానివాండ్రు నాగరిక చిహ్నములయం దామె కభిమానము తక్కువ. స్వచ్ఛముగు తన నుదుటిపై దానిమ్మరేకువలె కుంకుమ తిలకము నామె సవరించుకొని, ప్రక్కపాపటలను గాని, ముంగురుల కత్తిరింపులు గాని లేక, నిరాడంబరయై యుండును. ఆమె మౌనయై నిరుత్తరయై యున్నపుడు గొంచెము వంచిన యామె కన్నుల యందు మిక్కిలి మధురమగు జిజ్ఞాస యంకురించును. మాయామర్మమెఱుగని యువతియని కొందఱకు మోహం

ధులగు చుందురు. కాని యది సత్యమునకు దూరము. అదియొక వేషము. ఇట్టి వేషము లెన్నని చంద్రమతి కొప్పియుండును. అది యసాధ్యురాలు.

సింహాచలమును గౌరవించి, యొక తివాచీపై యాసీనుని గావించి, చంద్రమతి తానొక స్తంభము నాను కొని నిలిచినది.

సింహా:— రాజశేఖరము మరణము నీకత్యంత పరితాపము నకు కారణమైనదని నేనెఱుగుదును. అయినను నొక కొన్ని సంగతులు నిన్నడుగవలసి వచ్చినది. నీవన్యథా తలంపవలదు."

ఆమాటకు చంద్రమతి నవ్వు నాపుకొనలేక పోయినది. కాని త్వరలో యథారూపమును దాల్చి నిరుత్తరయై నిలిచినది.

సింహా:— ఆతని మరణమునకు నీవే కారణమని కొంద అనుకొను చున్నారు? ఎంతవరకు నిజమో నిన్నడుగుటకే వచ్చితిని.

చంద్రి:— అట్లైన మీపరిశోధన మంతయు సులభముగ వ్యయప్రయాస లవసరము లేకుండ ముగిసినదన్న మాట. అని మరల నవ్వినది.

సింహా:— ముగియుటో, ముగియక పోవుటో నీవేమైన నెఱుగుదువు.

చంద్ర:— మీమాట లర్థము కాలేదు.

సింహా:— రాజ శేఖరమునకు నీపైన గాఢప్రేమయని నీ వెఱుంగుదువా?

చంద్ర:— ఆవిషయము రాజశేఖరమునకే తెలియును.

సింహా:— అతడు నీయింటికి వచ్చుచు పోవుచుండినమాట యథార్థమే యనుకొందును. అదియును నీ వెఱుగవా?

చంద్ర:— ఎఱుగుదును.

సింహా:— నీపై ప్రేమయే యాతని ప్రాణోన్మరణమునకు కారణ మని యనుకొనుచున్నారు.

చంద్ర:— నేనుమాత్ర మింతవరకును వినలేదు.

సింహా:— చిత్రముగా నున్నది.

చంద్ర:— నేనంత సౌందర్యవతినిగాదు. నన్నంతగా మీరు ప్రశంసించ నక్కరలేదు.

సింహా:— నిన్ను పొగడుటకై యిచ్చటకు రాలేదు. నీవామాటను గ్రహించుకొనుము. రాజశేఖరమును హత్యకు పూర్వ మెన్నినాళ్లక్రింద చూచియుంటివి?

చంద్ర:— వారము దినములక్రిందట.

సింహా:- అప్పటి కతని మనస్థితి విపరీతముగా నుండెనా, లేక యెప్పటివలె నతడు ప్రవర్తించుచుండెనా?

చంద్రి:— రాజశేఖరము మనస్సు కడుచిత్రమైనది. నామట్టుకు నాకీయాత్మహత్య యాశ్చర్యమును కలిగించలేదు.

సింహా:— ఎందువలన?

చంద్రి:— అతని చిత్తవృత్తి క్షణమున కొకవిధముగా మాఱుచుండును. నిలుకడలేదు. కోపము, సంతోషము, దుఃఖము నతనియందు మితిమీఱి యుండును.

సింహా:— నీ వు చెప్పునటువంటి చిత్తవికారము మీ యిరువురి [illegible] న నెప్పుడైన సంభవించినదా?

చంద్ర:— [illegible] ను లేదు. ఈవిషయము లతనియందు నేను కనిపెట్టినవి. నన్నతడెవ్వుడును కోపపడ లేదు. నాసౌఖ్యమున మైమఱచిపోను లేదు. మాకెట్టి యనోన్యము లేదు.

సింహా:- నీవుచాల తెలివిగల దానవువలె నగపడు చున్నావు. అట్టినీకు రాజశేఖరమును గూర్చి యేమియు తెలియదనుట వింతగనున్నది. అతని పై నీకంతగా స్నేహము లేదంటివి కద, నీకతని చిత్తవృత్తు లన్నియు పరిక్షించు నంతటి యవకాశము లెట్లు లభించినవి?

చంద్రి:— నాకట్లు తోచినది. ఇందులో నాప్రభావ మేమియును లేదు. నా తెలివియు లేదు.

సింహా:— ఈయాత్మమాహాత్మ్యవలన నీకాశ్చర్యము కలుగ లేదా?

చంద్ర:— ఏమట్లడుగుచున్నారు?

సింహా:- నాకు మహదాశ్చర్యము కలిగినది గనుక నిన్నడుగుచున్నాను. నాయాశ్చర్యము నిజమో, నీయాశ్చర్యము లేకపోవుటనిజమో తేల్చుకొనుటకు మరల నింకొకసారి వచ్చెదను. ఈనాడు మాత్రమిక పోయివచ్చెదను.

చంద్ర:- ఇంకొకపనిమీద వచ్చిన రానిచ్చెదను. కాని యీవిషయమై మరలవచ్చుట వ్యర్థము. ఇంతకన్న నాకేమియును తెలియదు.



# 14

## దుర్గాప్రసాదు డపరాధి.

---

సింహాచలము విచార గ్రస్తుడై సత్యవాడనుండి త్వరలో ఘనవల్లికి తిరిగివచ్చెను. చంద్రమతిని చూచి వచ్చినందువలన నతని కేమియును క్రొత్త వింతలు తెలియుటలేదు. అంతయు నిష్ప్రయోజనమైనది. అదియునుగాక చంద్రమతికిని రాజశేఖర మునకును గల సంబంధము పుక్కిటి పురాణమువలె నతనికి తోచెను. చంద్రమతి సంభాషణ మంతయు సామాన్యముగను పేలవముగను నతనికి కనుపించినది. అది యంతయు కల్పనా కథయేదైయుండునని యతడు భావించెను. ఏమాత్రము సఖ్యమున్నను సాధారణ నాయికానాయకుల సంబంధములయందు వర్ణనీయములగు సందర్భములుండకపోవు. వారి పరస్పరానురాగమున కాధారములైన యే యల్పాంశములో లేకపోవు. అయినను చంద్రమతి యతిక్రూరముగ నిరసన బుద్ధితో తగని నిర్లక్ష్యముతో రాజశేఖరమునుగూర్చి ప్రసంగించినది. ఆప్రసంగము నందామె వెలిబుచ్చిన విశేషములునులేవు. అంత సఖ్యములేని మాటయే నిజమైనయెడల రాజశేఖరము చిత్తవృత్తియాత్మ హత్యోన్ముఖమని చంద్రమతి యెట్లు గ్రహించినది? ప్రమత్తురాలై చంద్రమతి యీ యొక్క విషయమును పొరబాటుగ తనతో

చెప్పినదా? లేక తన్ను వంచించుటకై తెలియని సంగతి కూడ తెలిసినట్లు నటించినదా? యని సింహాచలము తర్కించుకొనెను. అందువలన చంద్రమతి పైకికాన్పించు నంత యమాయకురాలు గాదని యతడు గ్రహించెను, ఆమె సంభాషణము నందంతకన్న నేయాధార మును చిక్కలేదు. రాజశేఖరము హత్యను గురించిన వృత్తాంతము నామె యెరుగునను కొనుటకు సింహాచలమునకు ధైర్యము చాలలేదు. నిరాధారములగు సాక్ష్యములపై, తన సిద్ధాంతములను నిర్మించుకొను నభ్యాసము లేనివాడగుటచే నట్టి సందేహములను పెట్టుకొనకుండెను. కాని చంద్రమతిచేసిన మధుర ప్రసంగము నందేదియో రహస్యము మాటువడి యుండెనని యత డూహించెను, అది కేవల మూహామాత్రమె. అంతకన్న విస్ఫుటముకాలేదు. ఆ రహస్య వృత్తాంత మేదియో యూహించుటకైన వీలులేక పోయెను. సత్య వాడ ప్రయాణము నిరర్థకమైనది. హంతకుని గూర్చిన యు దంత మిక వర్షరూపమున నాకాశమునుండి దిగి రావలయును. అంతకన్న నతనికే యాశయును లేకుం డెను. ఆ హంతకు డెచ్చటనో సజీవుడై యుండి తన మందబుద్ధికిని, తన కర్తవ్యతా మాహాత్మ్యమునుగాంచి కడుపార నవ్వుచుండునని యతడు తలంచెను. ఆనవ్వు నాపివేయు టెట్లు? అంతలో నకస్మాత్తుగ చలపతి లోప లికి వచ్చి సింహాచలమును కలిసికొనెను. అపుడు

సింహాచల మన్య మనస్కుడై దిక్కులుసూచుచుండెను.
చల:— చంద్రమతి యింటియొద్ద నేమి తేలినది ?
సింహా:— ఏమియును తేలలేదు. అంతయును మునిగినది.
చల:— నాకై వేచియైన యుండక అంత తొందరగ నేందు కేగితివి ?
సింహా:— తోచక.

చల:— నూతనాంశము లెవ్వియు బయల్పడలేదు ?
సింహా:— బయల్పడిన నాకే విచార మెందులకు ?
చల:— ఇకపై నేమిచేయ నెంచితివి ?
సింహా:— ఏమియు చేయకుండుటయె మంచిదని యెంచితిని.

చలపతికి సంభాషణమున కంతము లేకున్నట్లు తోచెను. అంత దెన్నడును సింహాచలము నింత నిరుత్సాహియై యుండగా చూడలేదు. అందువలన నావిషయముసే మరల మరల గ్రుచ్చియడిగిన లాభములేదని యూరకుండెను. సింహాచల మంతట తన నిరుత్సాహమునకు తానే సిగ్గుపడినట్లు నవ్వుమొగముతో చలపతి వంక చూచి,

"నీవలసి యున్న ట్లున్నావు. ఎచ్చటికైన వెళ్ళి వచ్చితివా ?" యనెను.
చల:— సత్యవాడనుండి యిపుడే వచ్చుచున్నాను.
సింహా:— సత్యవాడ కెప్పుడు వెళ్ళితివి ? ఎపుడు వచ్చితివి ?

చల:— ఉదయమున త్వరగా భోజన మొనర్చుకొని మీకై వచ్చితిని. మీ రప్పటికొక యరగంట క్రిందనే వెడలియుండిరని విని నేనును సత్యవాడకు ప్రయాణమైతిని. చంద్రమతి సంభాషణమును స్వయముగ వినవలయునని యట్లొనర్చితిని.

సింహా:— మఱి నన్నుకూడ కలసికొన లేదేమి?

చల:— తీరికగా నడచి చంద్రమతి యింటియొద్దకు వచ్చునప్పటికి మీ రచ్చటను కన్పించలేదు. ద్వార సమీపముననున్న దాసిని ప్రశ్నించితిని. నేను లోనికేగుటనుజూచి యాదాసి దుర్గయ్య దొరగారున్నారు. పోకండి పోకండి యని నన్ను మందలించినది. నేనంత మీగుర్తులను చెప్పగా నెవరో వచ్చిన మాట నిజమేననియు నప్పుడె వెళ్లిపోయి రనియు చెప్పినది. అంతట మరల బయలుదేరి ధనవల్లి నిపుడే చేరితిని. ద్రావిడ ప్రాణాయామమైనది.

సింహా:— ఏ దొరగారు?

చల:— ఎవరో దుర్గయ్యదొరగారట.

సింహాచలము మనస్సొకక్షణములో చింతామగ్నమైపోయెను. అట్లొకగడియసేపు మౌనముగ నుండి, పిదప ప్రక్కగదిలోని కేగి, పుస్తకముల యాల

మారును తెరచి యొకపెద్దనోటు పుస్తకమును గైకొని మరల చలపతిని సమీపించెను. అంతట జేబునుండి కలమును పైకిదీసి, యాపుస్తకమునందొకచోట 'దుర్గాప్రసాదరావు' అను పేరు క్రింద గీటుగీసెను. ఆగ్రంథమునందు సమగ్రమగు నపరాధుల జాబితా యున్నది. వారివారి వివిధాపరాధముల జాబితా యున్నది. వారి నివాసస్థానములును, రహస్య సమావేశ స్థలములు కూడ పేర్కొనబడియున్నవి. దుర్గాప్రసాదునకు మాత్రమా గుప్త గ్రంధమునందు గౌరవస్థానమీయబడలేదు. అచ్చట నతని నామము మాత్రమే యంకితమైయుండెను. అతని యపరాధములసంఖ్య గాని వర్ణనముగాని లేదు. అతని నివాసస్థలములును పేర్కొనబడలేదు. దుర్గాప్రసాదుడా మధ్యలో కొన్ని నాళ్లుసజ్జనులతో దిరుగుచు, నంతటి ప్రసిద్ధములగు కార్యము లేవియు చేయక, చేసినను బ్రహ్మకైనను దెలియనీయక వర్తించుచుండెను. అందువలన సింహాచలమున కతడిటీవల మనశ్శల్యముకాలేదు. దుర్గయ్యదొర యను పేరు వినిన తోడనే సింహాచలమునకు చంద్రమతి యందణగియున్న రహస్యము బహిర్గతమైనట్లు స్ఫురించెను. అంతట తన పుస్తకమును తెరచిచూచెను. అపుడా యంధకారమును భేదించుకొని యొక తేజశ్శకలము తన దాపునకు వచ్చినదని యతడు గ్రహించెను. ఆ తేజోలాభమువలన నతనికి మిక్కుటమగు నాశ్చర్యము

కలిగినది. ఈహత్యయందు దుర్గాప్రసాదునకు సంబంధ మున్నదా? యని యతడు పలుమారు తనలో దానను కొనెను. ఆసంబంధమెట్టిది? "ఏమైనను ఏమికాకున్నను, దుర్గాప్రసాదుడే నాయన్వేషణమునకు ప్రథమ సోపానము" అని సింహాచల మనుకొనెను. ఇంత వరకును నిరుత్తరుడైన తన స్నేహితుని వంక చూచుచు నాసీనుడైయున్న చలపతి యతని ముఖమునందాక స్మాత నోత్సాహమును గాంచి కుతూహలుడై యిట్లనియెను.

చల:— ఎవరా దుర్గయ్య దొరగారు?

సింహా:— దుర్గా ప్రసాదరావుగారు వారిపేరు క్రిందనే నేనిప్పుడు గీతపెట్టినది. వారి నామధేయ మీనాడు మరల స్మరింపవలసి వచ్చినది.

చల:— ఏ సందర్భమున?

సింహా:— హత్య విషయమున.

చలపతి కాచిత్ర వృత్తాంత మర్థము కాలేదు.

చల:— చంద్రమతి యింటియొద్ద నంతయు మునిగి పోయినదని మరల నీయుత్సాహ మెందుకు?

సింహా:- మునిగిపోయిన దంతయు మరల నీవె పైకిదీసితివి.

అంతట సింహాచలము పూస గ్రుచ్చినట్లు చంద్రమతితో నడచిన సంభాషణ మంతయు చలపతితో చెప్పెను.

సింహా:— ఇది యాత్మహత్యయేయని నిర్ణయించిన చంద్రమతి కేదైన రహస్యము తెలిసి యుండునని యూహించితిని. ఈ దుర్గాప్రసాదు డచ్చటికి వచ్చుచు పోవుచు నుండు వాడగుటచే నతనికి గూడనీహత్య విషయమగు సందర్భములు తెలిసి యుండునని యిపు డూహించు చున్నాను. అతడు చాల దుర్మార్గుడు. పైకి పెద్దమనిషి వలె కానవచ్చును. గాని యదియంతయు కపట నాటకము.

చల:— అతనిపై ననుమానమునకు నాకేమియు కారణ మగపడదు.

సింహా:— అతనిపై ననుమానముగాదు. అతనివలన మన కేవైన కొన్ని ముఖ్యవిషయములు తెలిసిన తెలియవచ్చును.

చల:— అతనిపేరిమధ్య తలచినవారే లేరు.

సింహా:- అదియే నాయనుమానమునకు గారణము. నతడేదియు నంటించుకొనక యూరకుండువాడు కాడు. ఆతడట్టి బుద్ధిమంతుడు కాడు.

చల:- వట్టి యనుమానముతో నేమియు సాధ్యము కాదు.

సింహా:- నిజమే. గత్యంతరము లేనప్పుడు మనమతనితో కొన్నాళ్ళు కాలక్షేపము చేయవలసి వచ్చినది. అతని యునికి పట్టులను, రాకపోకలను ప్రకృత స్థితియును. నీవుకూడ విచారించు చుండుము.

అంతట నింటియొద్దనుండి కబురు వచ్చుటచే చలపతి వెడలి పోయెను. అటుపై కొంతసేపు నోటు పుస్తకము నిటునటు త్రిప్పుచు సింహాచలము కొంత కాలమట్లే కూర్చుండియుండెను.



# 15

## భార్యా కలహము.

---

సింహాచలమనినట్లు దుర్గాప్రసాదు డేమియు సంతసించుకొనక యూరకుండు నంతటిబుద్ధిమంతుడు కాడు. అతడు నిరంతరమును స్వామి కార్యమగ్నుడై యుండెను. రామమూర్తి కానాడు రత్నవల్లి యొద్దనుండి ఛాయాపటమును లేఖలను గొని తెచ్చి యిచ్చెదనని వాగ్దానము చేసినప్పటినుండియు నతనికాహారనిద్రాదులు సరిగ లేవు. త్వరలో లభించుననుకొని యున్న వస్తువులు మరల సంపాదించుకొనుటకెన్నాళ్ళు పట్టునో తెలియకుండెను. రత్నవల్లి సాధారణ స్త్రీ కాదు. ఎన్ని రహస్యములతనికి చెప్పినను దుర్గాప్రసాదునకు వలయు వస్తువుల రహస్యము మాత్రము దాచియుండెను. ప్రసాదుని మాయోపాయములన్నియు నామెకడ నింతవరకును వ్యర్థములైనవి. కాని దుర్గాప్రసాదు డంతమాత్రమున నిరుత్సాహ పడలేదు. అతనికి రత్నవల్లి హృదయముపై ప్రభుత్వము నానాటికి వర్ధిల్లుచునే యుండెను. ఎప్పుడో యొకప్పుడామె తనచేతికి చిక్కునని యతడెరుగును, కాని యాసంఘటనము సకాలమున జరుగునట్లతనికితోచలేదు. రామమూర్తి వివాహమునకు పెట్టిన రెండవ లగ్నము కూడ సమీపించుచుండెను. ఆవివాహకాలము నెన్నాళ్ళని యాపియుంచవీలగును? ఉత్తరములు హరింపక పూర్వమె

వివాహము తలపెట్టినచో నంతయు రసాభాసమగు నని ప్రసాదునకు విశదమయ్యెను. ఏదైన వంకబెట్టి వివాహమును మానుకొన వచ్చునేమోకాని, యట్లొన ర్చుట తనకు గౌరవ భంగమని తన కీర్తికి కళంకమని ప్రసా దుడు తలంచెను. ఆతడింతకు పూర్వమెన్నడును స్నేహ మునకై యాడినమాటను తప్పియుండలేదు. ఆమాటను నిలువబెట్టుకొనుటకై దారుణమగు నరహత్యా పాతక మును గూడకట్టుకొనెను. అందువలన కూడ కార్యము సులభముగ సానుకూలము కాలేదు. అదియంతయు నట్లుండ పరిభుత్వోద్యోగులు హత్యనుగురించి తీవ్రముగ విచారించుచున్న సంగతి తెలియవచ్చినది. ప్రబల విరోధియగు సింహాచలము పోలీసువారికి సలహానిచ్చు చున్న సందర్భముకూడా దుర్గాప్రసాదుడు కర్ణాకర్ణిగా వినియుండెను. ఆత్మహత్యయని తానుపన్నిన పన్నాగ మంతయు బహిరంగమయినది. అపరాధినన్వేషించు టకై ప్రబలప్రయత్నములు జరుగుచున్నవి. ఆవిషమ సమయమున ప్రసాదు డేట్లూరకుండగలడు? తన మిత్రు నకిచ్చిన వాగ్దానము నెట్లుమఱువగలడు? ఏనాడేమివచ్చు నోయెవడెరుగును. అంతవరకు తెలిసికొనినతరువాత సింహాచలము హంతకుని మాత్రమేల కనుగొన జాల కుండును! తనబుద్ధి ప్రభావముచే నందరను తప్పించుకొ న్నను కూడ నిప్పటివలె శాంతముగ లేఖాపహరణము నకై తగిన ప్రయత్నములొనర్చుట యసాధ్యమగును.

దుర్గాప్రసాదుఁడే పని యొనర్చినను సంపూర్ణముగ ముందు వెనుక లాలోచించి పని ప్రారంభించుచుండును. హత్యవలన సంభవింపనున్న లాభనష్టములన్నియు నతఁడంతకు పూర్వమె లెక్కపెట్టుకొని యుండెను. అందువలన రానున్నయపాయములన్నిటిని వారించునుపాయంబు లతఁడేర్పఱచుకొనెను. కాని యతఁ డిపుడుపయోగింప వలసిన విజ్ఞానమంతయు నుత్తరములు రత్నవల్లియొద్దనుండి హరించుటయందే. ఆత్మరక్షణమునకు గాదు. ఆపని నెరవేరుటకై గట్టిపట్టు బట్టి త్వరలో సాధించు మార్గముల నతఁడు చింతించుకొనెను. అందలి సాధక బాధకముల నన్నిటిని విచారించుకొని తుదకు మనోనిశ్చయముతో నొకపధక మేర్పఱచుకొనెను. అది యిట్లు నడచినది.

ఒకనాఁడు సాయంకాలము దుర్గాప్రసాదుఁడు తన కభిమాన వినోదమగు చదరంగము నాడుచు నొకస్నేహితునితో సల్లాపము లాడుకొనుచుండెను. అపుడొక సేవకుఁడొక లేఖనుగొని తెచ్చియిచ్చెను. అందిట్లున్నది.

"దుర్గాప్రసాదుల చరణసన్నిధిని, రత్నవల్లిచేయు విజ్ఞాపనములు.

మీరు మా కేళీనికేతనమునకు మీసల్లాపగోష్ఠితో, మమ్మానందపెట్టి చిరకాలమైనది. మీరిచ్చటి కరుదెంచినపుడెల్ల, కార్యాంతర మగ్నులై యుండుటచే,

మిమ్ములను సత్కరించు భాగ్యము నాకుకలుగలేదు. విశ్రాంతికై, కొంచెము వినోదమునకై యీరాత్రి మీరిచ్చటకు రా బ్రార్థన సేయుచున్నాను. మీరు రాని దినమొక యుగముగా గడుపుచున్నాను. నావిన్నపమును నిర్లక్ష్యముగ చూడవద్దు.

రత్నవల్లి."

ఈయుత్తరమును చదివి, యించుక లోలోపల నవ్వుకొని యంతట నాటచాలించెను. ఆసాయంకాలమె కొంచెము చీకటిపడువేళకు, దుర్గాప్రసాదుని నివాస గృహమునొద్ద సతని స్నేహితులనేకులు గుమిగూడిరి.

కొంతకాలము వారందఱు నొకరితో నొకరన్యోన్యముగ నేదియో ముచ్చటించుకొనిరి. ఝోడనే, యెవరియిండ్లకు వారేగిరి. దుర్గాప్రసాదుడు శరీరమంతయు నుచితముగ నలంకరించుకొని రత్నవల్లి యింటికై బయలుదేఱెను. అతనిపరిచర్యకై రత్నవల్లి తినుబండములు, దీపములు, సుగంధ ద్రవ్యములు సిద్ధముచేసియుంచెను.

రత్నవల్లికి దుర్గాప్రసాదునెడ గల యనురాగమంతయు బూటకముకాదు. అందుసగపాలు యథార్థముగు ననురాగమున్నది. దుర్గాప్రసాదు డామె ప్రేమదానమును స్వీకరించుట కన్నివిధములనర్హుడై యుండెను.

అతడు రామమూర్తి వలె వశ్యుడై, నమ్రుడై ప్రవర్తించి యుండలేదు. ప్రసాదుని ప్రవర్తనము నందా మెత్తదన మెక్కువ లేదు. గాంభీర్య మెక్కువ. గడుసుదన మెక్కువ. వినోదివర్గమును సాధింప నెంచిన రత్నవల్లి కాగుణములయందు గౌరవ మతిశయిల్లినది. కేవల మనురాగమె కాక, ప్రసాదుని సాహాయ్యముకూడ నపేక్షించి యుండుటచే నారెంటును నొకదాని కొకటి ప్రోద్బలము గా వల్లిని దుర్గాప్రసాదునకు దాసురాలి నొనర్చినవి.

దుర్గాప్రసాదుని సింహద్వారము నొద్దనే కలసికొని రత్నవల్లి తన చేతులతో నుదకమును ముంచి తెచ్చి కాళ్లుకడిగించినది. ఆరాత్రియచ్చటనే షడ్రసోపేతముగ తానే చెంతగూర్చుండి యతనిని భుజింప చేసినది. ఆరాత్రి వేళ కేళీనికేతనము మరలపూర్వపు వైభవముతో రాజిల్లినది. వెనుకటివలె నావైభవమునకు రత్నవల్లి యధిష్ఠానదైవము కాలేదు. స్వగృహమందె యామె ప్రభుత్వము తగ్గిపోయినది. అదియంతయు దుర్గాప్రసాదునకై జటిపిన యుత్సవమగుటచే నతడే ప్రధాన పురుషుడాయెను. ఈయాగంతుకున కింతటి యధికారమేల యిచ్చితినని వల్లి తనలో తానాశ్చర్యమునొందెను. అంతయు తనకు సానుకూలముగ పరిణమించునని యానందించెను. తనసమ్మోహనశక్తికై తన్ను తాను శ్లాఘించుకొనియెను. భోజనానంతర మిఱువురును,

మేడపై నొక విశాలమగు గదియందు సుఖాసీనులై చాల ప్రొద్దు పోవువరకును సంభాషించు చుండిరి. అవి వెన్నెల దినము లగుటచే చంద్రికలు గదియం దచ్చటచ్చట ప్రాలియుండెను. ఆరామము నొదలి పుష్ప వాసనలతో మంద మందముగా గాలి వీచు చుండెను. వారి సంభాషణ మీవిధముగ నుండెను. రత్నవల్లి కొంత సేపు ప్రసంగించిన పిదప దుర్గా ప్రసాదుడు పవళించి యున్న శయ్యను సమీపించి యిట్లనియెను.

"ఈనాడు వేడుకగా మిమ్మాహ్వానించినను యథావిధిగ మాట్లాడక మరల నేదో యాలోచనలో మునిగి యున్నారు."

దుర్గా ప్రసాదుడు రత్నవల్లివంక నొకసారి చూచెను. ఏమియు ననలేదు. ఆరాత్రి తాను సంకల్పించిన పనియగునో లేదో యని విచారించుచుండెను. తన మౌనమునకు కారణ మిట్లు చెప్పెను.

"ఆలోచన కాదు. ఆవేదన".

రత్న:— ఈదానూరాలి యాతిథ్యము మీకంతటి యావేదన నెట్లు తెచ్చిపెట్టినది?

దుర్గా:— నీ యాతిథ్యముకాదు. నీ వియోగము.

రత్నవల్లి దుర్గాప్రసాదుని యన్యదేశ గమనము మాట మఱచి పోయినది. అందువలన నతడు ప్రయాణమును మానుకొని నట్లెంచినది.

రత్నా:— మీరు ప్రయాణమును మాని యుంటిరను కొంటిని.

దుర్గా:— అది నావశమైన నట్లొనర్చి యుందును.

రత్నా:— వెళ్లక తప్పదా?

దుర్గా:— తప్పదని యెఱిగియు తప్పించుకొనుటకై యత్నము సేయుచున్నాను.

రత్నా:— ఏదేశమునకు? ఎన్నాళ్లకు?

దుర్గా:— ఎచటికో యెన్నాళ్ళకో నేనె యెఱుగను.

రత్నా:— ఏమి పనిమీద?

దుర్గా:— అది రహస్యము.

రత్నా:— ఏదైన నాపదనుండి విముక్తి కొరకా?

దుర్గా:— కాదు. నాకాపద లేదు.

రత్నా:— అట్లైన నాయాపద కెవరడ్డము వత్తురు?

దుర్గా:— అదియె నాయావేదనకుం గారణము.

రత్నా:— అట్లైన నేనుకూడ మీవెంట రావచ్చునా?

దుర్గా:— అంతటి భాగ్యమా?

రత్నా:— నేను సిద్ధముగానున్నాను.

దుర్గా:— నేనేసిద్ధముగా లేనివాడను.

రత్న:— వేశ్యాంగన నగుటచే సంకోచము కాబోలు.

దుర్గా:— అట్టి సంకోచమున్నచో నీతోడి సాంగత్యమింత వరకు రానిత్తునా? రత్నవల్లీ నీవట్లు తలంపకుము.

ప్రసాదుడు చెప్పుమాటలను బట్టి యందేదియో నిజమగు రహస్యమున్నదని రత్నవల్లి భ్రమపడెను. తన మందస్మితములను, మధురాలాపములను, హావములను ప్రయోగించెను. దుర్గాప్రసాదు డంతయు నేమియు విశేషము నామె కెఱింగింపలేదు.

రత్న:— నాప్రాణములు సైతము మీకర్పించుట సిద్ధముగా నున్నాను. నాకు చెప్పగూడని యట్టి రహస్యమేమున్నది. మీరు రాజపురము నిప్పటిలో విడి పోవలదు.

దుర్గా:— నీభక్తిశ్రద్ధలను నే నెఱుగుదును. అందువలన నే సర్వమును వదలి నీసౌఖ్యమునకై ప్రయత్నించు చున్నాను.

రత్న:— నన్నీ యాపత్తునుండి తొలగించు పూర్వము మీరు ప్రయాణము నాపుకొనుడు. మీ వాగ్దానము కావలెను.

దుర్గా:— ఆపద తొలగిన పిదప నేనక్కరలేదు కాబోలు.

అంతట రత్నవల్లి సానురాగముగా లేచి యతనిని కౌగలించుకొనియెను. ఆక్షణమే క్రింది తలుపునొద్ద ప్రచండమగు ధ్వని వినబడెను. వేయిమంది కలసి తలుపు బ్రద్దలు గొట్టినట్లు మ్రోతయైనది. ఆధ్వని కులికిపడి రత్నవల్లి వెనుకకు దుమికినది. ప్రసాదుడామెకు చేయూత నిచ్చి నిలువబెట్టెను. ఆధ్వని మఱింత యెక్కువగా మ్రోగెను. క్రింద నిద్రించుచున్న సేవకులందఱును లేచి గొల్లున నార్తరవములు సేయసాగిరి. అంతయు నల్లకల్లోలముగ నుండెను. అంతదుర్గాప్రసాదుడు రత్నవల్లిని బిగ్గరగా సంబోధించి,

“ఇకత్వరలో తలుపులు బ్రద్దలు కాగలవు. ఈదుర్మార్గులు మనకు లోబడునట్లు లేదు. మనమింక నాలుగైదు నిముషములలో నెచ్చటికైన పలాయనము కావలసివచ్చునేమో. నీవు మాత్రము సిద్ధముగానుండి నీ నగలను నాణెములను, మఱి యితరవస్తువులను ముఖ్యమైనవి కొన్ని భద్రపఱుపుము.” అనియెను. రత్నవల్లి యాభరణము లన్నియు నామె శరీరముపైన నుండెను. ఆరాత్రి దుర్గాప్రసాదుని మోహసముద్రమున త్రోసివేయుటకై యన్నిటిని తనశరీరముపై నలంకరించుకొనెను. ఆవిషయము దుర్గాప్రసాదునకు తెలియును. అట్టి యాపత్సమయమున రత్నవల్లి తప్పక ఛాయాపటము నుత్తరములున్న చోటునకు పరువెత్తు

నని యతఁడు గ్రహించి యుండెను. అందువలన నతఁడు కడు జాగ్రతతో రత్నవల్లికి తెలియకుండు విధమున నామెను కనిపెట్టుచుండెను. రత్నవల్లి దుర్గాప్రసాదుని వాక్యములు వినినతోడనే తత్తరపాటుతో గదిలో నొకమూలకు పరువెత్తెను. దుర్గాప్రసాదుడు క్రిందనేమి జరుగుచున్నదో చూచుటకై యేగినట్లుగా మెట్లవైపునకు పరుగెత్తి, యచ్చనుండి రత్నవల్లికి కానరాకుండ పొంచి చూచుచుండెను. వల్లి యంతట మూలనున్న యలమారును ప్రక్కకు జరపి, వెనుక భాగమున గోడలో నందముగా నమర్పబడియున్న యొక చిన్నపెట్టెను లాగికొని బోవుచుండెను. అంతలో దుర్గాప్రసాదుడు ముక్తకంఠముగా.

"వల్లీ! భయములేదు, నీ వింటనుండుము"

అని కేకవైచి దిగిపోయెను. అంతట రత్నవల్లి యా యలమారును వెనుకకు త్రోసివైచెను. ఆచిన్నపెట్టియ నామె బైటికి గొనరాలేదు. దానిని యథాస్థానమునందే యుంచెను.

రత్నవల్లి క్రిందికిదిగివచ్చునప్పటికి దుర్గాప్రసాదుడచ్చట లేడు. ధ్వనియును లేదు. తలుపులన్నియు తెఱచి యుండెను. రత్నవల్లి భయముచే నాపాదమస్తకము కంపమునొందెను. సేవకుల నడుగగా వారిట్లు చెప్పిరి.

దుర్గాప్రసాదుడు దిగివచ్చునప్పటికి తలుపులు బ్రద్దలయి పోవుచున్నట్లుండెను. అప్పుడతడు "ఎవరు?" "నా పేరు దుర్గాప్రసాదరావు" అని యరచుచు తలుపులు తెఱచెను. దొంగలు పలాయనమైపోయిరి. వారిని వెంబడించుచు దుర్గాప్రసాదుడసహాయశూరుడై పరువెత్తుకొనిపోయెను.

రత్నవల్లికి నెనుకటి యుపాయము మాట జ్ఞప్తికి వచ్చెను. ఆనాఁడును, నేఁడును తన కుపకార మొనరించిన సుగుణరాశికి, దుర్గాప్రసాదున కేమి యుపద్రవము వాటిల్లునో యని మిగుల దుఃఖించుచు నారాత్రి శేషమును గడపెను. దుర్గాప్రసాదుడు తిరిగి రాలేదు.



# 16

## రత్నవల్లివంచనము.

రత్నవల్లి కారాత్రియంతయు నిద్రలేదు. తెల వారుజామునరకును దుర్గాప్రసాదుడు తిరిగివచ్చునని మేల్కొని యుండెను. కడచిన యుదంతమంతయు ప్రసాదుడు చెప్పగా వినవలయునని కుతూహలపడినది. కాని యతడెంతసేపటికిని రాలేదు. అర్ధరాత్రమువరకు నాట పాటలతోడను, మిగిలిన సగము రాత్రియును భీతిచేతను కలిగిన యాయాసముచే తెలతెలవారు సమయమున రత్నవల్లికి కొంచెము నిద్రవచ్చెను. ప్రొద్దుపొడిచినతోడనె వారిజాక్షి రత్నవల్లికి కాలకృత్యములు తీర్చుకొనుటకై వలయు సామగ్రినంతయు మేడపైకి కొనివచ్చునప్పటి కామెనిద్ర మేల్కొనలేదు.

వారిజ కేళీనికేతనము సంగలి ప్రధానదాసి. దానికి పదియేండ్లు నిండకమునుపే రత్నవల్లి దగ్గరకు దీసినది. ఆదరాతిశయముతో పెంచి పెద్దదానిని చేసినది. అనేకరహస్య విషయములను గూర్చి వల్లి దానితో ప్రసంగించుచుండును. కష్టసమయములందు దాని సహాయమడుగుచుండును. వారిజకానాడు జరిగిన దంతయు చిత్రముగ దోచినది. దుర్గాప్రసాదుడు కేళీనికేతనమున ప్రవేశించినప్పటినుండియు రత్నవల్లి విష

రీతముగ మారిపోయినది. ఆమె వెనుకటివలె వారిజతో నిప్పుడు సంప్రదించుటలేదు. వారిరువురకును గల సంబంధమే దానికి గోచరముకాలేదు. దుర్గాప్రసాదుడు సామాన్య కాముకవర్గములోఁ జేరినవాఁడు కాడు. అతనివలె నింతవర కెవ్వరును రత్నవల్లిని నిర్లక్ష్యముగ చూచి యెఱుగరు. ఎన్నఁడును తననమ్మకమును సందేహించి యెఱుగని రత్నవల్లి యాతనివిషయమై యింత మానము వహించి యుండుట కేమి కారణమని వారిజ తలంచెను. మొత్తముమీద దానికి ప్రసాదునియెడల నంతగా నసహ్యము లేకున్నను అనుమానముమాత్ర ముండెను. ఆయను మానమెప్పుడో యొకప్పుడు రత్నవల్లియే తీర్పగలదని వారిజ విశ్వాసము. అందుచలన రత్నవల్లి నందువిషయమై గ్రుచ్చియడుగ లేదు. తనంతదానామెయె తనతోఁ జెప్పునంతదాక వేచియుండ నిశ్చయించుకొనెను.

చాల ప్రొద్దెక్కినపిదప నల్లి నిద్ర లేచెను. వారిజాక్షి యచ్చటనే యొకమూలగా గూర్చుండి యుండెను.

రత్న:— వారిజా! నన్నింతవరకును నిద్ర లేపలేదేమి?

వారి:- ఇప్పుడుమించిపోయిన దేమున్నది.

రత్న:— సూర్యోదయానంతరము నిద్రించుట నాయలవాటుకాదు. అట్లొనర్చుట యెందుకో నాకసహ్యము.

వారి:— మీరు సరిగా నిద్రపోయి చాల దినములైనది. మీకు మనశ్శాంతి లేదు. మీ వెనుకటి యుత్సాహము కూడ తగ్గినది.

రత్న:— ఉత్సాహమున కేమిగాని నాకై యెవరును రాలేదుగద.

వారి:— రాకేమి? దుర్గాప్రసాదులు నేయమునకే వచ్చి మీరు నిద్రించు చుండుటచే నాతో మరల వచ్చెదనని చెప్పి వెళ్ళినారు.

రత్న:— అప్పుడైన నన్నేల నిద్ర మేల్కొలుపలేదు?

వారి:— ఆయన వచ్చినది నేనెరుగను. పోవునప్పుడు నాతో మరల వచ్చెదనని మాత్రము చెప్పి పోయిరి.

రత్న:— మరల నెంతలో వచ్చెద నన్నారు?

వారి:— అదియు నాతో చెప్పిపోలేదు.

రత్న:— నీవెందు కడుగలేదు?

వారి:— అంత వ్యవధి లేకపోయినది. నేను దొడ్డిలో పని చేయుచుంటిని. నీటికై బావియొద్దకు వచ్చునప్పటికి కాలి చప్పుడులు వినవచ్చుటచే నింటిలోనికి వచ్చితిని. అప్పటికే దుర్గాప్రసాదులు వెడలిపోవు చుండిరి. నేను వచ్చుటనుచూచి వెనుకకు దిరిగి నాతో నీమాట యొకటి మాత్రము చెప్పి పోయిరి.

రత్న:— తుదకు కేళీనికేతనము పల్లె కొంపయయి పోయినది.

రత్నవల్లి చాలసేపు విసుగుకొనినది. ప్రసాదుని గురించి యింత యాతురత యెందుకువలననో వారిజతో చెప్పలేదు. వారిజయు నామె నడుగలేదు.

దుర్గాప్రసాదుడు కడచినరాత్రి దొంగలను తరుముకొని పోవు నెపమున బయలుదేరి సరాసరి రామమూర్తి యింటియొద్ద కేగి యతని నిద్రలేపెను. లేఖలను ఛాయాపటమును త్వరలో తీసుకొని వచ్చెదననియు, నుదయమున నెచ్చటికిని పోక యింటియొద్దనే యుండుమనియు చెప్పి యచటనుండి వెడలిపోయెను.

ఉదయమున రత్నవల్లి యింటియొద్దనుండి మరల రామమూర్తి గృహమున కేగెను. తనకష్టములన్నియు తుట్టతుద కీడేరినవి గదాయని రామమూర్తి వేచియుండెను. లోలోపల నతడు దుర్గాప్రసాదుని మైత్రీవిశ్వాసములను ప్రశంసించుకొను చుండెను. అతడింత త్వరలో వస్తువులు దొరకునని తలచియుండలేదు. రాజశేఖర మరణానంతర మతనికట్టి యాశయే లేదు.

దుర్గాప్రసాదుడు వచ్చుటతోడనే రామమూర్తి సంభ్రమముతో లేచి నిలువబడి

"ఏవీ? దొరకినవా?" యనియెను.

దుర్గా:— మరల మోసము జరిగినది.

రామమూర్తి కొంతతడవు నివ్వెఱపోయి చూచి "నేనప్పుడే యనుకొంటిని. నీవు భ్రమపడి యుంటివి"

దుర్గా:— భ్రమకాదు. అవియున్న స్థలమును పరీక్షించి చూచితిని. తప్పక ఆప్రదేశముననే యవియుండి యుండును. సందేహము లేదు. అలమారాకు చాటుగా నున్న గోడలోనే యవి దాచబడినవి.

రామ:— అట్లైన రత్నవల్లి నీవాప్రదేశమును చూచిన సంగతిని గ్రహించి యుండు ననుకొందువా?

దుర్గా:- అది యసంభవము. ఆభరణములను భద్రపఱుపుమని యామెతో ననినంతనే నేను క్రిందికి దిగిపోవునట్లు నటించితిని ఆమె నన్ను చూడ లేదు. అదినిశ్చయము.

రామ:- మఱి యా లేఖలు ఱెక్కలువచ్చి యెగిరి పోయినవా?

దుర్గా:- నాకొకసంగతి స్ఫురణకు వచ్చుచున్నది. రత్న వల్లి మనస్సు నామాటలు వినినంతనే యా యుత్తరముల మీదికి పోయినది:— అంతవరకు సహజముగనే యున్నది. రత్నవల్లి జీర్ణమైన భవ మంతయు మరల నాయుత్తరముల మూలముననే పునరుద్ధరింప బడవలయును గదా? రామమూర్తి

యిచ్చు నేబది వేలరూపాయలకు నవి యే యాధారము. అంతటి యమూల్యములగు వస్తువులను రత్నవల్లి సదా చింతించుచునే యుండును. వానికి రానున్న విపత్తులను, అపాయములను గూర్చి తర్కించుకొనుచునే యుండును. ఇతరులకెవ్వరికిని తెలియకున్నను తెలిసియుండునేమో యనుసందేహ మామెను బాధించుచునే యుండును. అందువలన తనకు తానే భయపడి యా యుత్తరము లచ్చటనుండి తొలగించి యుండును. అదియు గాక నీవనినట్లు నాకంట బడినట్లుకూడ సందేహించి యట్లుచేసి యుండవచ్చును. ఇంతకును పర్యవసానము మనకు ప్రతికూలముగ నున్నది. నీవుమాత్ర మేమియు నధైర్యపడ నవసరములేదు. నీ స్నేహితుని యావచ్ఛక్తియు నీకుపకై వినియోగింపబడును.

రాము:— ఇంతకు దెచ్చినది నాదురదృష్టము. నీసహాయమును నేనెన్నటికిని తిరస్కారభావమున చూడజాలను.

సుర్గా:— నాకింకను ఆశాభంగము కాలేదు. ఇన్నినాళ్ళ లస్వస్థమగుటచే నీవిషయము లన్నియు నీతో చెప్పవలసి వచ్చినది. నేనును బుద్ధిహీనుడనై

కార్యము గట్టెక్కకే మునుపే చాక [illegible]వచ్చితిని. తుదకొక స్త్రీచే మోసగింప బడవలసిన యదృష్టముపట్టినది. ఈయవమానము త్వరలోనే తీర్చుకొన గలను. కాని తొందరపడి లాభము లేదు. అందులో రత్నవల్లితో నంతసులభముగ చెరలాట మాడగూడదని తోచుచున్నది. నేను పోయి వచ్చెదను.

మరల నానాటిమధ్యాహ్నమే దుర్గాప్రసాదుడును రత్నవల్లియును కేళీనికేతనము నందు సరస సల్లాపము లాడుకొనుచుండిరి. కడచిన రాత్రి దొంగతనమును గూర్చి రత్నవల్లి యడిగినది. యథావిధిగ దుర్గాప్రసాదుడు రామమూర్తిపై నపనిందలు గ్రక్కెను. రత్నవల్లికి ప్రసాదునిపై మోహము మితిమీరినది. అతడు లేని యెడల తనకు సుఖజీవనమను మాటయే లేదని యామె తలచినది. అతిదీనముగ నతనిని ప్రయాణ మాపుకొన వలయునని ప్రార్థించినది. అతడు తన సంసారమునంతయు వదలి పరోపకారమునకై ప్రథమమున వల్లిని సందర్శించి యామె యపూర్వ విలాసముచే మోహితుడనైతినని, తన ప్రేమకు రత్నవల్లియే యాస్పదమనియు గత్యంతరము లేదనియు మొదలగు ప్రేమ ప్రసంగము లొనర్చెను. రత్నవల్లి తన పన్నిన పన్నాగము లన్నియు ఫలప్రదము లైనవని సంతసించినది. ప్రసాదుడు వెను

కటి గాంభీర్యమును, పెత్తనమును వదలి సఖుడై సంబంధియై వర్తించెను.

దుర్గాప్రసాదుడు వెడలిపోయిన తర్వాత రత్నవల్లి సోత్సాహముగా నిట్లను కొనినది. 'ఇన్నాళ్ళకీ సాహస వంతుడు నా సమ్మోహనాస్త్రము నందలి ప్రభావమును గ్రహించి యున్నాడు. ఇతని నీ సుఖ స్వప్నమందెన్ని నాళ్ళని యుంచుకొనగలను. ఈతడు నిరంతరము నా చెంతనే యుండు నుపాయము నాకెట్లు దొరకగలదు. కానిమ్ము. నా యదృష్టమే నాకేదైన మార్గము చూపగలదు.'



# 17

## క్రొత్త పెండ్లికూతురు.

రత్నవల్లి యొకనాడు తన నిలువు టద్దమున కెదురుగనిలిచి శరీరాలంకారములను సవరించుకొనుచుండెను. ఆమె సర్వాభరణ భూషితురాలై యుండలేదు. ఆమె కంఠసీమయు మణిబంధములును బోసి పోవుచుండెను. నగలు తన యందమునకు వన్నె బెట్టినవా? లేక తన యందమే నగలకు వన్నె బెట్టినదా యని యామె తన ప్రతిరూపమువంక సవిమర్శగ చూచుకొను చుండెను. రత్నవల్లి ముఖమండల మానాడు మహా సౌందర్యరాశియై వెలుగు చుండెను. పూర్వకాలపు తళతళలంపు కనిపించలేదు. ఇటీవల వచ్చిన యాశా భంగములు అవమానములు నచ్చుట గోచరించలేదు.

వారిజ యామె చెంతనేయుండి యవియు, నివియు నందించు చుండెను. రత్నవల్లి యలంకార మంతకంతకాలస్యమగు చుండెను. ఆమె తన సుకుమార హస్తద్వయమును పైకెత్తి ముంగురులను వ్రేలి కొనలతో సరిచేయుచు జగన్మోహనములగు తన వీక్షణముల నించుక ప్రక్కకు త్రిప్పి మధురమంద హాసముతో.

"వారిజా! నా పెండ్లికి నీవు వచ్చెదవా? నిన్ను గూడ బొట్టుపెట్టి పిలువవలసిన దేనా?"

వారిజకు నోటివెంట మాట రాలేదు. అది రత్న వల్లి వంక విభ్రాంతిపోయి చూచుచుండెను. రత్నవల్లి మాత్రము తిరిగి చూడలేదు. ఆమె తన యలంకారము నందే మగ్నమైనట్లుండెను.

"వారిజా! ఏమట్లూరకున్నావు. నేను పెండ్లి చేసికొన బోవుచున్నాను. పరిహాసముకాదు. యధార్థము."

వారి:— ఇకపై నదొకటియే తక్కువ.

రత్న:— నన్ను చక్కని పెండ్లికూతురిని చేయలేవా?

వారి:— నిన్నొకరు చేయవలయునా? నీకన్న చక్కని పెండ్లికూతురీ ప్రాంతములలో నెచ్చటను లేదు. అందుకుగాదు—

రత్న:— మఱి నీసందేహ మెందుకు?

వారి:— అమ్మా!— నీవు తలచిన నా సందేహము లెందుకు పనికివచ్చును?

రత్న:— ఈ వివాహవార్త మొట్టమొదటనే నీతో చెప్ప లేదని నీకు చాల కోపము వచ్చినట్లున్నది. నేనును వివాహ మాడదలచుకొని యెంతోసేపు కాలేదు.

వారిజ మరల నిరుత్తరయై యూరకుండెను. రత్న వల్లి యంతట నిలువుటద్దమునుండి యీవలకు వచ్చి తనలో దానాలోచించుకొనుచు నిలువబడెను. కొంచము

కంపిత స్వరముతో వారిజను సమీపించి యిట్లని యెను.

"వారిజా! నివిట్లు మాతి ముసుచుకొనిన పని కానేరదు."

వారి:— ఒకరి యధీనమందుండుటకు నీవెట్లు సమ్మ తించితివి?

రత్న:- అధీనమని మాటవరుస కనుటయో కాని కాపు రముచేయు కాంత లందరు నొకరి యధీనమందున్నారా?

వారి:- లేక స్వతంత్రముగ వర్తించు చున్నారా?

రత్న:- అది యంతయు వారివారి తెలివి తేటలను బట్టి యుండును.

వారి:- వారి యదృష్టమనిన బాగుండును.

రత్న:- అదృష్టమో దురదృష్టమో రత్నవల్లి మాత్ర మెవరికిని దాస్యము చేయజాలదు. నీవెఱుగవా?

వారి:— వెనుకటి రత్నవల్లి నెరుగుదును.

రత్న: ఇప్పుడామె మారిపోలేదు.

రత్నవల్లి మరల కొంచెము సేపు నిటు నటు దిరిగి యాలోచించి వారిజ కెదురుగా నిలిచి నవ్వు మొగముతో

"అవును కాని వరుని పేరడుగ లేదేమి? అత డెవరో నీవెఱుగుదువా?" అనియెను.

వారి:= అదికూడ వినిపింపుము. అతని పేరేమి?

రత్న:— మగనిపేరు చెప్పుటకు నాకు సిగ్గగుచున్నది. అయిననేమి యతఁడు మనకు చిరపరిచితుఁడే. దుర్గాప్రసాదరావుగారును నేనువచ్చిన తలుపు తీసెదవా?

వారిజకు గుండె ఝల్లుమనినది. దుర్గాప్రసాదుని రత్నవల్లి పెండ్లియాడునా? ఏమిచిత్రము? అదియెట్లు సంభవించును. వేశ్యాంగనకును, బ్రాహ్మణునకును వివాహము పొసగు టెట్లు? ఒకవేళ పొసగినను పరిణ యమాడి యెవరు సహింతురు. ప్రసాదునిపైగల యను మానమంతయు వారిజకొక్కసారి పైకుబికినది. ఈవివా హముతో సంతయు నాశనమగునని యామె తలంచెను. ఎంత చింతించినను వివాహముమాట నమ్ముటకు శక్యము గాకుండెను.

వారి:— పల్లి! ఈబుద్ధినీకే పుట్టినదా? ప్రసాదుఁడే నీకు బోధించియుండునా?

రత్న:— ఒకరి దుర్బోధలనువిని మోసపోవునంతటి మంద మతి ననుకొంటివా? నాకేతోచినది.

వారి:— ఎంతప్రయత్నించినను నాకీ వృత్తాంతము బోధ పడుట లేదు.

రత్న:- అట్లైన చెప్పెదనువినుము. దుర్గాప్రసాదుని సఖ్యమువలన మన కత్యంత లాభమున్నది. అతని

సహాయము లేకున్నచో నాలాభము నష్టముగా పరిణమించును. రామమూర్తి మనకిప్పుడు ప్రబల శత్రువైన విషయమును నీవెఱుంగుదువు. ఈ దొంగతనములు, బందిపోటులు, అల్లరులు నతని వలననే కలుగుచున్నవి. అతనికి ప్రసాదుడన్న నమిత భీతి. అతడిచ్చటనున్నను బాంధవ్యమై యుండనియెడల రామమూర్తి మనల నందఱ నెన్నాళ్ళకిందనో అధఃపాతాళమునకు ద్రోసి యుండును. రామమూర్తికిని నాకును జన్మ శత్రుత్వము. మాలో నెవ్వరో యొకరు మరణించినగాని యది యంతమొందదు. కావున వలన నిరంతరమును మన యొద్ద దుర్గాప్రసాదుని వంటి ధైర్యశాలి యుండుట ముఖ్యము. అందుకై వివాహము తప్పమఱియే యితరోపాయమును నాకుతోచలేదు. బలవంతముచే దుర్గాప్రసాదుని కూడ సమ్మతించునట్లొనర్చితిని. ఈకార్యము నిర్విఘ్నముగ కొనసాగుటకై నీవును నాకు తోడ్పడవలయును.

వారి:- ఎన్నియాపదలు వచ్చిననేమి? ఈవివాహము మాత్రము నాకిష్టములేదు. దుర్గాప్రసాదుడు ధైర్యశాలియని నీవేచెప్పితివి. అతని నీవెన్ని నాళ్ళని నీయొద్ద నుంచుకొనగలవు. వివాహ

మైన నేమి కాకున్న నేమి. అతనికి మనసు కుదిరి నన్నాళ్లే యిచ్చుటనుండగలడు. తన సంసారము నంతయు నీకై వదలివచ్చిన వాడు నిన్నుమాత్రి మెల్లకాలమును కనిపెట్టుకొని యుండునా? అంతటి బద్ధానురాగమే యున్నచో వివాహము కానంత మాత్రమున నదియంతయు శూన్య మగునా?

రత్న:— వారిజా! నీ వెంతదూరము వాదించినను లాభము లేదు. నీకేసంబంధమనిన యిష్టము? నాయిష్టము. ఇక వాదించిన నేమి ఫలము? నీసర్వశక్తుల నుప యోగించి నాకుత్తీర్పు డ్పడెదవా? లేదా?

వారి:— చెప్పవలసిన దానను గావుననే యింతదూర్గము చెప్పితిని. నాసహాయమునకై నన్నింతయాచింప వలయునా యేమి?

రత్న:— నా వివాహామునకు చుట్టపక్కము లెవ్వరును రారు. నీవు వారందరను మర్యాద చేయవలసిన యవసరములేదు.

వారి:— వివాహము మధ్యవచ్చు కష్టములను నేనెంత మాత్రమును లక్ష్యపెట్టుటలేదు. అసలు వివా హాము నీకు సౌఖ్యకారణము కానేరదని నాకు తోచుచున్నది. ఎందువలననో నేచెప్పజాలను

రత్న:- నేనుచెప్పుదునా? అకస్మాత్తుగా నీవు వివాహ
వార్త వినియుండుటయే కారణము.

వారి:- అమ్మా నామాటవిని యీపరిణయము మాను
కొనుము.

రత్న:- వారిజా, యెన్నిసారులు నీయిష్టానుసారము
ప్రవర్తించలేను. ఈయొక్కసారి నాయాజ్ఞను
పాలింపుము. భయము నొందకుము.

వారి:- నీవిదివర కెన్నడును పెండ్లియాడి యుండలేదు.
తక్కిన పనులతో నిదియెట్లు సాటియగును?

ఈవిధముననే చాలకాలము మాట్లాడిరి. వారిజ కొనవరకును రత్నవల్లిని మందలించుచునే యుండెను. రత్నవల్లియు లోబడక తనవాదమునే నెగ్గించుకొనుచుండెను.

వీరిరువురిమాట యటుంచి వివాహకథావృత్తాంతము తెలిసికొనుట ముఖ్యము. ఈ పెండ్లియాలోచన మొదట తలసూపినది రత్నవల్లి మనస్సునందే. రాజశేఖరము బ్రతికి యున్నరోజులలో పరిణయ మాడుమని యెన్నియో సారులు రత్నవల్లికి చెప్పియుండెను. ఆమె యతని మాటలను లక్ష్యపెట్టలేదు. రామమూర్తి చేష్టల వలన గలిగిన భయోత్పాతముచే నామె యొకనాడు పరిహాసముగా ప్రసాదుని పెండ్లియాడ నెంచినది. అది యామె మనఃపూర్వకముగా ననుకొనలేదు. అట్టి సం

యోగ మెట్లుండునో కేవలము భావించి చూచుటకు. కాని యాభావము మరలి మరలి వచ్చుచుండెను. మనో వ్యధలందు, కార్యభారమునందు అసహాయ స్థితియందు నాభావ మామె మనస్సు నూరించుచుండెను. తుదకది యంత స్వప్నప్రాయముగా కాన్పించలేదు. కొంచెము ప్రయత్నము చేసినయెడల నది సుసాధ్యమగునని యామె తలంచినది. అందుకై విందులు చేసినది. ఉత్సవములు జరిపినది. దుర్గాప్రసాదుని ధీరహృదయమును, వివాహోన్ముఖమగుటకై శక్తి నంచనలేక పాటువడినది. తుదకు దుర్గాప్రసాదునిచే కూడ నొప్పించినది. ఇక వివాహము నిశ్చయమయినట్లే. దుర్గాప్రసాదుడు కూడ నీ విపరీత కార్యమున కెట్లు సమ్మతించెనో తెలిసికొనవలసి యున్నది. రత్నవల్లి యేకాంత సమయమున నతనితో నీసంగతి వెలిబుచ్చిన నాడు దుర్గాప్రసాదు డత్యాశ్చర్యము నొందెను. అతడదివరకు రత్నవల్లిపై తనకు గాఢానురాగ మున్నదని చెప్పి యుండుటచే నీ వివాహపుమాట చెవిని బెట్టకుండుటకు వీలులేకపోయెను. అందుకు చాల బాధకము లున్నవని మాత్ర మతడు చెప్పుచుండెను. వాని నన్నిటిని మిక్కిలి సామర్థ్యముతో రత్నవల్లి ఖండించి సమాధానములు చెప్పినది. ఆ సమాధానము లన్నిటిని రాజశేఖరము నుండియే నేర్చుకొనినది. 'సివిలు వివాహ

చట్టము ననుసరించి యట్టి వివాహమున, కేయాటంకక మును రాదని చెప్పినది. అది సంపూర్ణముగ న్యాయ సమ్మతమేయగునని బోధించినది. అందుకు వలయు ధనము నంతయు తానే తెచ్చెదనని చెప్పినది. తనసర్వ స్వమును ప్రసాదుని చేతులలో ధారవోసెదనని చెప్పినది.

దుర్గాప్రసాదు డాలోచించి చూచెను. అందు వలన తన కార్యము సానుకూలమగునని యతడు గ్రహించెను. కాని ఆయల్పకార్యమునకై తన శరీరము నమ్ము కొను నంతటి త్యాగముచేయ జాలకుండెను. అతడట్లు కొన్నాళ్లు సంశయగ్రస్తుడై యుండెను. తుదకు సమ్మ తించెను. రత్నవల్లి యాశ్చర్య పడినది. అంతత్వరలో నత డొప్పుకొనునని యామె యెన్నడును కలనైనను తలంచి యుండలేదు. ఊహా ప్రపంచమున మాత్రమట్టి సంఘ టనము కుదరవచ్చునని తలచినదికాని యథార్థముగ నీలోకమునందు దుర్గాప్రసాదు డామెనువివాహమాడుదు నని యంగీకార మిచ్చుట తోడనే యామె మేరలేని యాశ్చర్యము నొందినది.

వివాహ ప్రయత్నము లన్నియు దుర్గాప్రసా దుడే చేయ నారంభించెను. సోమనాథ పట్టణమునందలి యార్య సమాజమువారి సమక్షమున వేదవిధుల ననుస రించి యార్యమత సంప్రదాయమున కనుకూలముగ వివాహము నొనర్ప నిశ్చయింప బడినది. ఆసమాజము

నందలి యాచార్యుల యొద్దనుండి ఫత్రికలుకూడ వచ్చినవి. సమాజము వారందరును రత్నవల్లి తలపెట్టిన కార్యమునకు నామె సుముఖత్వమునకు సన్మార్గోన్ముఖత్వమునకును శ్లాఘించిరి. దుర్గాప్రసాదుని స్వార్థత్యాగమును ప్రశంసించిరి. రత్నవల్లి యాప్రశంసా వాక్యములన్నియును కడు నుత్సాహముతో చదువుకొనినది.



# 18

## మంగళసూత్రము.



"తూర్పు ఉదయమున బయలుదేరి రావలసినది. ఎల్లుండి తెల్లవారుజామున ముహూర్తము నిర్ణయింపబడినది." అని రత్నవల్లిపేర తంతివార్త వచ్చినది. రాజపురమునుండి సోమనాథ పట్టణమునకు ప్రయాణ మొకపగలంతయు పట్టును. మరునాడుదయమున బయలుదేఱినయెడల నానాటి సాయంకాలము దీపములుపెట్టువేళకు సోమనాథ పట్టణము చేరవచ్చును. ఆమరునాటి వేకువయందే వివాహ ముహూర్తము. అందువలన వధూవరుల కెంతో వ్యవధి లేదు. పట్టుబట్టలను, తక్కిన పరికరములను రత్నవల్లి స్వధనమును వ్యయించి దూరదేశములనుండి యంతకు ముందుగా తెప్పించి యుంచినది. బంధువర్గమున కాహ్వానములు లేవు. శుభలేఖలు లేవు. భోజన ఖాద్యములకై ప్రయత్నములు లేవు. మంగళవాద్యములు లేవు. పూలపాలకులుగాని యూరేగింపులుగాని లేవు. అంతయు సులభముగ, ననాయాసముగ, వేదోక్తముగ క్లుప్తముగ, జరిపించుటకు నార్యసమాజమువారే నిర్ణయించుకొనిరి. కావున బయలుదేఱుట తప్ప వధూవరుల కేదియును చేయదగినపని లేదు. అయినను తంతివార్తను దుర్గాప్రసాదునకు చూపుటకై రత్నవల్లి యాతురపడుచుండెను. అతడానాడు పొద్దున

నుండియు రాకుండుటను బట్టియు, నప్పటికే మధ్యాహ్న మగుచుండుటను బట్టియు రత్నవల్లి యాతురత మతింత యెక్కువయయ్యెను. మరల నాస్వల్పకాలములో దుర్గాప్రసాదుడు వివాహమునకు విముఖుడై పోయెనేమో యని యామె భీతినొందినది. ఇట్టిభావ విపర్యయము నందుండగనే దుర్గాప్రసాదరావు రానేవచ్చెను.

యతడు విచ్చేసినం డనె, లజ్జావినమ్ర ముఖముతో రత్నవల్లి యాంతంతివార్త నతనికందిచ్చెను.

దుర్గా:— మంచిది. నాయాలస్య మేమియునుండదు.

రత్న:— మరల నిరువురను పీటలపై గూర్చుండబెట్టి హారతులిచ్చు వారెవరు? వారిజా! నీవేమైన చేయి జేసికొందువా?

వారి:— ఇన్నిపనులు మీరాయంతమీరే యొనరించు కొన్నవారి హారతులనుమాత్ర మిచ్చుకొనలేరా?

రత్నవల్లి వారిజవంక కొంత కఠినముగ చూచినది.

దుర్గా:— ప్రయత్నము లేవైన కొఱవడియున్నవా?

రత్న:— అన్నియు పూర్తియైనవి.

దుర్గా:— అట్లయిన సీతో నొకమాట.

అంతట వారిజ వారి సమక్షమునుండి దిగ్గున లేచి పోయెను. రత్నవల్లి ప్రసాదుని చెంతకువచ్చెను.

దుర్గా:— ఈవివాహముమాట పరమరహస్యముగ నుంచవలయును. నీకు సమ్మతమేకద!

రత్న:— నేను నాసంగతియే మీతో ముచ్చటింప దలచితిని.

దుర్గా:— అట్లైన రహస్యముగ నుంచుట నీకిష్టములేదా?

రత్న:— నాకట్లుంచుటయే పరమప్రియము. లేకున్న నీ వార్త బహిరంగ పరచి యూరివారందఱ నిందా ఘోషణములను తలపైబెట్టుకొందునా? అంతయు ముగియనిమ్ము. రహస్యమో, బహిరంగమో వీలును బట్టి యటుపై చింతింపవచ్చును.

దుర్గా:— నాకుకూడ నట్లే తోచినది. నీతో చెప్పకయే సోమనాథ పట్టణమున నీవివాహపు గొడవ యేమాత్రమును లేకుండునట్లు కబురంపితిని.

రత్న:— నాకును సమ్మతమే.

దుర్గా:— అట్లైన నేనిక పోయివత్తునా?

రత్న:— సోమనాథ పట్టణమునందు తగిన యేర్పాటులు చేసి యుందురా? మీరచటి కొకసారియైన నేగి యుండలేదు.

దుర్గా:— అచ్చట నాకాప్తు లనేకులున్నారు. వారందఱు నేనన్నన ప్రాణము లర్పింతురు. అందును, ముఖ్యముగా సమాజమునందలి సభ్యులు నన్నువిశే

షించి గౌరవింతురు. లోప మేమియును జరుగదు.

రత్న:— రాజశేఖరమునకు గూడ నార్యసామాజికులతో సఖ్యమున్నదని చెప్పగా వినియుంటిని.

దుర్గా:— నీవుపొరబాటుననైన రాజశేఖరము పేరెత్తవలదు. అది యపనిందకు ప్రబలకారణమగును. సోదరుడు మరణించిన కొలది దినములకే నీలాటి యామది పరిణయమాడ నెంచుటలోకులందఱును వినదగిన వృత్తాంతము కాను.

ఈహితోపదేశము రత్నవల్లి హృదయమున సూదిపోటువలె గుచ్చుకొనినది. ఆబాధనుండి తెప్పరిల్లి

"మీరచ్చట చిరపరిచితులగుటచే మనరహస్య వృత్తమునకు భంగము వాటిల్లునేమో?" యనియెను.

దుర్గా:— ఆభయమేమియును లేదు. వివాహ వార్త యెవ్వరికిని తెలియబోదు. ఒకవేళ తెలిసినను బయలుపడదు. మనమన్న భయమును భక్తియు నున్నవి.

అంతటితో సంభాషణము చాలించి దుర్గాప్రసాదుడు వేఱొకపని మీాద వెడలిపోయెను. మరునాడుద యమున వేకువజామున నేలేచి పనులన్నియు చక్కబెట్టు కొని వారిజాక్షియును, రత్నవల్లియును బయలుదేఱి

స్టేషనునొద్దకు వచ్చిరి. దుర్గాప్రసాదుడు వారినచ్చట కలిసి కొనియెను. ఆనాడంతయు ప్రయాణ మొనర్చి సాయంకాల మేడుగంటలు దాటినపిదప సోమనాథ పట్టణము చేరిరి. స్టేషనులో మొట్టమొదట నార్య సామాజికు లెవ్వరును వచ్చినట్లు కాన్పించలేదు. బండి నుండి దుర్గాప్రసాదుడు దిగినతోడనే కొందరు యువకు లచ్చట గుంపుగా చేరిరి. వారి సంభాషణము నందు "దుర్గాప్రసాద రావుగారు" "దుర్గా ప్రసాదరావుగారు" అను గుస గుసలు వినబడెను. ఆప్రాంతములందు ప్రసాదుడు సుప్రసిద్ధుడని యీ గుస గుసలు సూచించు చుండెను. అందులో నొక పెద్ద మనుష్యుడా దారిని బోవుచు నచ్చట, నిలచి నిదానించిచూచి.

"తమ నామధేయము" అని ప్రసాదు నడగెను.

"దుర్గా ప్రసాదరావు"

"అయ్యో తమరా? క్షమింపుడు. రాత్రియగుటచే గురుతు పట్టలేక పోయితిని. తమరేమి పనిమీద వచ్చితిరి?"

"ఈయూరిలో నార్య సమాజ మందిర మెచ్చట నున్నదో మీ రెరుగుదురా? ఇటీవల నొక నూతన గృహమున ప్రవేశించిరని వింటిని. అందువలన మిమ్మున నడుగవలసి వచ్చినది. ప్రాత మందిరము నెరుగుదును."

"మాయింటి కానుకొనియే యున్నది దయ చేయుడు. కలసియే పోయెదము. సమాజము వారెవ రైన వచ్చియుందు రనుకొందును." అని యత డిటునటు పరికించెను.

అంతలో నిరువురు తరుణ వయస్కులు సమీ పించి దుర్గా ప్రసాదునకు నమస్కరించిరి.

"అయ్యా మీరు మస్మెరుగరు. మిమ్మనేక పర్యాయములు చూచియుంటిమి. ఆర్యసమాజ మంది రమునుండి తమకొరకై వచ్చితిమి. ఆచార్యులవారు మిమ్మును మీ పరివారమును తోడ్కొని రమ్మని యంపి నారు. మీసామాను లేవైన నున్నవా?"

దుర్గాప్రసాదుడు "రామకృష్ణాచార్యులవారు క్షేమముగ నున్నారా?" యని కుశల ప్రశ్నము సేయు చు సామానులను చూపెను.

అందరును త్వరలో బండినెక్కిరి. ఇంకొక పావు గంటలో నొక డాబా యింటిముందాగినది. ఆగృహ ము మిక్కిలి విశాలమైనది. చుట్టును విరివియగు నారాసు ప్రదేశముండెను. అందు పూలచెట్లును ఉన్నత వృక్ష ములును మిక్కిలి యందముగా పెరిగి యుండెను. రాజ వీధి యామందిర ద్వారమునకు దూరముగ నుండెను. వీధి నుండి యాద్వారము వరకును సన్నని కాలిబాట వేయ బడి యుండెను. గృహద్వారమున కున్న మెట్లు దిగి

ముప్పదియేండ్ల వయస్సుగల యొక పురుషుడు కాలిబాట వెంబడి నడచి బండియాగిన తోడనే వచ్చి దుర్గా ప్రసాదుని కలసికొనెను. వెంటనే వారిరువురును గాఢముగ నొకరి నొకరు కౌగలించుకొనిరి.

అతడే రామకృష్ణాచార్యుడు. ఆగ్రామమునందలి యార్య సమాజమున కధిపతి. "ఆర్య సమాజమందిరము" అని పెద్ద యక్షరములతో నాయింటి గోడ కగ్రభాగమున నొక పెద్ద బల్ల తగిలించి యుండెను. "ప్రయాణమునందే యిబ్బందులును లేక క్షేమముగ వచ్చినారా?" యని యతడు కుశలము నడుగగా "మీ యపార కరుణవలన" నని ప్రసాదుడు బదులుచెప్పెను. రత్నవల్లియు, వారిజయునుకూడ బండినుండి దిగిరి. వెంట వచ్చిన బాలకు లిరువురును సామానుల నింటిలోనికి గొని పోయిరి. అంతట రామకృష్ణుడు వారిని వెంటబెట్టుకొని యింటిలోనికి గొనిపోయెను. ఆతని భార్య వీధిగుమ్మము వద్ద నెదురుపడి పాద ప్రక్షాళనమునకై నీళ్లు తెచ్చి యిచ్చినది. రత్నవల్లిని వారిజను వెంట నిడుకొని యంతఃపురమునకు గొంపోయినది. రాత్రి పొద్దుబోవు వరకును దుర్గాప్రసాదు డాచార్యునితో సంభాషించుచునే యుండెను. రత్నవల్లియును వారిజయును నాచార్యాణితో కొంత తడవు మాట్లాడి పెరటిలోనున్న బావి యొద్దకు మంచినీళ్లకై యేగి యామాటయు నీమాటయు మాట్లాడుకొనుచుండిరి.

"ఏమి చిత్రమైన విడిది యిల్లమ్మా" యని వారిజ నవ్వినది.

"సమాజ మందిరము లిట్లే యుండునని" రత్న వల్లి సమాధానము చెప్పి కొంచెము మంచినీళ్ళు త్రాగినది.

వారిజ యంతటితో నూరు కొనక,

"రాత్రి వేళే తరలి వచ్చుట, వేకువ జామున పెండ్లి, మంచి ముహూర్తమే కుదిరినది. రాత్రియే వివాహమై తెల్లవారు నప్పటికి రాజపురము చేరిన నింకెంత బాగుండి యుండును." అనినది.

"మనకు తగినట్లే దొరికినది." అని రత్నవల్లి తన్ను దాను హేళన మొనర్చు కొనినది. వారిజయు "తగినట్లే" యని చెంబు నిండ నీళ్లు ముంచుకొనినది. అంతట వారిరువురును గలసి యింటిలోని కేగి తమకై నియమింప బడిన గదిలోని కేగిరి. అచ్చట కొంత తడవు విశ్రమించిన తరువాత దుర్గాప్రసాదుడు వచ్చి రత్నవల్లితో,

"చాల ప్రొద్దు పోయినది. కొంచెము నిద్ర పోయెదను. మీరును నిద్ర పొండు. అన్ని ఏర్పాటులును సలక్షణముగ నున్నవి. నేనిచ్చటకు రాని కొఱతయే మాత్రయును లేదు. అన్నియు సిద్ధముగ నున్నవి." అని చెప్పి వెనుకకు తిరిగి పోయెను.

ఏ రెండు గంటలు నిద్రపోయిరో కాని నాలుగు గంటలైన కాక పూర్వమే యందరును లేచిరి. ఆగృహ మధ్యమునందున విశాలాంగణమునందు హోమము లకై గుండములు తీయ బడినవి. పెండ్లి పీటలు, పసుపు కుంకుమము, గంధము మొదలగు మంగళ సన్నాహ మంతయు చేయబడినది. గృహ మంతయు తోరణము లతో పచ్చ పచ్చగ నలంకరింప బడినది. మంగళ స్నానము లాచరించి వధూవరు లిరువురును, తమ తమ పీఠములపై కూర్చుండిరి. మధ్య మధ్య వారిజ నూత్న వస్త్రములను, వక్క లాకులను విలంబము సేయక యందించుచునే యుండెను. ఆచార్యుడు మంత్రోచ్చాట నమ్మ నారంభించెను. వధూవరులచే ప్రదక్షిణములు నమస్కారములు, ఆచమనములు సేయించిరి. హోమ గుండముల యందాజ్యమును పుష్కలముగ గుఱిపించిరి. తలబ్రాలు పోయించిరి. ముందు వెనుక లాలోచింపక వేదోక్త వివాహ విధాన మంత్రయు నొక్కటియు విడువక కుండ జ్ఞాపకమునకు వచ్చినప్పుడెల్ల చేయించిరి. "అద్రి కన్యక తలవంచె, హరుడు నవ్వె" నను నట్లుగా రత్న వల్లి తల వంచినది. దుర్గాప్రసాదుడు నవ్వెను. తుదకాచార్యుని భార్య, పసుపు కుంకుమ యద్ది భద్ర ముగా దాచి యుంచిన మంగళ సూత్రమును తెచ్చి యిచ్చెను. 'మాంగల్య మంతునా నేన, మమ జీవన

హేతునా కంఠే బధ్నామి సుభగే త్వం జీవ శరదాం శతం ” అని ప్రసాను నుచ్చరించుచు నా సూత్రమును రత్నవల్లి కంఠ సీమయందు బంధించెను. వధువుచేత “ నాతి చరామి ” మొదలగు వాక్యములు పలికించిరి. సూర్యోదయ మయిన నొకటి రెండుగడియలకు వివాహ మంతయు ముగిసినది. అంతట ఆచార్యాణి శాకపాకము లన్నియు నడ్డింపగా షడ్రసోపేతముగ నందరును భుజయించిరి.

ఆ శుభకార్య మిట్లు నిర్విఘ్నముగ కొనసాగినది. అందు మంత్రోచ్చారణము సలక్షణముగా నున్నదో లేదో విచారించుట కచ్చట పండితు లెవ్వరును లేరు. పోనీ పండితుల ఛాందసము లేకున్నను, ఆర్య మత సంప్రదాయానుసారముగ నైన కర్మ నిర్వర్తింపబడిననదియు జరిగినట్లు తోచదు. అచ్చటి ముత్తైదువలు తరుణ వయస్కురాలగు నాచార్యాణియును, నే పాప మెఱుగని వారిజయు నై యుండిరి. పెండ్లి పెద్దలు సమాజము నందలి యైదారుగురు సభ్యులు, వారును కునికిపాట్లుపడుచు నంతశ్రద్ధతో ప్రవర్తించ లేదు. వారు తప్ప నెవ్వరును సమాజమునం దున్నట్లు లేదు. రత్నవల్లి యీవిషయమై దుర్గాప్రసాదు నొకటి రెండుసారులు ప్రశ్నించినది. అందుల కతడు ప్రచారమునకై చాల మంది సభ్యులు దేశాంతరమేగి యుండిరని చెప్పెను.

ఆనాఁడే యాయైదారుగురలో నొక కొందఱు కార్యావసరముచే నెచ్చటికో వెడలిపోయిరి. వారేగక పూర్వము రత్నవల్లికిని దుర్గాప్రసాదరావునకును వేదోక్తపద్ధతి నార్యమతానుసారముగా, న్యాయ సమ్మతముగా వివాహము జఱిగినదని యొక కాగితముపై ముద్రించి యాచార్యుఁడు సంతకము చేసి యిచ్చెను. ఆపరిణయ పత్రమును రత్నవల్లి భద్రముగా తన పెట్టెలో దాచి యుంచుకొనినది.

ఆమందిరమునందే వధూవరు లిరువురును మూఁడు నిద్రలనుచేసి రాజపురమునకు ప్రయాణమైరి. సామాజికులు కొందఱు వారి నాదరపూర్వకముగ వీడ్కొల్పిరి. రాజపురమునకు వచ్చినతర్వాత మరల కేళీనికేతనమునందుత్సవము జఱిగినది. రత్నవల్లి తన సర్వస్వమును దుర్గాప్రసాదున కప్పగించినది. అతనియొద్ద నికనామెకు దాపరికము లేదు. అతని కెఱిగింపఁగూడదనిన రహస్యములేదు. ఆరాత్రి ప్రయాణపు బడలికచే సుఖముగ శయనించినది. తన పెట్టెలోని పరిణయ పత్రమువలె దుర్గాప్రసాదుఁడుకూడ భద్రముగ నున్నాఁడని యామె తలచినది. రామమూర్తి కీవార్త తెలిసినయెడల నెంత భీతినొందునో యని సంతోషించినది.

ఆరాత్రియే దుర్గాప్రసాదుఁడు రామమూర్తి యుత్తరములను, ఛాయాపటమును సంగ్రహించి

యుంచుకొనియెను. ఆమరునా డుదయమున, రత్నవల్లి తో నేదియో చెప్పి తాళపు చెవులను తనయొద్ద నుంచుకొని యెచటికో వెడలిపోయెను. మరల నింతవరకును రాలేదు.

వెడలిపోయిన పది పదునైదు దినములదాక రత్నవల్లి ప్రతి దినమున నొక యుత్తర మతడు వ్రాయుచుండెను. తరువాత నా యుత్తరములుకూడ నాగిపోయినవి. ఆయుత్తరములందు దుర్గాప్రసాదుడు తనకు రత్నవల్లిపై గల యపరిమితానురాగమును వర్ణించెను. ఆమెవలని వియోగము దుస్సహమని నిట్టూర్పులు విడిచెను. దిన మొక యుగముగా గడపుచుంటి ననియు తన శరీర మన్యగృహమున నుండినను మనస్సంతయు కేళీనికేతనమునందలి సౌఖ్యప్రదాయనియగు రత్నవల్లియందు లగ్నమయియున్న దనియు వివాహము ముగిసిన తరువాత తన జన్మము చరితార్థ మైనట్లు భావించుచుంటి ననియు వ్రాయుచుండెను. రత్నవల్లి మొట్టమొదట నతనికై విచారపడినది. వియోగ బాష్పములచే నార్ద్రము లయిన యుత్తరములు వ్రాసినది. ఎన్ని పను లున్నను మానుకొని రావలసినదని ప్రార్థించినది. తుదకు సందేహ పడ నారంభించినది. భయ విహ్వల యైనది. ఎన్ని యవస్థల నొందినను దుర్గాప్రసాదుడు మరలి రాడాయెను.

ఈ సందర్భమున సోమనాథపట్టణము నందలి యార్య సమాజమును గుఱించియు నచ్చటి పెండ్లిపెద్దలనుగుఱించియుకొన్ని రహస్యములుచెప్పవలసియున్నది. ఆర్య సమాజమందిరము దుర్గాప్రసాదునిస్నేహితుడొకడు కొన్నాళ్లక్రిందట పుచ్చుకొనిన వసతి గృహము. ఆయింటిగోడకు తగిలించిన బల్ల రాజపురమున తయారైనది. దానిపై యక్షరములు దుర్గా ప్రసాదుడు స్వహస్తముతో వ్రాసినవి. పెండ్లి చేయించిన యాచార్యుడెవడు. ఆనాటిరాత్రి దుర్గాప్రసాదుడు కేళీ నికేతనము నందుండగా నర్ధరాత్రమున నల్లరి చేసిన దొంగలకు ప్రధాన నాయకుడు. ఆచార్యాణియగు నతనిభార్యయెవరు? చంద్రమతి. తక్కిన సభ్యులందరును నాచార్యుని స్నేహితులు. రత్నవల్లి తన పెట్టెయలో దాచియుంచుకొనిన మంగళసూత్ర ప్రభావమున నిది యంతయు నిర్విఘ్నముగ కొనసాగినది. దుర్గా ప్రసాదుడు లెక్కలేనన్ని సారులు వంచితుడై తుదకీ విధమునదిగ్విజయము నందెను.

అత డుత్తరములను ఛాయా పటమును గొని రామమూర్తిని సందర్శించుటకై యేగిన సమయమున నెంతటి యుత్సాహముతో నుండెనో చెప్పతరము గాదు. రామమూర్తియా యుత్తరముల నన్నియు పోల్చి చూచుకొని యానందముతో దుర్గాప్రసాదుని

గాఢాలింగన మొనర్చుకొనెను. ఇక తన వివాహ మునకు లగ్నము మార్చ నక్కరలేదు. కాని తనప్రాణ మిత్రుడగు దుర్గాప్రసాదు నెట్లు గౌరవింప వలయునా యని వితర్కించుకొనసాగెను. అంతటదుర్గాప్రసాదుడొక నిట్టూర్పు విడిచి.

"మూర్తీ! నీవలెనే నేనుకూడ చిరకాలమీ విధముగ నానందించుచుండ జాలను. నాకిక కష్టము లన్నియు ముందు రానున్నవి. అందువలన నీప్రాంతముల నుండియే వెడలిపోవలయుననిసంకల్పించుకొనియున్నాను.

రాము:— అంతటి యపాయమేమున్నది.

దుర్గా:— నాకై యప్పుడే యన్వేషణము జరుగుచున్నది.

రాము:— నీకై యన్వేషించుచున్నారా లేక హంతకునకై యన్వేషించుచున్నారా? నీపేరెవ్వరును పేర్కొనుట లేదే?

దుర్గా:— నేనేహంతకుడనని యెన్నాళ్లలో నిశ్చయ మగునో?

రాము:— అవును సింహాచలముతానివిషయమై భూమ్యాకాశములు కదలించుచున్నాడని వింటిని.

దుర్గా:— హత్యవిషయమై యెన్నటికిని యథార్థము బయల్పడదని నేననుకొనలేదు. మనము తల పెట్టిన కార్యము సఫలమగువరకును నిర్ధారణము

కాకుండుటకై ప్రయత్నించితిని. అదినీయదృష్టము వలన నీనాటికి గట్టెక్కినది.

రామ:- నీకు రానున్న యాపత్తును కనులార చూచుచు నాయదృష్టము నెట్లనుభవింపగలను. అదినాకు దురదృష్టముగనే యున్నది.

దుర్గా:- నన్నుగూర్చి నీవు చింతిలనక్కర లేదు.

రామ:- ఇంతటి యాపత్కారణ మగునని ముందే తెలిసి యున్నచో నిన్ని యుత్తరములకై ప్రార్థించి యుండను.

దుర్గా:- నీవు పొరబడు చున్నావు. ఈయాపదలునీవలన గాని, యింకొకరివలన గాని నాకు తప్పకవచ్చి తీరును. అది నాస్వభావము. నేనెన్నడును సోమరినై యుండజాలను. ఈసాహసకార్యము లనిన నాకు పరమానందము. అది నాబుద్ధికి పుష్టి కలిగించును. నాస్నేహితుల కుపకారక మగును. మంచియును చెడును నేనేమి యొన రించినను సమముగా కలుగుచుండును. పాపమో పుణ్యమో, నరకమో, స్వర్గమో, నే నెన్నడును చింతించను. మదిరాపానము కన్న నెక్కువ యుత్సాహమును బుట్టించు కర్మయనిన నాకు పరమప్రీతి. నాకీశ్వరుడు ప్రసాదించిన యీ స్వభావమునకై నీవు వగచి లాభము లేదు. కాని

తెలియజేయు చుండుమని దుర్గాప్రసాదుని ప్రార్థించెను. దుర్గాప్రసాదు డానాడైన యచ్చట భుజియింపకయే వెడలిపోయెను. కొన్నాళ్లవరకు నతడాప్రాంతముల యందే సంచరించు చుండెను. అతనిజాడమాత్ర మెవరికిని తెలియుటలేదు.

---

# 19

## గడియారపుదొంగ.

---

ధనవల్లియందు స్వగృహమున సింహాచలము చలపతితో సంభాషించుచుండెను. చలపతి యానాడచ్చటికి వచ్చి యెంతోసేపు కాలేదు. వారిరువురును దుర్గాప్రసాదుని స్థితిగతులను గురించి మాట్లాడుకొనుచుండిరి.

"దుర్గాప్రసాదరావును, రత్నవల్లియు నిప్పటికప్పుడే ప్రాతస్నేహితులయి యున్నారని నాకు తెలియవచ్చినది" అని చలపతి యొకింత చింతామగ్నుడై యున్న సింహాచలముతో ననియెను.

"కేవలము ప్రాత స్నేహితులే కాదు. ప్రాణస్నేహితులని నాకు తెలిసినది. మన మతిమఱపు వలననే వారిరువురకు నంత యన్యోన్యము కుదిరినది." అనిసింహాచలము దిద్దిచెప్పెను.

"ఏమైనను కానిమ్ము. దుర్గాప్రసాదుని పేరుక్రింద గీత, పెట్టినట్లు యున్నదా, లేక యతనిని గురించి స్పష్టమగు వార్త యేదైన నున్నదా?" యని చలపతి కించిత్పరిహాస పూర్వకముగా ప్రశ్నించెను.

సింహాచల మంచములకు బల్లపై చెదరిపోయిన కాగితములను పుస్తకములను తీరికగా సవరించుకొనుచు,

"వారిరువురకును స్నేహమను మాట స్పష్టమే కదా. మనకు పరిస్కృత మాత్రమాత్రము చాలును. దానిచే దుఃఖమునకుచేటు." అనెను.

చలపతి కామాట లర్థము కాలేదు. అతడొక క్షణమాత్ర మాలోచించి చూచి మరల నిట్లనియెను.

"అంతమాత్రము నాకును తెలియును. ఆ యల్పవార్త వలన నేమి రహస్యములు బహిర్గతములు కాగలవు?"

"ముందుగా రత్నవల్లితో మాట్లాడవలెనుదే, వినదగిన వార్త లేవియును వెల్లడికావు. నేనిపుడొకసారి యామెను చూచిరావలయును" అని సింహాచలము నిలువబడి ప్రత్యుత్తరమిచ్చెను.

"రత్నవల్లి యీమధ్య రాజపురమున నుండుట లేదని వినియున్నాను అని చలపతి సింహాచలమును కూర్చుండుమని కోరెను.

"అవునవును. ఆమె వెళ్లను వెళ్లినది. రాను వచ్చినది. ఆమెతో నాకొక యరగంటసేపు పని యున్నది. నేను తిరిగివచ్చు వరకు నీవిచ్చటనే విశ్రమించి

యుండుము. ఈపత్రికను చూచుచుండుము. వ్రేలి ముద్రలను గూర్చి సుప్రసిద్ధుడగు శాస్త్రజ్ఞుడు వ్రాసిన వ్యాసమిందున్నది. అది శ్రద్ధతో జదువదగినది. ఇక పోయివత్తునా?" అని సింహాచలము సత్వరముగ వెడలి పోయెను.

సింహాచలము కేళీకేతనమును ప్రవేశించువేళకు వారిజ ద్వారమునొద్దగా కూర్చుండి బంతి పూవులును తోరణములకై దండలుగా గ్రుచ్చుచుండెను. రత్నవల్లి మేడపై నుండుటచేత తొలుదొలుత వారిజతో మాట్లాడ వలసి వచ్చెను. అదియునుగాక రత్నవల్లి లేకుండచూచి వారిజతో కొన్ని సంగతులు చర్చింప తలయునని సింహాచలము తలచియుండెను. అతని కాయవకాశ మిప్పు డప్రయత్నముగ లభియించినది. దుర్గాప్రసాదునిపైగల యభిమానము కారణముగ రత్నవల్లి యతనిని గురించి యంత నిష్పక్షపాతముగ ప్రసంగింపదని సింహాచలము తలంచెను. రాజశేఖరము హత్యావలన రత్నవల్లికి దుఃఖము లేకపోలేదు. కాని యీసందర్భము నందెట్లో సత్యాసత్యముల విభేదము నెఱుంగజాలక యామె వంచింపబడినది. ఆవిషయమును సింహాచలము పూర్ణముగా గ్రహించెను.

అతడు సమీపించినతోడనే వారిజ లేచి నిలువబడినది.

"దయచేయుడు" అనిమాత్రమని యూరుకొనినది.

సింహా:— దుర్గాప్రసాదగారు గారింటనున్నారా?

వారి:— లేరు. వారితోనేమిపని?

సింహా:— వారితో పనియేమియును లేదు. ముఖ్యముగ నొకసారి వారినిచూడవలెనను కోరికయున్నది.

వారి:— ఆకోరిక సఫలమగుటకు వీలులేని తరుణమున వచ్చితిరని నాకు చింతగానున్నది.

సింహా:— వారినొక పర్యాయము చూచుటకైన శక్యము కాదా?

వారి:- వారీ యూరువిడచి వెడలిపోయి చాలదినము లైనది.

సింహా:— మరల నెన్నడు తిరిగివత్తురు?

వారి:— ఏమో యెన్నడు రానున్నారో?

సింహా:— వెళ్ళిన దేయూరికి?

వారి:— అదియును తెలియదు.

సింహాచలమ్మతనతో నేకాంతముగ దుర్గాప్రసాదుని గూర్చి మాటాడ నెంచియున్నాడని వారిజ గ్రహించినది. సోమనాథ పట్టణమున వివాహమై తిరిగివచ్చినప్పటినుండియు నామెకు ప్రసాదునిపై ననుమానము మఱింత ప్రబలమైనది. అతనిని గుఱించి తనకువలెనె యనుమానముగల వారితో మాటాడవలయునని యామెకును కోరికగలిగినది. అందువలననే యేమియు నెఱుగని

దానివలె కాన్పించుచున్నను సింహాచలము వేయు ప్రశ్నలకు తగిన సమాధానము లిచ్చుచునేయుండెను. ఆసమాధానముల యందామె యేదియును దాచక యున్నదియున్నట్లు చెప్పుచుండెను. సింహాచల మామె సుముఖతను గమనించి తానడుగదలచిన వన్నియు నడుగ నారంభించెను.

సింహా:— దుర్గాప్రసాదుడు నీ యజమానురాలి కొడుకు గదా! ఇంతవరకును రాజశేఖరము హత్యను గుఱించి యే ప్రయత్నములను చేయలేదేమి?

వారి:— ఆ ప్రయత్నములో నాకేమియు భాగము లేదు.

సింహా:— అవును. ఆగోడవ నీకెందుకు? దుర్గాప్రసాదరావు హత్యజరిగిన నాడిచ్చటనే యున్నాడు కాబోలు. అతనికిని హత్యను గురించి బాగుగా తెలిసియే యుండు ననుకొందును.

వారి:— తెలియకేమి. మరునాటి యుదయముననే యందఱకును తెలిసినది. వారిజ కొంతసే పాలోచించి "అవును. నిజమే. ఇపుడు జ్ఞాపకమునకు వచ్చినది. హత్య జరిగిననాటి సాయంకాలము ప్రొద్దుగుంకిన తరువాత దుర్గాప్రసాదు డిచ్చటికి వచ్చియుండెను. ఇదే విధమ్ముగా రత్నవల్లి మేడపైనుండెను. నే నింటిలో నుండి కాలి చప్పుడు విని వచ్చు నప్పటికి ప్రసాదు డదిగో ఆ గడియారమును బల్లపై నిలువబడి యందు

కొని యేదియో సరిచేయుచుండెను. కొన్నాళ్ళనుండి యీ గడియారమునకు వ్యాధి వచ్చినది. ప్రతిదినమును వెనుకబడుటయో, ముందుకు బోవుటయో యగుచుండును. సాధారణముగా పుర్గాప్రసాదుడే దానికి వైద్యము చేయుచుండెను. అప్పటికి 8 గంటలకేరెండు నిముషములో తక్కువగా నుండెను. అంతకన్న చాల ప్రొద్దుపోయినట్లున్నదని నేనంటిని. అందులకతడు నీకు విసుగు పుట్టిన కాలమునకు విసుగు పుట్టునా? ఇంతకు మునుపే కదా ప్రొద్దుగుంకినది. అని ప్రత్యుత్తరమిచ్చెను. అపుడు ఇప్పు డామాటలుకూడ జ్ఞాపకమునకు వచ్చినవి. నిజమే. అతడా నాడిచ్చటనే యుండెను. అనగా సాయంకాలము దాటి నప్పటినుండి."

సింహాచలము తన యాశ్చర్యము నణచుకొని.

"అవును. అతడు సమర్థుడు.— నీవు మేడపైకి పోయి రత్నవల్లితో నేను వచ్చియున్నానని చెప్పి వత్తువా? ఆమెతో రెండు మాటలు మాట్లాడి పోవలెను." అని యడిగెను.

వారిజ పూవులన్నియు నొకమూల ప్రోవుచేసి వెంటనే మెట్లెక్కి పోయెను. రత్నవల్లి 'వచ్చెద' నని కబురంపి నాలుగైదు నిముషములలో క్రిందికి దిగి వచ్చెను.

ఆమె దగ్గరకు వచ్చినతోడనె సింహాచలము జేబు లోనుండి కొన్ని కాగితములను దీసి.

"వీనితో పని ముగిసినది. ఇచ్చి పోవుటకై వచ్చితిని."

రత్న:— ఇంతమాత్రమునకు మీరు స్వయముగ రావలయునా? ఎవరికైన నిచ్చి పంపక పోయితిరా? లేక నన్ను రమ్మని నను నేను వచ్చియుందును.

సింహా:— నేనే వచ్చి యిచ్చిన బాగుండునని తోచినది.

రత్న:— పని ముగిసిన దంటిరే. అందు నేను వినదగిన విషయము లేవైన నున్నవా? లేక యిట్లే యజ్ఞానమున బడియుండ వలసినదేనా?

సింహా:— లేకేమి. ముఖ్యముగా నీకెరుగదగిన విషయము లున్నవి. రాజశేఖరము నీపేర వ్రాసిన యుత్తర మతడు నిజముగా వ్రాసినది కాదు.

రత్న:— మఱి యెవరు వ్రాసిరి.

సింహా:— రాజశేఖరమును మఱియొకరును కలసి వ్రాసినట్లు నాకు తోచినది. సంతక మతనిది కానట్లున్నది. నీపేరు కూడ నతడు పూర్తిగ వ్రాసినట్లు లేదు.

రత్న:— అట్లైన మీరేమని నిర్ణయించు కొంటిరి?

సింహా:— ఆత్మహత్య కాదని నిశ్చయము కుదిరినది. ఇక హంతకునిపట్టుకొనుట యొకటిమిగులయున్నది.

రత్న:— నేనెట్లు వర్తింపవలయును?

సింహా:— ప్రకృతము నీవేమియు చేయ నక్కరలేదు, కొలది దినములలో నీ సహాయము నపేక్షింతును. అంతలో నాకొకసారి దుర్గాప్రసాదరావుగారి దర్శన మిప్పింప వలయును.

రత్న:— ఆయనకే వ్యవహారమున ప్రమేయము లేదను కొందును. ఆతనితో నేమగును?

సింహా:— ఎప్పుట్లో నేపాటున్నదో యెవరు చెప్పగలరు? ఈ విషయమై యిక నెందఱితో మాట్లాడిన నంత మంచిది. అందువలన నేమి నష్టము వచ్చును? నీకేమైన నభ్యంతర మున్నదా?

రత్నవల్లి యంతట నిరుత్తరయై యూరకుండెను. ఆమె కేమి చెప్పుటకును తోచలేదు. అపుడు సింహాచలము లేచి ప్రయాణమగుచుండెను. రత్నవల్లియతని వెంబడి ద్వారము వైపుగా కొంచెము వెనుక వెనుకగా నడచి పోవుచు,

"మరల నెపుడు వచ్చెద" రని ప్రశ్నించెను. సింహాచలము వెనుకకు దిరిగి,

"నిశ్చయముగ చెప్పజాలను. అవకాశమున్న యెడల ముందుగా కబురంపెదను. నీవు మాత్రము మాలస్యముచేయక యొకసారి ధనవల్లికి తక్షణమె వచ్చి పోవలయును" అని వెడలిపోయెను.

రత్నవల్లి యతనిని చూచుచు కొంతవరకట్లే నిలిచి పోయినది. అంతట ప్రక్కనున్న దాసితో,

"వారిజా! దుర్గాప్రసాదు డేమై పోయినట్లు" అని సాభిప్రాయముగా వారిజను [illegible] యని యెను.

వారిజయూ మాటలకు,

"ఏమో నాకు తెలియదు. రాజపుత్ర మంత్రియును వారి రాకకై నిరీక్షించు చున్నట్లున్నది. మీరు క్రిందికి రాక పూర్వము సింహాచలముగారు నదే యడిగి నారు. ఎప్పుడు వత్తురు? ఎక్కడ కేగినారని నేనేమని చెప్పగలను? వారితో నన్నట్లే మీరుగూడ తెలియ దనవలయును. అంతకన్న నేమున్నది" అని దీర్ఘముగా బదులు చెప్పెను.

రత్నవల్లి యంతట మేడ నెక్కినది. సింహాచలము నొద్ద కామె ప్రప్రథమమున తన సోదరుని హత్యానంతరము వెళ్ళినప్పుడు దుర్గాప్రసాదుని గురించి యడిగియుండెను. దుర్గాప్రసాదరావుగారిదర్శనమిప్పింప

మనుటలో పరిహాస మున్నట్లామె గ్రహించెను. అది యంతయు నామె పర్యాలోచించు కొనియెను. కాని దుర్గాప్రసాదు డెక్కడ? అత డూరలేని యీసమయమున నతని దర్శన మొందులకు గావలసి వచ్చినది. అతనికిని హత్యకు నేమి సంబంధము? అని ప్రశ్నించుకొనినది. ఆ ప్రశ్నలకు సమాధాన మిచ్చుకొనుటలో నామె యొకింత భయకంపితు రాలైనది.

ధనవల్లియందు చలపతిసింహాచలమున కై యెదురు చూచు చుండెను. సింహాచల మింటికి వచ్చినతోడనే తనవెంట రాజపురమునుండి కొని తెచ్చినపండ్ల తినుబండములను బల్లపై నుంచి చలపతి నారగింపుమని కోరెను. చలపతియొక పండు నోలుచుచు,

"ఈ చిరుదిండి కేమిగాని రత్నవల్లి వ్యవహారము లెట్లున్నవి? అదియును చంద్రమతితో సంభాషణము వలెనే తుట్టతుదకు నిష్ప్రయోజన మైనదా?" అనియెను.

"ఈసారి మనకే విజయ"మని సింహాచల ముల్లాసముతో ననిచలపతి కెదురుగా కూర్చుండెను.

చల:— అచ్చట దుర్గాప్రసాదుకూడ నున్నాడా?

సింహా:— అతడు లేడుగాని, యచట వారిజయను నొకదాసి యున్నది. అది మనకు వరప్రదాయిని యైనది.

చల:— ఏమి వరమిచ్చినది.

సింహా:— నేనడిగిన రెండుమూడు ప్రశ్నలకు సరసముగ సమాధానము చెప్పినది. ఇంతకు పూర్వము నేనొకసారి యడుగగా రత్నవల్లి హత్యజరిగిన సమయమునకు దుర్గాప్రసాదు డింటనే యున్నాడని చెప్పినది. అంతటనే నూరకుంటిని. కాని నాకు సందేహము కలిగెను. హత్య జరిగిననాడు సాయంకాలము 8 గంటలకు దుర్గా ప్రసాదు వచ్చుట అనగా కేళీ నికేతనమున నుండుట కేమి కారణ మనుకొంటిని. అప్పుడది స్వాభావికముగా తోచినది. దుర్గాప్రసాదునిపై యను మానపడిన తర్వాత మరల నాలోచించితిని. నాకా సందేహ మందువలన బలపడెను. అది యీనాటితో తీరినది. అతడానాడు రాత్రి ప్రొద్దుపోయిన తరువాత గడియారమును దిద్దుచుండగా వారిజ చూచినదట. అప్పటి కెవ్వరికి నేమియు తెలియదు. కనుక నెవ్వరు ననుమాన పడలేదు. యథార్థమగు వార్త నెఱుంగుదువా చలపతీ? అది చాల భయంకరమగువార్త. నీవెన్నడు కలనైనను విశ్వసింప జాలనిది. దుర్గా ప్రసాదుడా నాటి సాయంకాలము రాజశేఖరమును హోటెలు గదిలో సంహరించి మోటారుమీదనో అతివేగ

మున పరుగెత్తుకొనియో కేళీ నికేతనమునకు వచ్చెను. హత్య జరిగినది 8 గంటలని యతనికి తెలియును. అందువలన కేళీనికేతన వాసులను ప్రపంచమును వంచించుటకై గడియారమును వెనుకకు 8 గంటలగునట్లుగా త్రిప్పి వైచెను. అతడు వచ్చిన యే నాలుగైదు క్షణములలో గడియారము ధ్వనితో నెనిమిది గంటలకొట్టి యుండును. ఆ మ్రోతయే రత్నవల్లిని మోసము చేసినది.

చలపతి ప్రతిమవలె నాశ్చర్యమున మగ్నుడై యుండెను.

---

# 20

## రత్నవల్లి మూర్ఛ.

---

రత్నవల్లియును వారిజయును కలసి యత్యంతానురాగముతో నొకరితో నొకరు మాట్లాడుకొనుచుండిరి. వారీవిధముగ మాట్లాడి యెన్నియో దినములైనది. అందువలన నాసంభాషణము వారికత్యంత ప్రియముగా నుండెను. రత్నవల్లి కిప్పుడు వారిజ తక్క నితరులెవ్వరును విశ్వాసపాత్రులు లేరు. ఎప్పుడు దుర్గాప్రసాదుడు వివాహానంతరము వెడలిపోయి మరలరాలేదో, అప్పుడే వారిరువుర హృదయములును మరల నొక్కచో చేరినవి. కేళీనికేతనముయొక్క భావిస్థితినిగూర్చి వారెప్పుడు నదే విధముగ నాలోచించుకొను నలవాటుపడిరి. వారిజ యొకనాడు రాజపుర వీధులకు వెచ్చములకై పోయి యొక వింతవర్తమానమునువినివచ్చెను. ఆవింత వారిజకు మాత్రమే ఆవార్తా శ్రవణముచే రత్నవల్లి మూర్ఛిల్లి నట్లయినది.

వారి:- వల్లీ, మనరామమూర్తి మరల వివాహమాడి నాడట వింటివా?

రత్న:— అతనికి వివాహమా? ఈజన్మమున లేదు. నాకు తెలియక యెట్లు జరుగగలదు.- ఆ- వివాహమే.

వారి:— పరిహాసముకాదు. యథార్థముగా జరిగినదట.
రత్న:- నీకెట్లు తెలిసినది!
వారి:— వీధీ వీధులలో చెప్పుకొనుచున్నారు.

రత్నవల్లి యంత కొంతతడవు మౌనము వహించి యుండెను. ఆయల్ప కాలములో నామె చాల దూరము విచారించినది. ఆమె మరల తనతో మాటాడకపూర్వమే వారిజ,

"పత్రికలలో గూడ నచ్చుపడినదని చెప్పుకొనుచున్నారు. కొందఱు చదువువారును, వినువారును నడిబజారు మంటపముపై కూర్చుండి యున్నారు." అని మెల్లగాననెను.

అంతరత్నవల్లి సేవకుని బంపి యొక తెనుగు పత్రికను తెప్పించెను. అందు 'శుభకార్యములు' అను వార్తాభాగమున నిట్లుండెను.

"వేలూరిసంస్థాన పరిపాలకులగు రామేశ్వరశర్మ తనయయగు ప్రమీలాదేవికిని రాజపురవాస్తవ్యులును విద్యాధన సంపన్నులునగు రామమూర్తిగారికి నిన్నటి దినమున వివాహమతి వైభవముతో నారంభమైనది. సంస్థానమునందలి ప్రజలందఱు నుత్సాహ పూరితులై యున్నారు."

రత్నవల్లికి మూర్ఛవచ్చినది. తెల్వితెచ్చుకొనిన తరువాత నంతయు తన్ను భయపెట్టుటకై రామ

మూర్తి యట్లొనరించెనేమో యనుకొనినది. రత్నవల్లి యేల మూర్ఛిల్లినది? ఆమె రామమూర్తి వివాహవార్త వినిన తోడనే యుత్తరములు ఛాయాపటముల మాట జ్ఞప్తికి వచ్చినది. అంతటనవి దాచియుంచిన పెట్టెయొక్క తాళము చెవుల మాట జ్ఞాపకమునకు వచ్చెను. ఆపై దుర్గాప్రసాదునిమాట, అంతట నతనిప్రయాణమునకును రామమూర్తి వివాహమునకును సంబంధము రత్నవల్లి మనస్సున నకస్మాత్తుగ సాక్షాత్కరించెను. అందువలన నామె మూర్ఛిల్లినది.

రత్నవల్లి కీవృత్తాంతము విన్నందువలన గలిగిన పరితాపము తగ్గిపోవక పూర్వము పోస్టుబంట్రోతొక యుత్తరమును గొని తెచ్చియిచ్చెను. రత్నవల్లి యా యుత్తరమును చింపి యిట్లు చదువుకొనినది.

"రూపజీవ శిరోమణియగు రత్నవల్లికి—

మా సంస్థానాధీశ్వరులగు రామేశ్వరశర్మగారి యేకపుత్రికయగు ప్రమీలాదేవి వివాహసందర్భమున మాకొక భోగముమేళము కావలసి వచ్చినది. అన్ని విధములను జాణవగు నీతో సంప్రదింపుమని పలువురు నాతో చెప్పియుండిన కారణమున నీకీయుత్తరమును వ్రాయుచున్నాను. తగువారిని, గానాభినయముల యందాఱితేఱిన వారిని వెంటబెట్టుకొని త్వరలో బయలుదేఱి రావలయును. బహుమానము నీకంగీకార

నిచ్చినది. దానికి జవాబు రాలేదు. సోమనాధ పట్టణము నందలి యాచార్యుడును సమాజమునుకూడ మాయా కల్పితములే యని యామె తలెంచెను. కాని యామె భావోద్వేగము దుర్భరమయి పోవుచుండెను. ఎంత యణచుకొన్నను కూడ శాంతింపకుండెను.

సింహాచలము దుర్గాప్రసాదునిగూర్చి మాట్లా- సందర్భమున తనంతో తన దాసితో నన్నిసారులేల ప్రశ్నించి యుండెను. తన సోదరుని మరణమునకూడ నీపాపాత్మునకేమి సంబంధ మున్నది. ఆమె గుండె లంతయు జలదరించెను. ఆమెకీ సమయమున నొకటి పిచ్చి యూహ యైనను కడు సహజముగా కాన్పించుచుండెను. అందువలన దుర్గాప్రసాదుడే తన సోదరుని హఠాన్మరణమునకు కారణమని యామె యున్మాదమున భావించెను. కాని యాసందర్భమున ముఖ్యమగు సంశయము లెవ్వియును దెలియవు. అంతట తనసోదరుని జీవితచర్యయు, నతనితో తన సహవాసమును జ్ఞాపకము చేసికొని ముక్తకంఠముతో విలపించినది. వారిజయు తన సాంత్వనాలాపములను మాని యామెతో కలసి రోదింపదొడంగెను. కేళీ నికేతనమంతయు నంధకారమయమయ్యెను.

రత్నవల్లి మనస్సున దుఃఖమంతరించిన తరువాత క్రోధజ్వాలలు మెల్ల మెల్లగ నంకురింప దొడగెను. రత్నవల్లి కిక ప్రేమలేదు. అంతయు క్రోధమే.

# 21

## ఇరవదేహంతకుడు

సింహాచలమునకు దుర్గాప్రసాదునిపై యను
మానము ప్రబలమైనది. రత్నవల్లి యింటిలోని గడియా
రము దిద్దిన సంగతి తెలిసినప్పటినుండియు నంతయు
నిశ్చయమైనట్లు కాన్పించినది. కాని యతనిని పట్టు
కొనుట కావలాత్రము చాలినది కాదు. హత్యావిష
యమున దుర్గాప్రసాదుని సంబంధము ప్రస్ఫుటము
కాలేదు. నిశ్చయముగ నిర్ణయింపబడినచో నీగడి
యారపు దొంగతనము నిందారోపణమునకు మంచి
యాధారము కావచ్చును. ఆసర్ణయము కుదురనంత
వరకును, త్వరపడి లాభములేదని సింహాచలమను
కొనెను. అతడన్నమును సంపూర్ణముగ విషయనిర్ణయ
మొనర్పక కార్యమునకు దిగని వాడగుటచే నింకను
సునిశ్చితమగు సాక్ష్యమునకై వేచియుండెను. అతని
కేమాత్రమైనను హత్యా సందర్భములు తెలియవచ్చుట
దైవసంకల్పము. హత్యాపరిశోధనమునకై యతనికి
సులభసాధ్యమగు మార్గమేదియును గోచరించుటలేదు.
తానుస్వయముగా నాలోచించినవి కాక, యేయితర
విషయములో యతని పరిశోధనమునకు మార్గదర్శక
ములగుచుండెను. అతని రహస్య విజ్ఞాన బిరుదమేవిధము

గను సార్థకము కాకుండెను. అనుగుణునకు హంతకుని యసమాన సాహసమును, వర్ణనాతీతమగు కార్యదక్షత యును గోచరమగుచుండెను. ఎంత విచారించినను సింహాచలమునకుపాయము తోచకుండెను. అందువలన నతడు తన స్వబుద్ధిని దైవమునకు పరతంత్రముగా నొనర్చి యూరకుండెను. దుర్గాప్రసాదుని గూర్చి యెన్ని విచారణలు సల్పినను కూడ నెవ్వరును హత్యావిషయమున నతనికి సంబంధము కల్పింప జాలకుండిరి. మీదు మిక్కిలి యతడు తన దుష్ప్రవర్తన మంతయును వదలి పెట్టి సన్మార్గమున సంచరించుచున్నాడని కూడ ననేకులు విశ్వసించుచుండిరి. నిజమునకు దుర్గాప్రసాదుడే హంతకుడై యున్న యెడల నిరుగు పొరుగు వారి యందింతటి విశ్వాసమును కల్పించిన యతనిబుద్ధిప్రభావ మేమని పొగడవచ్చును? అని సింహాచలము మాటి మాటికి నాశ్చర్యము నొందెను. ఆయాశ్చర్యమువలన నతని దీక్షయు ప్రబలమగుచుండెను. ఆదీక్ష నూతనోపాయములను పన్నుటయందుగాని, పరిచిత మార్గముల యందు సంచరించుటకు గాని వినియోగపడుట లేదు. ఆవశ్యకమైనను కాకున్నను కూడ ప్రతివిషయమును విమర్శించి పరిశీలించుచు గగన కుసుమములను నిర్మించుట యందే వినియోగపడుచుండెను. ఏ యాగంతుక విధానము వలననైన నొకముఖ్యాంశము వెల్లడియగునని యత

డాశ పెట్టుకొని యుండెను. కాని యాయాశ ఫలించుటకు క్షమ తప్ప సాధనాంతరము లేకుండెను. ఒకవేళ సింహాచలము హంతకుని యన్వేషించి పట్టుకొనినను దురదృష్టమువలన హంతకుడు లభించె ననవలయునుగాని సింహాచలము ప్రజ్ఞా విశేషము వలన కాదనవలసినదేనా? యని యతడు పలుమారు వితర్కించుకొను చుండెను.

సత్యవాడలో నున్న తన మిత్రవర్గ మాహ్వానింపగా నొకనాడు సింహాచలము ధనపల్లినుండి ప్రయాణమై పోయెను. అతడును మిత్రులును కలిసి సత్యవాడ పరిసరము లందున్న యొక యుద్యానము నందాహార విహారము లొనర్చుటకై పయనమై ట్రాము బండి నెక్కి పోవుచుండిరి. అది మధ్యాహ్నము. వీధులందలి జనులందఱును తమతమ కార్యములయందాసక్తులై గుంపులు గుంపులుగా నేగుచుండిరి. శకట ధ్వానములతోడను జనాలాప ధ్వనులతోడను నంతయు కల్లోలముగనుండెను. నడివీధులన్నియు దాటి పట్టణాంత ప్రదేశమున నొక సరోవరము సమీపముగా ట్రాముబండి పరువెత్తుచుండెను. ఇక నాలుగైదు నిముషములలో వారందఱు దిగవలయుచోటు రానుండుటచే నందరును లేచి నిలువబడిరి. సింహాచలముకూడ లేచి నిలచెను. ఆపై నొక క్షణమునకు బండియాగెను. వారందరు నొకరి వెంట నొకరు దిగిపోయిరి. సింహాచలము మాత్రము

దిగి రాలేదు. ఆతఁ డన్యాక్రాంత మనస్కుఁడై నేలపై నేదియో తిలకించుచు నిలువబడి యుండెను. మరల బండి సాగినది. మిత్రులందరును సింహాచలమును పేరు పెట్టి పిలువ సాగిరి. ఆతఁడువిని విననట్లూరక నిలిచియే యుండెను. ట్రాముబండి యంతలో చాల దూరము పోయినది. ఆతని స్నేహితు లందరును నతఁడు తప్పక బండి కదలిన తరువాతనైన దిగివచ్చునని యనుకొనిరి. వచ్చిన పనిని పూర్తిగా మఱచిపోయి యతఁ డట్లగుట వారికి కొంత యాశ్చర్యమును కలిగించినది.

సింహాచలముకూడ ట్రాముబండి యందొక విచిత్రమును చూచియుండెను. అందువలననే చిత్ర ప్రతిమ వలె నతఁడట్లు జగమంతయు మఱచిపోయి నిశ్చేష్టుఁడై యుండెను. సరస గోష్ఠీ వినోదములతో ప్రొద్దుపుచ్చ దలచుకొనిన యా సాయాహ్నమునంత విరసముగా మార్చుటకతనికి కారణము లేకపోలేదు. తలవనితలంపుగా నతనికి హృదయమంతయు వివశమయ్యెను. ఆసంతోషమున నా యావేశ స్థితి యందతఁడు మైమరచి యుండుటలో నాశ్చర్య మేమియును లేదు.

సింహాచలము బండి దిగుటకై లేచి నిలిచిన వెంటనే యొక యాగంతుకుఁడు కదలుచున్న బండి నెక్కి యొక బల్లపై కూరుచుండెను. అతఁడు వచ్చిన వెంటనే నలుగురు ముప్పురాతని చుట్టుముట్టుకొని యతనితో

సంభాషించు చుండిరి. వారందరకును తీరికగా ప్రత్యు త్తరము లిచ్చుచు నతను జేబునుండి కాల్చు కొనుటకై యొక సిగరెట్టును తీసెను. ఆ తీయుటలో నొక చిన్న కాగితపు ముక్క గాలికి కొట్టుకొనివచ్చి సింహాచలము కట్టెదుట వ్రాలెను. దానిపై నక్షరము లేవియును లేవు. దానిని చూచీ చూడనట్లుగ సింహాచలము పరికించెను. ఆ మాసిన కాగితపు ముక్క యొక్క తెప్పపాటు కాల ములో తిరుగబడినది. ఆ రెండవ ప్రక్క నా కాగి తముపై యక్షరము లున్నవి. అవియు నెన్నియో లేవు. " Room No 20 "అని మాత్రము దానిపై వ్రాయబడి యుండెను.

20 వ నవంబరు గది! ఆ కాగితపు ముక్కకు గూడ తెలివి తేట లున్నట్లున్నది. ఆనాడు రాజశేఖరము చేతినుండి యెగిరివచ్చి యతనికి ద్రోహముసేయ నెంచిన దుర్గాప్రసాదుని మొఖలో బడినది. ఇన్నాళ్ల నుండియు దుర్గాప్రసాదుని జేబునందెచ్చట దాగియుండెనో, మరల నీనాటి కతని యొద్దనుండి యెగిరివచ్చి సింహాచలము కంట బడినది. 20 వ నంబరు గదియే వచ్చి తన యందు చిరకాలము నివసించియున్న రాజశేఖరము నిమిత్తమై శరణుజొచ్చి నట్లుండెను. సింహాచలమే శరణాగత రక్ష కుడని దాని కెట్లు తెలిసినది? అందఱిలో నతని మోలనే యేల వ్రాలినది? దారితప్పి సంచరించుచున్న సింహా

చలము భావమునకు తానెట్లు సకాలమునవచ్చి, సరియగు మార్గము చూప గలిగినది?

సింహాచల మాయక్షర ములను చూచిన వెంటనే పులకితు డయ్యెను. చిందర వందరగానున్న యతని యాలోచన లన్నియు నొక్కమారుగ నిర్మలము లయ్యెను. అత డికపై వెనుకటివలె నంధకారమున ప్రాకులాడ నక్కరలేదు. ఒక్కసారి తన వెనుకకు దిరిగి చూచెను. ఎప్పటివలెనే దుర్గాప్రసాదుడు తన స్నేహి తులకు ప్రత్యుత్తరము లిచ్చుచునే యుండెను. సింహా చల మతనివైపున జెప్పవాల్పక చూచెను. ఆ వీక్ష ణాగ్నిచే తప్పుడై నట్లకస్మాత్తుగా దుర్గా ప్రసాదుడును తలయెత్తి చూచెను. వారిరువురును రెండు నిమిషము లొకరివంక నొకరు చూచుకొనిరి. ఒకరి నొకరు పోల్చుకొనిరి. ఒకరి యాలోచనల నొకరు చదువుకొనిరి. ఎవరి ప్రయత్నములు వారొనర్చుకొన నారంభించిరి.

దుర్గాప్రసాదుడు మరల తలయెత్తి.

"తమ నామధేయము, సింహాచలముగారేనా? ఎచ్చటనో చూచినట్లున్నది" యనియొకింత మందహాస ముతో ననియెను.

"నేనును, మిమ్ముల నెరుంగుదును. తమనామ ధేయము దుర్గాప్రసాద రావుగారు. అంతేనా?" యని

సింహాచలము బదులుచెప్పెను. ఆబాడీలో ప్రయాణ మొనర్చు చున్న మరియొకరు,

"క్రొత్త స్నేహాలకన్న పాతస్నేహాలే దొక ప్పుడు చిత్రముగానుండును" అనియెను. ఆమాట కచ్చటనున్న వారందఱు నొకింత నవ్విరి.

అంతట కొంతసేపటివరకు నెవ్వరును మాట్లాడ లేదు. ట్రాముబాడీ మంచి వేగముగ పరుగెత్తుచుండెను. ఉన్నట్లుండి హఠాత్తుగా దుర్గాప్రసాదుడు బండి దిగి పోయెను. ఆయుత్తరక్షణమె సింహాచలము దిగి యతనిని కలసికొనెను.

"మీకుగూడ నిచ్చటనే పనియున్నదా?" యని హేళనముగా దుర్గాప్రసాదుడు సింహాచలము నెగా దిగ చూచుచు ననియెను.

"ఔను. ఇచ్చటనే యొకరితో పనియున్నది" అనిసింహాచలమును మఱింత పరిహాసముగా ప్రత్యుత్త రమిచ్చెను.

ఆప్రదేశమున నివాసగృహము లేవియును లేవు. సత్యవాడ పట్టణములో నొకభాగమై కొంచెముదూరము గానున్న వసంతపేటకు పోవుమార్గమున వారునడచి పోవుచుండిరి. పోయినకొలదియు జనసంచారము సన్న మగుచుండెను. ఎంతదూరము నడచినను వారియువురిమధ్య నొకమాట యైనను నడచుటలేదు. ఇరువురును మౌన

ముగా నడచిపోవుచుండిరి. మఱియొక కొంతదూరమట్లే నడచినతరువాత వారునడచుచున్న బాటచీలి రెండు దిక్కులుగా సాగిపోయెను. అప్పుడు దుర్గా ప్రసాదుడు సింహాచలము నెట్లైన తప్పించుకొనుటకు,

"మీరుసంభాషింప దలచిన వారేదారిని పోయిన యెడల కలసి కొందురు? మీరెటుపోవదలచితిరి.?" అనెను.

"వారపుడే వచ్చియున్నారు. ఏదారియందును వారిని వెదుకనక్కరలేదు." అనిసింహాచలము సాభిప్రాయముగా ప్రత్యుత్తరమిచ్చెను. అంతటదుర్గాప్రసాదుడు సంశయచకితుడై.

"వారేరీ? మనకన్నులకు గోచరింతురా?" యనెను.

"వీరేవారు" అనిసింహాచలము తన దక్షిణహస్తమును దుర్గాప్రసాదుని వక్షస్థలముపైనుంచెను.

"ఏమి! ఈపరిహాసము! ఈపాటి ప్రసాదమునకై యింత దూరమేల వచ్చితిరి.?" అని జృంభితమగు భ్రూవిక్షేపముతో ప్రసాదుడు ప్రశ్నించెను.

"రాజవీధుల యందు మాట్లాడకూడని రహస్యములను కొన్నితమతో ప్రసంగించుటకై యింతదూరము రావలసివచ్చినది."

"నాకు రహస్యము లితరులతో చెప్పవలవాటు లేదు. ఇతరులుచెప్పిన విను నభ్యాసమును లేదు. సరి పోయినదా?"

"రాజశేఖరమును నీవేల్లచంపితివి?" అనిసింహా చలమడుగగా కోపకంపితుడై దుర్గాప్రసాదుడు,

"ఇతరుల చావునుగురించి నీకింత వివాదమెందు లకు? నీచావు బ్రతుకు సంగతిముందు విచారించు కొనుము." అనిధిక్కరించెను.

అంతట వారిరువురును కొంతకాలము పరుష భాషణములాడుకొని, తుదకు కలియబడి పోరాడ నారంభించిరి. సింహాచలమునకు కొన్నిగాయములు తగి లినవి. దుర్గాప్రసాదుని నొసటనుండి యొకటి రెండు రక్తబిందువులు రాలినవి. మొత్తముమీద సింహాచలము తన ప్రతిపక్షుని బలమునకోర్వలేక పోయెను. పోరాటము ముగిసినతరువాత దుర్గాప్రసాదుడు ముక్తకంఠముతో నిట్లుసంబోధించెను.

"సింహాచలం! నీపై నాకధిక గౌరవమున్నది. నేనేహంతకుడనని నీవుకనుగొనుట నీవుకుశాగ్రబుద్ధివని వెల్లడిసేయుచున్నది. కాని నీవు దుర్గాప్రసాదుని పై కెత్తవలదు. అతనితో కయ్యమునీకు వేయియనర్థములు తెచ్చిపెట్టును. అవును. నేనేహంతకుడను! అయిన నేమి?

# 22

## ప్రేలిముద్రలు.

సింహాచలము చలపతితో నిట్లు చెప్పెను.

నేనా నాడు హఠాత్తుగా దుర్గాప్రసాదుని ట్రాము బండిలో కలసికొనుటయు వసంతపేటకు పోవు మార్గముః నతనితో పోరాడుటయు మాత్రము నీవెఱుగుదువు. తరువాత వృత్తాంతమును చెప్పెదను వినుము.

దుర్గాప్రసాదు డానాడు నేనే హంతకుడనని నాయొద్ద బింకములు పలికెను. అంతకు పూర్వమె యతడు చెప్పకయె నాకావార్త తెలిసినది. కానియందువలన ప్రయోజనమేమి? దుర్గాప్రసాదునకు న్యాయసమ్మతమగు ప్రభుదండన మిప్పింప వలయును. అతడిన్నిసారులు నేనేచంపితి నేనేచంపితి నని చెప్పినను చాలదు. అదియంతయు ఋజువొనర్చు భారము మనపై నున్నది. ఆ కాగితపుముక్క నాయనుమానమును ధ్రువపరుప జాలినదిగాని న్యాయ స్థానములందట్లొనర్ప జాలదు. అందుకై దుర్గాప్రసాదునిపై బహిరంగముగనిందారోపణముజరుగక పూర్వముచేయవలసిన దంతయు కొనసాగింప దలచితిని. అందులకొక యుపాయము నాకు స్ఫురించినది. రాజశేఖరము మరణలేఖపై నున్న ప్రేలిముద్రలు దుర్గాప్రసాదునివే యని మనకు

నిశ్చయ మయినదికదా! అట్లైన మన యనుమానము తుదముట్టుటకు నతని వ్రేలిముద్రలు ప్రత్యక్షముగనే తీసికొనిన యెడల సరిపోవునని యనుకొంటిని. అందు నిమిత్తమై యొక సీసా నిండ సిరా నింపికొని నాయొద్ద భద్రముగానుంచి బయలుదేరితిని.

దుర్గాప్రసాదుని మరల కలసికొనుటయే దుర్లభమైనది. ఈ రెండుమూడు దినములనుండియు నేను చారులను బాపియు స్వయముగ ననేక ప్రదేశముల కేగియు నతనికై యన్వేషించితిని. తుద కాతడొక జూదరి యింటనున్న సంగతి నాకునిన్న సాయంకాలము తెలియ వచ్చినది. దుర్గాప్రసాదు డింతమాత్రమునకె భయపడు పిఱికివాడు కాడు. అతడు మనరక్షకవర్గమునంతయు ధిక్కరించి స్వచ్ఛందముగ సంచరించు చున్నాడు. మొన్నటి దినమున సత్యవాడయందతడాడిన మాటలలో నతడు భీతుడైనట్టి సూచనయైన లేదు. అందువలననే యతడంత గర్వముతో నేనే నేనేయని యంతగా నొక్కి చెప్పి యుండెను అతడింకను. కొన్నాళ్ళవరకు—అనగా నతని యపరాధము న్యాయస్థానమున సక్రమముగా ఋజువగునని తెలియు నంతవరకు— నిట్లే స్వతంత్రించి తిరుగుచుండు ననుటలో సందేహము లేదు. అందువలననే నేనతనిని సత్వరముగ రక్షకభటుల వశమొనర్చుటకై యాతురపడలేదు. నేననుకొనునట్లే యతడు

కడుజాగరూకతతో మంచినేర్పుతో బహిరంగముగ సంచరించు చుండెనని తెలిసినది. తుదకతని సహవాసి యగునాజూదరి యింటినిగూడ కనుగొనగలిగితిని. సాయంకాలము సందె చీకటు లింకను రాకమునుపే యతనినికలసికొంటిని.

నన్నతడు చూచినతోడనే.

"అయ్యా తమరిక నాతో పరిచయమును మానుకొన వలసిన సమయము వచ్చినది. ఇన్నిసారులు నాకంటబడిన నెన్నటికిని శుభము కానేరదు నా యర్థమును గ్రహించితిరా "యని ధౌర్త్యముతో నా యొద్దకువచ్చెను. ఆధౌర్త్యమే నాకు లాభకారి యైనది. కొంచెము నిదానించి,

"తమ బల పరాక్రమములు నేనెఱుగక యిచ్చటికి రాలేదు. అన్నియు నేనెరిగియే వచ్చితిని. మీరు శాంతింప వచ్చు "నంటిని.

అంతట నతడు పరుషభాషణములాడుచు నాచెంతకువచ్చికొట్టుటకుసన్నద్ధుడైయున్న వానివలెచేయెత్తెను. అంతటనేను భయము నభినయించి నాజేబుననున్నసిరాబుడ్డిని రెండుచేతులతోడను గట్టిగా పట్టుకొని వెనుకకు తగ్గితిని. అదేదియో యమూల్యవస్తువని యతడు భ్రమించినాయొద్దనుండి లాగుకొని పోవ యత్నించెను. నేనాప్రయత్నములను నిరోధించితిని. అంతట మాయిరు

పురకును తుములముగ ద్వంద్వయుద్ధము జరిగినది. నా జేబులోని సిరాబుడ్డియంతయు నులికిపోయినది. దుర్గాప్రసాదుని చేతులు రెండును దానితో నల్లబడినవి. మఱింత కోపపూరితుడై యతడు నన్ను తనముష్టిఘాతములచే నొప్పించెను. ఆ తాడన మంతయు వరప్రసాదముగా నై కొని తుద కతడు రెండుచేతులతో వెలుపలికి త్రోసి నను మాఱుపలుకక కడచినరాత్రి యిల్లుచేరితిని. నాయొడలి యందింకను నొప్పులు తీరలేదు. కాని నామనస్సునదంలి శల్యముమాత్రము జారిపోయినది."

అని చెంతనున్న పెట్టెలోనుండి యొకచొక్కా బైటికి తీసెను. అది చాల సన్నమగు నులిపిరి గుడ్డతో కుట్టబడి యుండెను. దాని యందన్ని వైపులను విస్పష్టముగా కొన్ని భాగముల యందును కడు నస్పష్టముగా కొన్ని భాగముల యందును దుర్గాప్రసాదుని వ్రేలి ముద్రలు కాన్పించు చుండెను. ఆ నల్లని కరస్పర్శాస్థలము లన్నియు చూచి చలపతి "అతని చేతిపోటుల కెంత బాధపడి యుందువో" యని పరిహాస పూర్వకముగ ననియెను. సింహాచల మంతట రాజశేఖరము వ్రాసిన మరణలేఖను తెచ్చి దానిపైనున్న ముద్రలను చూపి యీ రెంటియందుగల పోలికలను వర్ణింప దొడగెను, దుర్గాప్రసాదుని వేళ్లపై నున్న ప్రతిరేఖయు నతడు విమర్శించిచూపించెను. తుదకొక చోట మరణలేఖయందు

వలెనె, ప్రేళ్లముడుచుకొనుభాగమున ఖాళీగానున్న కొన్ని ప్రేలిముద్రలు గోచరించెను. అతిసంభ్రమమున వాని నన్నిటిని చూపుచు "చూచితివా, యతడెట్లు తన దండనమునకు సాక్ష్యము తానె వ్రాసికొని యున్నాడో" యని సింహాచలము పలికెను. అతడిక నాలస్య మొనర్పక వెంకటస్వామితో సంప్రదించి దుర్గాప్రసాదుని ఖైదీ కొనర్ప నిశ్చయించుకొనియెను.

దుర్గాప్రసాదున కావార్త తెలియ వచ్చినది. అతని స్నేహితు లతనిని దేశాంతరమున శీఘ్రముగ వెడలి పొమ్మని హితబోధ చేసిరి. కాని యతడు వారి హితమును లక్ష్యపెట్టలేదు. అంత మోసము వచ్చిన చూచుకొన వచ్చునని యతడు తలచెను. అతని కపాయమనిన నధికప్రేమ. అంతగా సింహాచలము ప్రభుత్వపు సహాయమున సిబ్బందితో తనను బంధించుటకై వచ్చిన యెడల, తప్పించుకొనలేక పోవుదునా యని యతడాత్మస్తుతి పరాయణుడై భావించుచుండెను. అందఱి ముందర తన సాహసమును తన తంత్రవిద్యా నైపుణ్యమును ప్రకటింప నెంచెను. అందలి సాధకబాధకముల నతడు గమనింపక యట్లొనర్పలేదు. కేవల కీర్తి కాంక్షచే నట్లొనరించెను. అతడును యశఃకామియే.

దుర్గాప్రసాదునకీ తరుణమున తాకాంక్షించిన కీర్తి లభించునా? సింహాచల మతనిచే మరల వంచితుడగునా?

# 23

## వంట బ్రాహ్మణుడు.

---

సత్యవాడ పోలీసు స్టేషను నందొకనాడు సింహాచలమును వేంకటస్వామియు మాటలాడు కొనచుండిరి.

"అప్పుడే మీతో నంటిని. నా మాటలయందు మీరు లక్ష్యముంచలేదు. అతనిని స్వయముగా నెరిగిన వారొకరు వెంటనుండుట యావశ్యకము" అని వెంకటస్వామి నిరుత్సాహముగా పలికెను.

"నీ వెంట వచ్చిన రక్షక భటులలో నొకడాతని గురుతు పట్టగలనని చెప్పియుండుటచే నేను పొరబాటు రాదనుకొంటిని." అని సింహాచలము ప్రత్యుత్తరమిచ్చి అయినను మించిపోలేదు లెమ్మనియెను.

"మించిపోకేమి? నేడో రేపో మన మాతని చేతులకు సంకెలలు వేయకున్న మన పరువు దక్కదు. ఒకటి రెండుసారులు గాని చిరకాల మతడిట్లు బట్టబయలుగ నూరివెంట దిరుగుచుండునా?" యని వెంకటస్వామి తీవ్రముగా హెచ్చరించెను.

ఈ సంభాషణము నందలి సారాంశము దుర్గాప్రసాదునిపై అరెస్టు వారంటు సేకరించుకొని సింహాచలమును వెంకటస్వామియు నతని కారాబద్ధునిచేయ నిశ్చయించుకొనిరి. మొట్టమొదట వారిరువురును కలసి

యాపని నిర్వహింపనెంచిరి. ఎందుకనగా, వెంకటస్వామి దుర్గాప్రసాదు నెన్నడును చూచిన జ్ఞాపకములేదు. అందువలన నంతయు త్వరలో సులభముగ ముగియుటకై సింహాచలమును గూడ వెంటరమ్మని కోరెను. అందుల కతడు సమ్మతింపలేదు. తన పనియంతయు ముగిసినదనియు వెంకటస్వామియొక వెళ్లిన బాగుండుననియు నతడు వాదించెను. ఆమాటలు వినక వెంకటస్వామి బలవంత పెట్టెను. అంతలో స్టేషను నందున్న రక్షకభటు డొకడు తానుదుర్గాప్రసాదు నవలీలగ గుఱ్తు పట్టగలనని విన్నవించెను. అంతట నేమియు ననజాలక స్వామితానే స్వయముగ నేగ నిశ్చయించుకొనియెను.

నలుగురను వెంటబెట్టుకొని వెంకటస్వామి బయలుదేరెను. వీధి వీధి యందును ముఖ్యభాగము లందడిగి చూచెను. ఎవరిని ప్రశ్నించినను చూచితి మని చెప్పువారేకాని, దుర్గాప్రసాదు డావేళ కెచ్చట నున్నదియు నిర్ణయింపలేకుండిరి. అతడు నిరంతము నొక చోటనుండి యింకొకచోటికి తిరుగుచు, నెవ్వ రికిని వశ్యుడుగాకుండెను. దినదిన మంతయు విసిగి వేసరి యన్వేషింపగా నొక న్యాయవాది యింట నతడు బహుశః ఉండి యుండవచ్చునని తెలియవ చ్చెను. ఆవార్త నాలించి, యందరును న్యాయవాది

గృహము వైపునకు పయనమై యచ్చటికేగిరి. వాకిటి యరుగుమీద, నొక చిన్న యంగవస్త్రమును ధరించి, శరీరముపై యజ్ఞోపవీతము తప్ప మరేదియును లేక యొక నడిమి వయసు బ్రాహ్మణుడు కూర్చుండి యుండెను. వెంకటస్వామి యతనిని సమీపించి.

"ప్లీడరుగారింటియొద్ద నున్నారా?" యని ప్రశ్నించెను.

"భోజనము సేయుచున్నా"రని యా బ్రాహ్మణుడు జబాబిచ్చెను.

"తమ రెవరు"

"నేను వంటబ్రాహ్మణుడను. వంట నంతయు సిద్ధముచేసి వచ్చితిని. ఈదినమున వారిభార్యయే వడ్డించుచున్నారు. లోనికి దయచేయుడు. పనియుండి వచ్చినట్లున్నారు. ప్లీడరుగారు త్వరలోనే రాగలరు" అని వారందఱను లోనికి తోడ్కొనిపోయి యుచితాసనములపై కూర్చుండబెట్టెను. అంతట నా బ్రాహ్మణుడు బైటికివచ్చి, మెల్లగ వాకిలి తలుపురెక్కలను మూసి, వీధివైపుగా గొళ్ళెముపెట్టి, కిటికీగుండా తొంగిచూచి పట్టజాలని నవ్వుతో,

"వెంకటస్వామిగారు! నేనే దుర్గాప్రసాదరావును. ఇక పోయివచ్చెదను" అని యొక్క పరుగు తీసెను. అంతలో 'నేనెరుగుదు' నని బింకములు పలి

కిన రక్షక భటుడు 'అతడే' 'అతడే' నని వెఱ్ఱికేకలు వైచెను. వెంకటస్వామి నిర్విణ్ణుడయ్యెను. లోపలి వారిని విచారించి చూడగా నాగృహమున న్యాయవాది యెవ్వరును లేరని తెలియవచ్చెను. దారిలో కొందరను నియమించి, దుర్గాప్రసాదుడే వారిని త్రోవతప్పించెను. వేంకటస్వామి తన గౌరవ భంగమునకు చాల ఖేదపడి, యారక్షక భటునిపై తన కోపాగ్ని నంతయు రాల్చెను. ఒక పావుగంటకుగాని బైటివాకిలి తెరువబడలేదు. అంత నానాటి కన్వేషణముమాని ప్రేమను నకు తిరిగివచ్చిరి. అచ్చట సింహాచల మదివరకే వచ్చి వేచియుండెను.

మరునాడు తానుకూడ వెంటవచ్చెదనని సింహాచలము చెప్పిపోయెను. ఆనాటిరాత్రియంతయు దుర్గాప్రసాదుని గురించి విచారముచేసెను. మరునాటియుదయమున నతడు తప్పక చిక్కునని నమ్మి నిదురించెను.

# 24

## ప లా య న ము.

---

మరునా డనుకొనినట్లు సింహాచలమును వెంకట స్వామియు పదుగురు రక్షకభటులును కలసి దుర్గా ప్రసాదాన్ని పట్టుకొనుటకై బయలుదేరిరి. అత డతిసా హస వంతుడగుటచే వారందరును, తుపాకులను కత్తు లను గైకొని పోయిరి. అప్పటికి సూర్యోదయమై యెం తసేపో కాలేదు. దుర్గాప్రసాదు డానాడుస్వగృహము ననే యున్నసంగతి తెలియవచ్చుటచే నచ్చటకేగిరి.

దుర్గాప్రసాదుని యిల్లు తండ్రి తాతలనా డెన్నడో కట్టినది. అందువలన చాలవరకు శిథిలావస్థ యందుండెను. పైభాగ మంతయు జీర్ణమైపోయినం దున పెంకులకు బదులు పూరి నేయబడియుండెను. ఆమందిరపు ప్రాకారపుగోడ మాత్రము పూర్తిగా పడి పోలేదు. చాల నున్నతముగ నిర్మింపబడి యుండు టచే వెలుపలినుండి చూచువారికి, ప్రాకార కుడ్య ములు గంభీరముగనుండి, వానివెనుక నేదోరమణీయ మగు సౌధమున్నట్లు భ్రమగొల్పును. కాని యాలో పల నొక చిన్న పూరియిల్లు తప్ప మరేదియును లేదు. సింహాచలమా ప్రాకార ద్వారమును తట్టెను.

దుర్గాప్రసాదు డింకను నిద్రించుచుండెను. కడచిన రాత్రి యతనికి జ్వరము తగిలినది. అతడా బాధచే రాత్రియంతయు కూర్కు లేక మేలుకొనియుండి, వేకువఝామునుండి గాఢ నిద్రాపరవశుడయ్యెను. అతని భార్యయు తల్లియును లేచి పనిచేసుకొనుచుండిరి, తలుపు చప్పుడు వినినతోడనే వారతనిని నిద్దురలేపి తనకై యెవరో వచ్చియుండిరని చెప్పిరి.

అనుక్షణమును దుర్గాప్రసాదుడు తనయాపదను లక్ష్యమునందుంచుకొని యుండెను. వచ్చినవారు తప్పక సింహాచల ప్రభృతులే యైయుందురని యతడు తలంచెను. అనుమానము తీర్చుకొనుటకై శయ్యనుండి లేచి శీఘ్రగమనముతో ప్రాకారము నొద్దకేగి, దాని నధిరోహించి వెలుపలనున్న వారి నొక్కమారు గాంచి దిగివచ్చెను. బోనులోని మృగమువలె కర్తవ్యతా మూఢుడై యటునిటు తిరుగ నారంభించెను. వాకిలియొద్ద ధ్వని యంతకంత కధికమగుచుండెను. ఆలసించిన లాభము లేదు.

దుర్గాప్రసాదుని భార్యయు తల్లియు కంట తడిపెట్టుకొనిరి. ప్రసాదుడు వారి నూరడించి ధైర్యము తెచ్చికొని, సింహాచలమును సందర్శించుటకు సన్నద్ధుడయ్యెను. తల్లిని భార్యను చెంతకు బిలచి, యిట్లని యెను.

"మీరు భయపడవలదు. నే నీదినము చాలా దూరము ప్రయాణ మొనర్పవలయు నట్లగపడుచున్నది. మరల త్వరలో తిరిగి వచ్చుటయు సంశయాస్పదమె. నేనే దేశమందున్నను, మీకన్ని సౌకర్యములును జరుగునట్లు ప్రయత్నములు చేసితిని. ఇంకను చేయగలను. ఇప్పుడెక్కుడు సావకాశముగ సంభాషింప తగిన తరుణముకాదు. అదిగో మరల వాకిలియొద్ద ధ్వని యగుచున్నది. 'వచ్చె' నని కేకవేయుడు. వంటయింటిలో నున్న పచ్చికారము నంతయు మూటకట్టి నాకొసంగుడు. నాకదియే కావలసిన దారి బత్తెము మీరిరువురును నావెంటనే వాకిలియొద్దకు రండు నేను చెప్పినట్లు ప్రవర్తింపుడు ఇక పోదము"

దుర్గాప్రసాదునకిట్టి యాపదలు వచ్చుటకిది ప్రథమముకాదు. మహాత్మ్యంభవములగు నిట్టి యాపత్పరంపర లెన్నియో వచ్చినవి. అయినను వచ్చినపుడెల్ల భార్యయును, తల్లియును, కొత్తగా భావించి భయపడుచుందురు. స్త్రీజనమంతకన్న నేమి యొనర్పగలరు? ప్రసాదుడు ముందుగ, నతని వెంట నతనిభార్యయు, ఆమె వెనుక నతనితల్లియును ప్రాకారద్వారమువైపుగా నడచిరి. ఆద్వారమున కొక్కటే పెద్దతలుపు. ఆతలుపు మూలగా నక్కి దుర్గాప్రసాదుడు నిలువబడియెను. పచ్చికారపు మూట నతడు నడుమునకు భద్రముగా కట్టుకొని

యుండెను. అతని కుడివైపుగ నతనిభార్య నిలువబడియెను. అతని తల్లియు నాతట ద్వారమును తెఱచి, తానును వారి ప్రక్కగా నిలువబడియెను. సింహాచలమును వెంకట స్వామియును కలసి లోపలకు వచ్చిరి. వారికి తలుపు ప్రక్కగానున్న స్త్రీ లిరువురు మాత్రమె కంటబడిరి. తరువాత నొక్కరొక్కరే రక్షక భటులు తుపాకులతో నడచి వచ్చుచుండిరి. వారు నాచాటుననున్న ప్రసాదుని చూడలేరు. ఆ ప్రాకార ద్వారమునకును పూరియింటి కిని సుమారేబది గజము లుండుటచే వారందరును తలలు వంచుకొని నడచి పోవుచుండిరి. అందఱును లోనికి ప్రవేశించిన పిదప హఠాత్తుగా తలుపుచాటున నుండి దుమికి వీధిలోనికి పరుగెత్తెను. అతని దురదృష్ట వశో మున నొక రక్షకభటుడు ప్రాకార ద్వారమున కెదురుగా వెలుపలనే దూసిన కత్తితో తన తుపాకిని గడ్డమున కానించి నిలువబడియుండెను. దుర్గా ప్రసాదుడు బైటకు వచ్చినతోడనే యతని నాభటుడు వెంబడించెను. సింహాచలముతోగాని యితరు లతోగాని యావిషయమును చెప్పుట కతనికి తగిన యవకాశము లేకుండెను. ఎందుకనగా ప్రసాదు డప్పుడె విద్యుల్లతవలె పరువులెత్తి పోవు చుండెను. ఆత డొక్క కేక వైచెను. ఆ శబ్దము నాక ర్ణించి సింహాచలమును తదితరులును తటాలున వెనుకకు

తిరిగి చూచిరి. దుర్గాప్రసాదుడు ముందుగను రక్షక భటుడు వెనుకగా నప్పటికే చాలదూరమున పరువులెత్తు చుండిరి. వారిలో కొందఱాత వారివెంటబడి పరువు లెత్తిరి. సింహాచల మాశ్చర్య మగ్నుడయ్యెను.

దుర్గా ప్రసాదుడు క్రిక్కిరిసియున్న జనసమూహము మధ్యగా నతి వేగముతో రౌద్రమూర్తియై పోవుచుండెను. అతని వెనుక నురువులు గ్రక్కుచు రక్షక భటుడు తన తుపాకిని గురిపెట్టి యా మహాజన మధ్యమున కాల్చుటకు వెఱచుచు నతివేగముతో పరు వెత్తుకొని పోయెను. వారిరువురకును మధ్య నిరువది గజములకన్న నెక్కువ దూరములేదు. వెనుకనుండి రక్షక భటుడు పట్టుడు కొట్టుడని కేకలు వైచుచుండెను. కాని యాదుర్గాప్రసాదుని మహా భయంకరమూర్తి నవలోకించి యెవరతని కడ్డము నిలువగలరు. ఈ విధమున రాజవీధు లన్నియు దాటి మహా చిత్రగతితో పట్టణ మునుదాటిపోయిరి. ఆ ప్రాంతమున రెండువైపులనున్నత ములగు పర్వత పంక్తులుండెను. అచ్చటి పచ్చికబయళ్ల యందలి పసుల కాపరు లందరును భీతావహులై ఒక్కరు నడ్డము రాక ప్రతిమలవలె చూచుచునిలువబడిరి. వారట్లొకరి వెంట నొకరు పట్టణమునుదాటి యొకమైలు దూరమేగిరి. అంతట జ్వరపీడితుడగు దుర్గా ప్రసాదుని సత్తువయంతయు చచ్చిపోయెను. జ్వరబాధచే నతడు

నిలువెల్ల వణకుచు నేలపైబడెను. అప్పటి కింకను రక్షక భటుడు పదిబారల దూరమున నుండెను. అతడిక రెండు నిముషములలో ప్రసాదుని పట్టుకొనగలడు. ఆయాపత్సమయమున నుపాయ శాలియగు ప్రసాదుడు దీనవదనుడై తన వ్రేలనున్న బంగారపు టుంగరమును చూపి "ఇది నీకిచ్చెదను. నన్ను రక్షింపుమనునట్లుగా" ముఖవికారములచే సంజ్ఞలచేయుచు నారక్షకభటునికి పలుమారు నమస్కరించెను. స్వామికార్య నిర్వహణమున నంతటి కష్టమునకోర్చిన యారక్షకభటుడా సువర్ణాంగుళముచే మోహితుడగునని కాదు. అతడా తొందరలో ప్రసాదుని సంజ్ఞలకర్థము నెరుగక యొక్కక్షణము మాత్రము భూమిపై నున్న దుర్గాప్రసాదుని సమీపమునకేగి నిలువబడెను. ఆక్షణ కాలమున ప్రసాదుడు దారిబత్తెముగా గొని వచ్చిన పచ్చికారమును మితిలేని యలసటచే రొజుచున్న యారక్షకభటునిముఖముపై విసరెను. అతడొక్క పెద్ద యాక్రందన మొనర్చి వెనుకకు కూలిపోయెను. ఆకారము నాసాపుటములయందును కన్నులయందును చిక్కుకొనుటచే నతడు మిక్కుటమగు బాధతో తన్నుకొనుచుండెను. దుర్గాప్రసాదుడంతట నతని చేతినుండి తుపాకి నూడదీసికొని విఱిచి పాఱవైచి చివరనున్న కత్తినిమాత్రము తనయొద్దనుంచుకొనియెను. ఆ రక్షక భటునియొద్ద నొక చిన్నతోలు సంచియందు



పదిరూపాయలు రొక్కముండెను. ఆ యల్ప ధనమును గైకొని దుర్గాప్రసాదుడు ముందుకు సాగిపోయెను. అతఁడా యుదయవేళయందు పట్టణాభిముఖుఁడై తిరిగి రాక యెచ్చటికి బోవుచున్నాఁడు? అతఁడిప్పుడు నడచుచున్న రస్తా హైదరాబాదువరకును తీసికొని పోగలదు.

దుర్గాప్రసాదునకు కాంక్షించిన కీర్తి లభించినది. కాని యతఁడంతటి దూరప్రయాణ మొనర్చునా?



# 25

## రత్నవల్లి సాహసము.

---

ఆనాటి మధ్యాహ్నమునకే రాజపురము నందలి నానావిధములవారును దుర్గాప్రసాదుని యఖండ సాహసమును వర్ణించు చుండిరి. అతడే సత్యవాడ హాస్టెలు నందలి కూనీ యొనర్చెనని సామాన్యుల కందరకును కర్ణాకర్ణిగ తెలియవచ్చె నప్పటినుండియు నతని గతి యేమగునోయని యతని పరిచితులును స్నేహితులును కొంచెము ముఖమెరుక గలవారును అతనిపేరు వినిన వారును గుస గుస లాడుకొను చుండెడివారు. ఆయాతురత యంతయు నానాటికి మఱింత తీవ్రమయ్యెను. అతడు పోలీసువారి సెట్లు వంచించినదియు నేదారిబోయినదియు, నేయాయుధములు ధరించినదియు, సవిస్తారముగా నొకరితో నొకరు చెప్పుకొనుచు, తెలియనవ్వాడితరుల నడుగుచు ప్రొద్దుపుచ్చు చుండిరి.

ఆ కల్లోలము కేశినికేతనమును మాత్రము ప్రవేశింప కుండునా? రత్నవల్లి కంతయు తెలిసినది. చారులను బంపి సింహాచలము నొద్దనుండి వినదగిన దంతయు వినినది. దుర్గాప్రసాదుని మోసము క్రొత్తగా నిప్పుడామె గ్రహించినది కాదు. సోమనాధ

పట్టణమునుండి తిరిగివచ్చిన తరువాత దుర్గాప్రసాదుడు కంటికి గానరాకుండ నెచటికో వెడలిపోయి నప్పటి నుండియు నామె హృదయము దహించుకొని పోవు చుండెను. తన సోదరునివంటి యాప్తు డీజగమంతయు వెదకినను వేఱొకడు కాన్పింపడు. అట్టియాప్తుని ప్రాణ ములు హరించినవానిసి పరిణయ మాడినది. ఆపరిణయము తుదకు స్వప్నప్రాయమైనది. అందువలన తన రహ స్యము లన్నియు బట్టబయలైనవి. తన్నంత నిర్దయతో వంచించిన రామమూర్తి సుఖముగ కాపురము చేయుచున్నాడు. ఆతని మాటలను మన్నించి యీ వంచన కార్యమంతయు నెరవేర్చిన హంతకుడు దుర్గాప్రసాదు డిపుడు పలాయనమయి పోయినాడు. ఆమె హృదయవేదన వర్ణనాతీతమయ్యెను. దుర్గాప్రసా దుని బంధించి తెచ్చి దండించిన బాగుండునను కొన్నది. అతనికి మరణదండన విధించిన దినమే సుదినమని తల పోసినది. కాని యీ సుదినమువచ్చుటెట్లు. అంతయు సిద్ధమైయున్న సమయమున దుర్గాప్రసాదు డంత యవ లీలగ తప్పించుకొని పోవునా? సింహాచల మెన్ని దేశ ములయందో గడించిన ప్రఖ్యాతి యంతయు మంటగలసి పోయినదా?

ప్రసాదుని యెడ గల మహాకోపముచే నామె తాను చచ్చియైన నతని సాధింపవలయునను కొనెను. అంతటి

యనర్థమునకు గారణమైన యాయుత్తరముల వృత్తాంత మును బహిరంగ పరచియైనను తనక్రోధమును తీర్చుకొన దలచెను. కాని యదెట్లగును? ఆయుత్తరముల సందర్భమున ప్రసాదుని వంచన మెంతయున్నదో తన వంచనముకూడ నంతయున్నది. ఆ విషయమున నిరువురును దండ్యులే. దుర్గాప్రసాదున కింతకన్న యగౌరవ మేమున్నది. హంతకుడను నిర్ణయమువలన నతనికి రానున్న దండనముకన్న రత్నవల్లి వంచనకథ కఠినతర శిక్షా కారణ మగునా? అది యునుగాక ప్రసాదుడు తప్పించుకొనిపోయిన సమయమున రత్నవల్లి యట్లొనర్చినచో నామెకుగూడ నేదో యొక దండనము తప్పదు. అందువలన నన్నిటికిని సిద్ధముగ నున్న దుర్గాప్రసాదున కే హానియు రాకుండుట యటుండ, తనకు తానే యపాయము కొని తెచ్చికొనినట్లగును. అందువలన రత్నవల్లి యాయూహ వదలుకొనినది. ఆమాత్రమున దుర్గాప్రసాదునిపై క్రోధము చల్లారలేదు. అత్తడాయుదయమున వెడలిపోయిన మార్గమును రత్నవల్లి విచారించి కనుగొనినది. ఆమార్గమే తనమార్గమని నిర్ణయించుకొనినది. ఈలోకమున ప్రసాదుడు జీవించియున్నంతకాలము నతని నన్వేషించుట తప్ప తనకు కర్తవ్యాంతరము లేదని నిశ్చయించుకొనినది. ఆమె వికటముగ నిట్లు తలపోసినది. "దుర్గాప్రసాదుడు

నన్నగ్నిసాక్షిగ పరిణయ మాడినవాడు. నా ప్రాణనాయకుడు. నావివాహ కర్మ యంతయు నయవంచనమైన నేమి? నేనది యొప్పుకొనను. పతిని విడచి నేను చిరకాల ముండజాలను. నాకంఠమున కురిత్రాడుగా భావించి కట్టిన యీమంగళ సూత్రమును నేనింతమాత్రమునకే త్రెంపి వేయను. అతని పీనుగును కన్నులార చూచికాని నేనది త్రెంపి వేయను."

ఆసాయంకాలమె రత్నవల్లి తన విసీల కేశ రాశిని కత్తిరించి వైచినది. చెవులకు పోగులు వెట్టినది. చక్కని యౌవన పురుష వేషమును ధరించినది. తన చెలికత్తె యగు వారిజతోనైన చెప్పకుండ రాత్రివేళ నేకాకినియై బయలు దేఱినది. దుర్గాప్రసాదుని యడుగు జాడలే యామెకు మార్గదర్శకములు. అచ్చటచ్చటి వారాడుకొను నాతని కథాలాపములే యామెకు సరస సల్లాప గోష్ఠి. రాత్రియనక పగలనక యామె భర్తృ సాన్నిధ్యమునకై కదలి పోవుచుండెను. ఆమె బయలుదేఱిన మరునాడొక గ్రామమున విచారింపగా దుర్గాప్రసాదుని వృత్తాంత మామెకు కొంత తెలిసినది. నిశ్చలమగు మనస్సుతో నామె యాగ్రామమును దాటి పోయినది. తరువాత రెండుమూడు దినములామెకు జాడ తెలియలేదు. అందువలన భీతి నొందక ముందుకు సాగిపోయినది. వారము దినముల కోరుగల్లు చేరినది. దుర్గాప్రసాదుని

ముఖవైఖరి నంతయు చెప్పగా నచ్చటి వారెవ్వరు నెఱుగమనిరి. వారమునినముల మార్గాయాసమూయువతీ హృదయమును కొంచెము చలింప చేసినది. తానవలం బించిన సాహసమును నిందించుకొనినది. తుదకా విచా రము నంతయు సంహరించుకొని మరల నడువనారంభించి నది. ఆయూరి పొలిమేరకు కొంతదూరముగో నైదాఱు గుడిసెలామెకగపడినవి. అందొక ముసలి యవ్వ బైట కూరుచుండి రాట్నము త్రిప్పుచుండెను. ఎన్నిగృహముల యందో ప్రవేశించి, యెందఱనో రత్నవల్లి విచారించి నది. తుదకంతయు నిష్ఫలమైనది. అయిన నామెనిరాశ చెందలేదు.- ప్రాయశః యూరివెలుపలనున్న యీనిరు పేదల కుటుంబములం దెవ్వరైన ప్రసాదు డామార్గమున నేగుటనుచూచి యుందు రేమో యని యూసించినది. ఆ యాశతో నాకుటీరములయొద్ద కేగి రాట్నము త్రిప్పు చున్న ముదుసలిని ప్రశ్నించినది. ప్రసాదుని వైఖరి యంతయు నామెకువర్ణించి చెప్పినది. ఆమెయాశ నిరాశ కాలేదు. దుర్గాప్రసాదుని వంటి వాడొకరు రెండు దినముల క్రిందటనే యామార్గమున తెల్లమచ్చలుగల యొక యశ్వము నెక్కిపోయెనని యాముదుసలిచెప్పెను. ఆయశ్వముకూడ నాయూరిదేయని తెలియవచ్చినందున రత్నవల్లి మరల వెనుకకు దిరిగి యూరిలోని కేగెను.

ఆ గుఱ్ఱపు యజమానుడగు నొకవర్తకునియొద్ద కేగి దుర్గాప్రసాదు డెచ్చటి కేగెనని ప్రశ్నించెను.

వర్త:— దుర్గాప్రసాదు డెవరు?

రత్న:— రెండుదినముల క్రిందట మీయశ్వముపై నెక్కి పోయిన యతడే.

వర్త:— మీపేరేమి?

రత్న:— నాపేరు రామమూర్తి. అతనితో తొందరపని యుండి వచ్చితిని.

వర్త:— అవును మిమ్ములనుగూర్చి యతడు నాతో చెప్పి పోయెను. మీయొద్దనుండి నాపేర పైకము వచ్చునని యతడు చెప్పెనుకాని, మీరేవర్తురని యనలేదే. ఏమిపని యుండి వచ్చిరి?

రత్న:— అదిపరమ రహస్యము. అతనిని నేడో రేపో తప్పక కలసికొన వలయును. లేకున్న నతని కపాయము.

వర్త:— అతడిపుడు హైదరాబాదున కనతి దూరమున నున్న 'మడికొండ' యను గ్రామమున నున్నాడు. అచ్చట 'సీతారాంబాగ్' అను నొకతోట యున్నది. దాని యజమాని నాస్నేహితుడు. ప్రసాదు డతని యింటనున్నాడు.

ఆవర్తమానముతో రత్నవల్లి యానందపరవశురాలయినది. వర్తకుని సెలవుగైగొని యామె సరాసరి వచ్చిన దారినే వెడలిపోయినది.

# 26

## దుర్గాప్రసాదుడు ఖైదీయయ్యెను.

---

సింహాచలము ధనవల్లియందు తనయింటి యావరణమునందు పరిచారము సేయుచుండెను. దుర్గాప్రసాదుని పలాయనము వలన వచ్చిన పరాభవమునుండి యతడింకను తెప్పరిలలేదు. ఆయవమానము జరిగిన పదియవ దినమున నతనికొక తంతివార్త వచ్చినది.

" వలసిన యనుజ్ఞగైకొని, రక్షకభటులతో నాయుధములతో హైదరాబాదునకు తక్షణమె బయలుదేఱుడు. అపరాధి యిచ్చటనున్నాడు. విలంబము విషతుల్యము. స్టేషనువద్ద కలసికొనగలను.

రత్నవల్లి. "

ఆవార్తను చదువుకొని, యన్ని యేర్పాటులతో వెంకటిస్వామిని, ఆతని యనుచరులను తోడ్కొని సింహాచలము వెంటనె ప్రయాణమయ్యెను. బయలుదేఱెనేకాని యతనికిదారిపొడుగునను సందేహము పీడించుచుండెను. కార్యనిర్వహణ మంతయు తన యధీనమందుండక పోవుటచే, మరల నేమి మోసమువచ్చునో యని యతడు భయపడెను. మరునాడుదయ

మున హైదరాబాదు నందురత్నవల్లిని సందర్శించి యామె విచిత్ర వృత్తాంత మంతయు విన్నన తరువాత నతనికి ధైర్యము వచ్చెను. హైదరాబాదు ప్రభుత్వమువారి యనుమతిగైకొని యచ్చటి పోలీసు సిబ్బంది కూడ సహాయముగాగొని మడికొండలో దుర్గాప్రసాదుడున్న గృహమున కేగిరి. ఇంటి యజమానియును, ప్రసాదుడును తోటలో నున్నారని తెలిసినది. అంపువలన నచ్చటి కేగి తోట చుట్టును పోలీసువారిని దూరదూరముగ నిలువ నాజ్ఞాపించి రత్నవల్లియును సింహాచలమును లోని కేగిరి. సింహాచలము కాలిబాటనుబడి ముందుగా నేగుచుండెను. దిక్కులుచూచుచు రత్నవల్లి మెల్లమెల్లగ వెనుకగా నడచుచుండెను. ఆతోటలో నొత్తుగానున్న భాగమున దుర్గాప్రసాదు డొక చెట్టునీడ యందాసీనుడై యుండెను. ఆతడచ్చటనుండి సింహాచలమును పొడగనిన వెంటనే చివాలునలేచి యతివేగముగ పరుగెత్తనారంభించెను. వెనుకగా వచ్చుచున్న రత్నవల్లి యడ్డువడినది. అతడొక క్షణకాలమున నాపురుషాకృతి రత్నవల్లి యని గ్రహించెను. అతని యొడలంతయు నొక్కమారు జలదరించెను. రత్నవల్లి యాడుసింగము వలె నతనినిపైన వైచుకొని నిరోధించుచుండెను. ఆపోరాటములో నామె మంగళసూత్రము తెగి పోయినది. దుర్గాప్రసాదు డంతట నొక ముష్టిఘాత

ముతో నామెను నేలపై బడద్రోసెను. ఆశబ్దమువిని సింహాచలము వెనుకకు పరుగెత్తెను. తోటమాలీలందరును తమ పనులు చాలించి భయభ్రాంతులై నిలువబడిరి. దుర్గాప్రసాదుడప్పుడె తోటయొక్క ప్రాకారపు మధ్యద్వారమును సమీపించెను. అచ్చట వెంకటస్వామి యడ్డుపడియెను. హఠాత్తుగ పైకివచ్చుటచే, రెండుచేతులతో పోగుటతప్ప నేమియు చేయలేక పోయెను. దుర్గాప్రసాదుడు చుట్టుప్రక్కలనున్న సిబ్బందిని చూచి, యిదియే తరుణమని తన బాకును దూసి వెంకటస్వామి కంఠమును బొడిచివైచెను. ఒక్క ఘోరాక్రందనముతో నతడు నిహతుడై రక్తప్రవాహమున కొట్టుకొనుచుండెను. అప్పటికి పది పదునైదుగురొక్కమారుగ ప్రసాదునిపైబడి యతని చేతులకును కాళ్లకును బంధనములువైచిరి. ప్రసాదు డిక లాభము లేదని కదలకుండెను. ఆప్రళయ భయంకరమగు నాపత్సమయమున, నతని ముఖమండలము నందొక వికారపు చిరునవ్వు కాన్పించినది. దుర్గాప్రసాదుడు ఖైదీయయ్యెను.

అతడు సత్యవాదకు వచ్చునని తెలియుటతోనే ప్రజలందఱు నతనిని సందర్శించుటకై గుంపులు గుంపులుగ వచ్చిరి. పురమంతయు నానాడత్యుత్సాహముతో నుండెను. క్రిక్కిరిసియున్న ప్రజలమధ్యగ

నిశ్శస్త్రులను ఆయుధపాణులగు భటులు నడుమనుం
డగా నతడానాను సత్యనాపురమందలి కారాగృహము
నకు గొంపోవబడియెను.



# 27

## రత్నవల్లి మూర్ఛ.

—o—

దుర్గాప్రసాదు డెట్టకేలకు కారాబద్ధుడయ్యెనను వార్త వలన సత్యవాడయందు విపరీతమగు సంచలనము పుట్టెను. ఆనగరవాసులనేకులతనిని సందర్శించిపోవుటకై దిన దినమును కారాగారమునకు వచ్చిపోవుచుండిరి, ప్రజాసంఘమున కంతటి యపకారమునర్చిన దురాత్మునకు తగిన ఫలమనుభవించుచుండెగదాయని వారందరును సంతోషించిరి.

వారందఱికన్న నెక్కువగా నానందింపదగినరత్నవల్లి యేమైనది? మరలవిజయమదోన్మత్తయై కేళీనికేతనమునందలి తనయంతఃపురమున నిలువుటద్దమునకెదురుగ నిలచి తనయపూర్వ రామణీయకమును చూచిపరవశురాలగుచున్నదా? లేదు. తన సాహసమును స్మరించి యుప్పొంగుచున్నదా? లేదు. ఆమెవైద్యశాల యందొక తెల్లనిశయ్యపై బాధపడుచున్నది. దుర్గా ప్రసాదుని కరాఘాతములవలన తగిలిన గాయములింకను మానలేదు. శరీరక్లేశముకన్న నామెకు మనఃక్లేశ మెక్కువమై యుండెను. సౌందర్యరాశియగు తనశరీరాకృతిని మృత్పిండమునకై భావించి తిరస్కరించి వంచించిన ధైర్యశాలిని పురుషాధముని, తానబలయయ్యును సాధించెనన్న యుత్సాహముచే నామెమనస్సు చలించినది. అయినా

వేగముచేనామెకు జ్వరమువచ్చినది. ఆమెకు జన్మమున నిక మనశ్శాంతి యెక్కడ?

వెంకటస్వామి వైద్యశాలకు గొనివచ్చినకొలది గడియలకే ప్రాణములువిడిచెను. దుర్గాప్రసాదుని యాత్మకు రెండు నరహత్యాపాతకములు చుట్టుకొనినవి. ఈరెండవహత్యకై సింహాచలము తన యపరాధ పరిశోధనజ్ఞానమును వినియోగింపనక్కరలేదు.

దుర్గాప్రసాదుడు సత్యవాడయందలి బంధనాగారమునందలి నిగూఢమగు నొకగదియందుంచబడియెను. న్యాయస్థానమున విచారణ జరుగుట కింకను వారముదినములగడువుండెను. అతడు బంధితుడైన మొదటిమూడు దినములవరకును ఖైదీలకు సర్వసామాన్యముగా నొసగునన్నపానాదులను స్పృశించక యుపవాసముండెను. అధికారుల బెదరింపులకతడు భయపడలేదు. అధికారులే యతనికి భయపడిరి. చేరువనున్న యొకభోజనశాలనుండి, యాహారమును తెప్పించి యిచ్చుట కాజ్ఞయయ్యెను. ఆనాటి నుండియు, దుర్గాప్రసాదునకు లోకవృత్తాంతములన్నియు, గాలియు, వెలుతురును కూడప్రవేశింప వీలులేని గదిలోనికి తెలియవచ్చినవి. అతనిస్నేహితులతో నుత్తరప్రత్యుత్తరములునడచినవి. అతడు ఖైదీయయ్యును స్వతంత్రునివలె నేకొరతయునులేక కాలముగడుపుచుండెను. గోధుమ రొట్టెలయందును, తదితర శాకపాకములయందును భద్ర

నతఁడుమరణించు నేమోయని సింహాచలము భయపడెను. వైద్యులతో ప్రసంగింపగా వారట్టి భయము లేదనియు రోగముత్వరలో తిరుగుననియును చెప్పిరి. సింహాచల మామాటలతో నూర్పటజెంది వెడలిపోయెను. కేవల పరిశోధనపరుడగు నతనికి దుర్గాప్రసాదుని మరణదండనము విషయమున నంతగా పట్టుదల లేకుండెను. హత్యాసందర్భముల నన్నిటిని చర్చించి యందలి సత్యాసత్యములు నిర్ణయించుటయందే యతనికి విశేష ప్రీతి. అపరాధదండనము నందంతటి యాసక్తి లేదు. కాని తనమిత్రుడగు వేంకటస్వామి హత్యాస్మరణముచే సింహాచలము దుర్గాప్రసాదునియెడల నత్యంతక్రోధము వహించెను. అతనిమరణదండనము సిద్ధాంతమైనగాని యతనికి మనశ్శాంతి కలుగునట్లు లేదు. అందువలననే యాతని దీర్ఘవ్యాధివలన నంత భయమునొందెను.

యథావిధిగ నొకనాడు సింహాచలము సత్యనాడు కారాగారమునకు ప్రొద్దిటివేళవచ్చెను. కారాగార మంతయు మహాకల్లోల మున మునిగియుండెను. ఉద్యోగులందఱును భయవిహ్వలములగు ముఖములతో నొకరితోనొకరు సంభాషించుకొనుచుండిరి పారాజవానులును సేవకులును గుంపులుగుంపులుగా చేరి గుసగుస లాడుకొనుచుండిరి. ఆకారాగారమున నేదియో మహావిపత్తు వాటిల్లినట్లు గోచరించెను.

ఆ జైలునకు సర్వాధిపతియగు నొక శ్వేతముఖుడు పిచ్చి యెత్తినవానివలె వాయువేగముతో నటునిటుపరువులెత్తు చుండెను. ఆకల్లోలమునకు కారణమేమి?

ఆయుదయమున దుర్గాప్రసాదుడు చికిత్సాల యమునుండి తప్పించుకొనిపోయెను. అతనిశయ్యచెంత నిరంతరమును పరిచర్యయొనర్పనియమింపబడిన యువతియును గాన్పించ లేదు. ఆమెనువెదకివచ్చుటకై రక్ష కభటులనుపంపిరి. కడచిన సాయంకాలమునుండియు నామెయెవ్వరికంటబడ లేదని తెలియవచ్చెను.

దుర్గాప్రసాదునకై ప్రత్యేకముగా నియమింప బడిన యాపరిచారకురాలు కారాగారమునందలి యుద్యోగులందఱకును చిరపరిచితయై, వారందఱ విశ్వాసమునకు పాత్రురాలైయుండెను. అందువలననామె ప్రసాదునితో కలసిపాఱిపోయెనను వార్త వారికితీరని యాశ్చర్యమును కలిగించెను. కారాగారముయొక్క సింహద్వారమున నిర్గమించువారి కనుజ్ఞ నిచ్చుటకై నియమింపబడిన యుద్యోగిని విచారించిరి. అదారిగా ఖైదీయెవ్వరును వెళ్లలేదనియు, ప్రతిదినము నుదయ కాలమున కారాగారాధిపతియింటికేగు పరిచారకురాలును ఒకసారాజవానును మాత్రమే యేగిరనియును (nurse)

చెప్పెను. అంతట నాలోచింపగా నాపరిచారకురాలే దుర్గాప్రసాదునియుపచారమునకై నియమింపబడియె నని తెలియవచ్చెను. పారాజవాను వేషమున ప్రాయ శః దుర్గాప్రసాదుడె వెడలిపోయియుండునని వారూహించిరి. కానియతనికిని పరిచారకురాలికి నెచ్చటి సంబంధము. ఆదుర్మార్గునిచే నంతటిసౌశీల్యముగలయువతి యెట్లు వంచింపబడినది? అనియధికారులెల్లను నాశ్చర్యమగ్నులైరి దుర్గాప్రసాదుడు కారాగారమును ప్రవేశించి నప్పటినుండియు పరమరహస్యముగ నొక వ్యక్తితో నుత్తర ప్రత్యుత్తరములు నడపుచుండెను. ఆలేఖల యందు వృత్తాంతములు చర్చింపబడెను. ప్రసాదుని విముక్తికై యుపాయములు వర్ణింపబడుచుండెను. వాని నందుకొని ప్రత్యుత్తరములను వ్రాయుచు విశాలమగు బాహ్యప్రపంచమునకును అంధకారమయమగు నతని చీకటికొట్టునకును సంబంధమును కల్పించిన యావ్యక్తి యెవరు? చంద్రమతి. రాజశేఖరమున కుంపుడుకత్తె యని భావింపబడిన చంద్రమతి. పరమతార్కికుడగు సింహాచలమున కానాడు రాజశేఖరమును గూర్చి మాయ మాటలు చెప్పి పంపిన వేశ్యాసుందరి.

ప్రసాదునియొద్దనుండి యుత్తరము వచ్చిన వెంటనే చంద్రమతి యతని యాజ్ఞలను శిరసా వహించి

నుండి విముక్తునిచేసి యీదినముననే నన్ను చికిత్సాలయమునకు గొనివచ్చిరాగు. వైద్యులందరు నా వ్యాధిని నిర్ణయింపజాలకున్నారు. సింహాచలమిచ్చటికి రెండుమూడు సారులు వచ్చి చూచిపోయినాడు. అతనికి కొంచెమనుమానముగా నున్నట్లు నేను కనుగొంటిని. అతడు మనకీసారి యడ్డమురాజాలడు. అది నిశ్చయము. అతని రాకపోకలను మాత్రమే మరక కనిపెట్టియుండవలయును. నాయుపచారమునకై నేటినుండియు సునంద యనునొక పరిచారికను నియమించియున్నారు. సత్యవాడ రాజవీథియందున్న పెద్దమార్వాడీ వస్త్రాలయముకుపక్కగనున్న సందులో నామె యిల్లున్నది. నీవామె పరిచయమును కావించుకొనుము. తరువాత చాకలిపేటయందు కారాగారమున పనిచేయుచున్న యొకజవాను కాపురమున్నాడు. నీవాసునంద యొక్కయు జవానుయొక్కయు నుద్యోగిదుస్తులనపహరించి, వారిని బలాత్కారముగ నేనాజ్ఞయిచ్చిన దినమున మందునకైన కాన్పింపకుండ బంధించి దాచియుంచవలయును. నీవంతట సునంద వేషమును ధరించి పారాజవానుదుస్తులనుగొని నిర్భయముగా కారాగారమును ప్రవేశించి నాయొద్దకురమ్ము. ఇందుకు సంబంధించిన విషయములన్నియు మిక్కిలి జాగరూకతతో తెలిసి

కాని యొచ్చుటను లోపములేకుండ పరీక్షింపవలె యును."

చంద్రమతి కాయుత్తరము మిగుల నుత్సాహకారణమయ్యెను. అందున వివరింపబడియున్న విధముగా నామెయన్నిసంగతులను విచారించి తెలిసికొనెను. సునందకు చికిత్సాలయమునఁ బగటివేళ నుద్యోగములేదు. రాత్రియంతయు నామె చికిత్సాలయముననే యుండి యుదయమైనతోడనే కారాగారాధిపతి యింటియొద్దకేగి యచ్చటకొన్ని కార్యములు నిర్వర్తించుకొని స్వగృహమునకు వెడలిపోవుచుండును. అందువలన చంద్రమతికి కొంత ధైర్యమువచ్చెను. మారువేషము పగటివేళకన్న రాత్రియందు గుఱుతుపట్టుట దుర్లభమగుటచే తన సాహసము సఫలమగునని యామె తలంచెను.

సునందను బంధించితెచ్చుట మాత్రము సామాన్యమగు కార్యముకాదు. ఆమెకు పరివారమెక్కువ. వచ్చుపోవువారెప్పుడును విడువక యామె గృహమునం దుందురు. ఆమె మధ్యాహ్న సమయముననుమాత్ర మొక్కటియే యేకాంతముగా కొంతసేపు నిద్రించు చలవాటు. ఆ సమయమందును కూడ నింటిలో వారును వీరును వచ్చిపోవుచుందురు! గాని,

యన్ని సమయములందు నదియె తనకు వీలయినదని చంద్రమతి గ్రహించెను. ఆకార్యమును కొనసాగించుటకై దుర్గాప్రసాదుని యనుచరులలో బలిష్ఠులగు కొందఱను రాజపురమునుండి పిలిపించియుంచెను. దుర్గాప్రసాదుని యాజ్ఞ తుట్టతుదకువచ్చెను. సునంద బంధింపబడియెను. ఆమె విషయమున నేమాత్రము నల్లరి కాలేదు. జవాను సందర్భమున కొంత నిష్కారణముగ కల్లోలమువచ్చెను. ఆతనిని మంచిమాటలతో తమ కార్యమున కుపయోగించుకొనుటకై ప్రయత్నింపగా నతడు సమ్మతింపక తుదకంతయు ప్రకటించుటకు సన్నద్ధుడయ్యెను. అతనిని కూడ వివిధప్రయత్నములొనర్చి బంధించి తేగలిగిరి.

అంత నాటిరాత్రి చంద్రమతి సునందవేషము నతిచాతుర్యముగ తీర్చికొని పారాజవాను యొక్క దుస్తులను తన యొద్ద గూఢముగ నుంచుకొని నిశ్చలమగు మనస్సుతో కారాగార ప్రవేశమునకు వలయు నిబంధనల నన్నిటిని స్మరణకు తెచ్చుకొని ప్రయాణ మయ్యెను. ఉన్నతములగు కారాగార ప్రాకారములు కాన్పించిన వెంటనే యామెహృదయము కొంచము భయకంపిత మయ్యెను, కాని దుర్గాప్రసాదుని యాజ్ఞతలచుకొని యాభయమంతయును బాపుకొనియెను. తలవంచుకొని

మానసమై కార్యనిమగ్నమై యున్నట్లతిశీఘ్రగమనముతో పెక్కుమాటలాడక పెక్కుచోటులందు నిలువక కారాగారమును ప్రవేశించి నాలుగైదు నిముసములలో దుర్గాప్రసాదుని శయ్యాసాన్నిధ్యమును జేరెను. ఆమె యతని సందర్శించినంతనే దుర్గాప్రసాదునకు శరీరబాధ యధికతరమయ్యెను. చంద్రమతికి నెనర్లేటి పరిచారికలు రాండ్రతో మాట్లాడవలసిన యవకాశమైన లేనంత శ్రద్ధతో నుపచారము చేయవలసివచ్చెను. వైద్యశాలయందలి యువతులందఱును పాపము సునంద నానాటిరాత్రి మాయలేనంత పనితగిలినదని యనుకొనజొచ్చిరి. ఆరాత్రి యంతయు నట్లే వేగించి వేకువజామున నచ్చటివారందరు నేమరియున్నసమయమున దుర్గాప్రసాదుని గూర్చితన వేషధారణమును గావించుకొనియెను. అంతట పలాయనము సులభముగ నెరవేరెను. (శేషప్రతిభా ధురంధరుడగు నీ పాంచాలమును చిరపరిచరితమగు క్రోధముచే నావేశింపబడిన రత్నవల్లియును తమయాంగ్లభృత్యులను వినియోగించి పట్టితెచ్చిన దుర్గాప్రసాదుడు అవలీలగ పంజరశుకమువలె హఠాత్తుగ నదృశ్యుడయ్యెను.

ఆ సమయమున రత్నవల్లి తన కోల్పోయిన యారోగ్యమును మెల్లగ సంపాదించుకొనుచు సత్యవాణి వైద్యశాలయందు హాయిగ నివసించుచుండెను. ఆమె

నిద్రలేచునప్పటికి సూర్యోదయమై నాలుగైదు గడియలు దాటియుండెను. ఆమె కండ్లు తెరచిచూచువేళకు వైద్యశాలయందలి స్త్రీపురుషులందఱు నత్యంత శ్రద్ధాయుక్తులై యేదియో మాటాడుకొను చుండిరి. రత్నవల్లియా వార్తను చెవులార వినగోరి చెంతనున్న యొక యువతిని ప్రశ్నించెను. “ఏమున్నది! దుర్గాప్రసాదుడు మరల పారిపోయినాడట”

రత్నవల్లియు ప్రశాంతమగు నుదయవేళయందు మారుమాటాడక మూర్ఛిల్లి తన శయ్యపై వ్రాలినది.



వారి:- మా రామవరమమున మీ యభిరుచికి తగిన భవనములిచ్చుటకులేవు. అదియునుగాక మా స్వగృహము చిన్న పూరిగుడిసె. మీరక్కడకు వచ్చి యేమి సుఖమనుభవింతురో నే నెఱుగను.

రత్న:- పూరిగుడిసియే నేను కోరినది. భవనములున్న నాకక్కరలేదు.

వారి:- అట్లైన నీకేళీనికేతనమెవరి కైన వ్రాసియిచ్చితివా?

రత్న:- ఎవరికో యెందుకు నీవు కోరినచో నీకేయిచ్చెదను.

వారి:- అట్లైన నేనిక నాయూరి ప్రయాణము మానుకొందును. ఇదే నాయూరు. ఇదియే నాస్వగృహము.

రత్న:- అంతకన్న నేమికావలయును? మీ రామవరము నందలి పూరిగుడిసెను కొన్నాళ్లు నన్ను వాడుకొననిమ్ము. నాతో వచ్చి నన్నచట దిగవిడిచిరమ్ము.

నాటి జయంత పరిహాసముపమానినది. హేళనముగా నామొదలికన పలుకులకు రత్నవల్లి మిక్కిలియాతురతతో రామవర గమనాభిలాషతో ప్రత్యుత్తరము లిచ్చుచుండెను. ఆయాతురత కేమికారణమాయని వారిజ తెలిసికొనదలచెను. రత్నవల్లి దీనవదనమును

రత్న:- రత్నవల్లి నీవనుకొనినంతటి మహాపురంధ్రి కాదు. ఆమెకిప్పుడు శాకపాకములతో పని లేదు. శయనించుటకు హంసతూలికలామె కక్కఱలేదు. ఆమెకోరిన దజ్ఞాతవాసము. వారిజా మనమిరువురము నక్కచెల్లెండ్రవలె, గృహకృత్యములన్నియు తీరికగా నుల్లాసముగా చేసికొనుచు కొన్నినాళ్లు గడపెదము. మనకిక వెనుకటి యట్టహాసమెందులకు?

వారిజకు రత్నవల్లి చిత్తవృత్తి గోచరమయ్యెను. కొన్ని దినములు రామవరమున నివసించినచో నామె వ్యాకులహృదయము చక్కబడునని తలంచెను. అంతట మారుమాటాడక ప్రయాణమునకు సన్నాహము లొనర్చెను.

రామవరము పల్లెటూళ్లలో నంతగా ప్రసిద్ధికెక్కినదికాదు. అచ్చట ఫలభరితములగు వనములుగాని, నిర్మలములగు నీటివసతులుగాని లేవు. కాని రత్నవల్లివంటి సంతప్త హృదయులకు, విశ్రాంతిస్థానమగుటలో సందేహములేదు. ఊరికానుకొని మెట్టపైరులు నానావర్ణములతో భాసిల్లుచుండును. పడమటివైపున నున్న చిన్నదేవాలయమును తటాకమును తప్ప నాయూర చెప్పుకొనదగిన దృశ్యములేవియును లేవు. ఇంకేమికావలయును!

రత్నవల్లియును వారిజయు నాగ్రామమునందలి పూరిగుడిసెలో కాపురము చేయుచుండిరి. మొదటి దినమున రత్నవల్లి తన చేతులతో దొడ్డిలోని తీగలకును చెట్లకును కుదురుగా పాదులు చేసి నీళ్లుపోసినది. ఇల్లంతయు నలికి ముగ్గులుతీర్చినది. ఈపనులందంతగా నామెకు చిరకాలమునుండియు నభ్యాసము లేకపోయినను నుత్సాహాతిశయముచే నాలోపము కనుపించలేదు. ఆదినమంతయు భోజనాదికము నొనర్చుకొని, వారిరువురును నొకరితో నొకఱూరి ముచ్చటలను కథాప్రసంగములను చెప్పుకొనుచు ప్రొద్దుపుచ్చి శయనించిరి. రత్నవల్లికిమాత్రము నిద్రరాలేదు. క్రొత్తప్రదేశమగుట వలననేకాదు. ఆమెకు రాజపుర వృత్తాంతమంతయు మఱపునకురాలేదు. అంత యకస్మాత్తుగా నామె విరాగిణి కాలేదు. రాజపురమునుండి బయలుదేరినపుడామె గతమునంతయు మరచి నిశ్చింతతో రామవరమున నివసింపనెంచెను. అట్లుండుట ఎంత దుర్లభమో యామెగ్రహించినది. అయినను లోపలి యావేశము నణచివైచుకొన ప్రయత్నించినది. సాధారణముగ సుఖజీవనము నొసర్చు స్త్రీపురుషులకు నివాసస్థానమై, ప్రశాంతమైన యాగ్రామమునందా రాత్రి సమయమున రత్నవల్లికి చిత్తశాంతి కుదురుటకు బదులుగా చిత్తవైకల్యము కలిగెను. ఒక్కమారుగ దుర్గాప్రసాదుని పైనామెకు క్రోధానలము ప్రజ్వరిల్లెను. అంతట దురం

తము లొనర్చిన యతనిని సాధించుటమాని విరాగి వృత్తితో ననాథయై కాలము గడుపుట్కేమెకసహ్యము గతోచినది. ఆరాత్రియంతయు జాగరణముతో దుర్గాప్రసాదుని దండించుచు, దూషించుచు, పరిహసించుచు ప్రేమించుచు నెట్లో వేగించినది.

ఆమరునాడు రామవరమున నొక కలవరము పుట్టెను. ఆగ్రామమునకు సత్యవాడనుండి యొక దూరబంధువు వచ్చెను. దుర్గాప్రసాదుని యాశ్చర్య జనకమగు పలాయనమును గూర్చిపట్టణ వార్తాశ్రవణకుతూహలులగు కొందరకున్న దిలేనిదికూర్చి విస్తరించి వర్ణించిచెప్పెను. ఆవిచిత్ర వృత్తాంతము త్వరలో గ్రామమంతయు పాకిపోయెను. చెఱువున బట్టలుదుకునప్పుడు, బావులయొద్ద నీళ్లుతోడునప్పుడు, పొలములందు కాపు కాయునప్పుడు, ఇంటివద్ద భోజన మొనర్చునప్పుడు స్త్రీలు పురుషులు నందఱు వింతగా చెప్పుకొన జొచ్చిరి. తుదకా కల్లోలము వారిజపూరి గుడిసె వరకు వ్యాపించెను. ఇరుగు పొరుగు వారందఱును వారిజనుగలసికొని చిరకాలము పట్టణవాస మొనర్చిన దవుటచే నావిచిత్ర కథాసందర్భములను విప్పి చెప్పుటకై గుచ్చి గుచ్చి యడుగజొచ్చిరి. రత్నవల్లి తన వేషభాషాదులన్నియు మార్చి, సాధారణ స్త్రీవలె సంచరించు చుండుటచే నామె నెవ్వరును బాధింపలేదు. కాని యామె రామవరమునకు

వచ్చిన పనియంతయు భగ్నమైనది. ఈదుర్గాప్రసాదుని వృత్తాంతము మహారణ్యమధ్యమునకు గూడ రత్నవల్లికి దుఃఖ కారణమగుటకై పోవునట్లుండెను. రత్నవల్లి యంతట రామసింగ మనమే పొరబాటని తలచెను. తన యశక్తియే తన్నిట్లు మరలవంచించిన దనుకొనెను. తనశరీరమున ప్రాణము లున్నంత కాలము ప్రసాదునిపై పగసాధించుట తన ధర్మమని యామె తలపోసెను. రామవరమునందామె కాపురముండ, నూహించుటకు ముచ్చటయైనను కాలేదు. వారలను వదలి యామె మరల రాజపురమున కేగెను.



## రామమూర్తి చరిత.

మామగారు వ్యాధిగ్రస్థులగుటచే రామమూర్తి తన భార్యను వెంటబెట్టుకుని, వేలూరి సంస్థానమున కేగి యచ్చట రెండు మూడు దినములుండి వచ్చెను. ఆ వచ్చిననాడు రాజపురము రైలుస్టేషను నందు రామమూర్తియొక విచిత్ర చర్య నొనర్చెను.

బండి యాగుటతోడనె రామమూర్తిదిగి రెండు మూడడుగులు ముందు నడచి నిలువబడియెను. ప్రమీల యును వెనుకనుండి దిగి నిలువబడినది. అది యుదయ సమయము. సూర్యమండలము భూమండల వాసుల కింకను సంపూర్ణముగ కాన్పించుటలేదు. సంకులముగ నా స్టేషనునందు జనసమూహము సంచరించుచున్నను రాత్రి యంతయు నిద్దురలేక యొనర్చిన ప్రయాణా యాసమును పాటింపక రామమూర్తి యా ప్రభాత వాయువులలో సేదదీర్చికొనుచు నిశ్చలముగ నిలువ బడెను. కాని యతడు ఱెప్పవాల్పక తదేకధ్యానమున నెవ్వరిని చూచుచున్నాడు. ప్రమీల యెన్నియో పర్యాయములు పిలిచినది. రామమూర్తి వినిపించు కొనలేదు. అంతట ప్రమీల యాతనిదృష్టిపథమును గమనించి చూచినది. స్టేషనున కవ్వలిభాగమున నొక యున్నతాసనమున రమణీయమగు రమణీమూర్తి

యాతెంకు గానవయ్యెను. రామమూర్తి కామూర్తి దర్శనమున నంతటి పట్టుదలయేమి? అని యాతెం ప్రశ్నించుకొనినది. రామమూర్తి సమక్షమునమాత్ర మా ప్రస్తావన రాలేదు.

రామమూర్తి కిపుడీ ప్రపంచమున నేవిధమగు కొదువయునులేదు. అతని కపూర్వబల శక్తి సంపన్నులగు స్నేహితు లున్నారు. వారు తమ ప్రాణములైన నతని కర్పింతురు. కోరినంత సంపద యతనికి చేకూరినది. జగన్మోహినియగు నర్ధాంగి లభించినది. కామితము లన్నియు చేకూరినవి. అటువంటి భోగమూర్తిజీవనముకూడ దుఃఖభాజన మని యన్నచో నది విశ్వసనీయమగు వృత్తాంతము కానేరదు.

కాని, నిజమునకు రామమూర్తికి మనశ్శాంతి కుదురలేదు. అత డార్జించిన ధనము, సౌఖ్యము, సంసారము నివన్నియును మానవ రక్తము చేప్లావితములైనవి. ఆ భయంకర విధానము నతడెన్నడు మరచిపోగలడు. ఆతని జీవన పయస్సునందొక విషబిందువు రాలినది. రత్నవల్లిపై ప్రణయము నతడు చేతులార చంపివైచెను. ఆమృత ప్రణయ మిప్పుడు ప్రేతరూపమున నతనిని వేధింప జొచ్చెను. దుర్గా ప్రసాదుని ప్రజ్ఞా విశేషమున నతని మిత్ర వాత్సల్యమున తనకు చేకూరిన వైభవ మంతయు ననంతమగు దుఃఖమునకు

కారణమగుచుండెను. పాపమా ప్రమీలయేమియు నెరుగదు. తన యౌవనమును, నిష్కలుషమగు ప్రేమయును, నిర్వ్యాజమగు వర్తనమును మనస్సాక్షిగ పెండ్లియాడిన తన నాధున కామె హృదయపూర్వకముగ సమర్పించెను. రామమూర్తి మాత్రమా యమూల్యమగు నుపాయము నంతే హృదయ పూర్వకముగ స్వీకరింప జాలక పోయెను. అతని యెదుట నవ్యయానంద సంధాయకమగు భూతల స్వర్గము గోచరమగుచుండెను. ఆస్వర్గధామమునుండి ప్రమీల ముక్తకంఠముతో మధుర మధురముగ నాహ్వానించుచుండెను. కాని యంతటి సమీపమున నున్నయాయానందభూమి యందడుగు వెట్టుట కైనను తన కర్హతలేదని రామమూర్తి తలపోసెను.

రామమూర్తి యొకనాటి మధ్యాహ్నమున ప్రమీల యంతఃపురమునుచేరి యామెతో సల్లాపగోష్ఠి యొనర్చుచుండెను. ప్రమీల తన యనురాగమంతయు మూర్తీభవించినట్లు శ్రద్ధతో నా శయ్యామందిరము నన్ని వైపుల నలంకరించెను. సుగంధ ద్రవ్యములుధూపములు నా గృహాంగణమును సుఖావహముగ నొనర్చెను. నానావర్ణములు గలవి. వివిధ పరిమళములు గలవి పూవులు మాలలుగాగ్రుచ్చి శయ్యాపరిసరప్రదేశములయందందముగా నామె యమర్చెను. అందులో

నెల్లసుందరమగు దానిని రామమూర్తి కంఠసీమనలంకరించుటకై దాచి యుంచెను. రామమూర్తి నాఁడు యానాఁడు రాజాధిరాజునువలె యాదరించి చిరప్రేమ సంకలితములగు తన కానుకలన్నియు నతనికి సమర్పించెను. రామమూర్తి యాయానందమదిరచే నున్మత్తుఁడై,

"ప్రమీలా! నాజీవనము ధన్యమైనది. ఈనాటి నుండియు, నీకోమలహస్త స్పర్శచే నా జీవితమునందలి కాఠిన్యమంతయు సన్నగిల్లిపోవును. నీ వానంద రూపిణివి. ఎన్నఁడో మాయమైపోయిన నాసంతోషమును మరల మధురముగ నాహ్వానించి మేల్కొల్పితివి." అని పూర్ణమగు ప్రేమానుభవముతో ప్రశంసించెను. ఆ ప్రశంసయందుని గూఢమై కొంత దుఃఖము లేకపోలేదు. ఎన్నఁడో మాయమైన సంతోషమును ప్రమీల మేల్కొల్పినది. అది మరల మాయమై పోవునేమో యని యతని భయము. ప్రమీల యామాటలకు ప్రత్యుత్తరముగా నొక మోహనమగు మందహాస మొనర్చి రామమూర్తి మాటలయందలి దుఃఖచ్ఛాయలను సైతము రూపుమాపినది. కోకిలవంటి కంఠమునెత్తి తెనుగుపాటలు పాడినది. వీణపై నొకింత సంగీతము వాయించినది. రామమూర్తి యత్యంతసుఖపారవశ్యమున ప్రమీల పర్యంకమునతలవాల్చి త్వరలో

కారణమగు చుండెను. పాపమా ప్రమీల యేమియు నెరుగదు. తన యౌవనమును, నిష్కలుషమగు ప్రేమ యును, నిర్వ్యాజమగు వర్తనమును మనస్ఫూర్తిగ పెండ్లియాడిన తన నాథున కామె హృదయపూర్వక ముగ సమర్పించెను. రామమూర్తి మాత్రమా యమూ ల్యమగు నుపాయము నంత హృదయ పూర్వకముగ స్వీకరింప జాలక పోయెను. అతని యెదుట నవ్యాయా నంద సంధాయకమగు భూతల స్వర్గము గోచరమగు చుండెను. ఆస్వర్గధామమునుండి ప్రమీల ముక్తకంఠ ముతో మధుర మధురముగ నాహ్వానించుచుండెను. కాని యంతటి సమీపమున నున్నయాయానందభూమి యుందడుగు వెట్టుట కైనను తన కర్హతలేదని రామ మూర్తి తలపోసెను.

రామమూర్తి యొకనాటి మధ్యాహ్నమున ప్రమీల యంతఃపురమునుచేరి యామెతో సల్లాపగోష్ఠి యొనర్చు చుండెను. ప్రమీల తన యనురాగమంతయు మూర్తీ భవించినట్లు శ్రద్ధతో నా శయ్యా మందిరము నన్నివైపుల నలంకరించెను. సుగంధ ద్రవ్యములుధూప ములు నా గృహాంగణమును సుఖావహముగ నొన ర్చెను. నానావర్ణములు గలవి. వివిధ పరిమళములు గలవి పూవులు మాలలుగాగ్రుచ్చి శయ్యాపరిసరప్రదే శములయందందముగా నామె యమర్చెను. అందులో

నెల్లసుందరమగు దానిని రామమూర్తి కంఠసీమనలంకరించుటకై దాచి యుంచెను. రామమూర్తి నాఁడు యీనాఁడు రాజాధిరాజునువలె యాదరించి చిరప్రేమ సంకలితములగు తన కానుకలన్నియు నతనికి సమర్పించెను. రామమూర్తి యీయానంద మదిరచే సున్మత్తుఁడై,

"ప్రమీలా! నాజీవనము ధన్యమైనది. ఈనాటి నుండియు, నీకోమలహస్త స్పర్శచే నా జీవితమునందలి కాఠిన్యమంతయు సన్నగిల్లిపోవును. నీ వానంద రూపిణివి. ఎన్నఁడో మాయమైపోయిన నాసంతోషమును మరల మధురముగ నాహ్వానించి మేల్కొల్పితివి." అన్ని పూర్ణమగు ప్రేమానుభవముతో ప్రశంసించెను. ఆ ప్రశంసయందుని గూఢమై కొంత దుఃఖము లేకపోలేదు. ఎన్నఁడో మాయమైన సంతోషమును ప్రమీల మేల్కొల్పినది. అది మరల మాయమై పోవునేమో యని యతని భయము. ప్రమీల యీమాటలకు ప్రత్యుత్తరముగా నొక మోహనమగు మందహాస మొసర్చి రామమూర్తి మాటలయందలి దుఃఖచ్ఛాయలను సైతము రూపుమాపినది. కోకిలనంటి కంఠము నెత్తి తెనుగుపాటలు పాడినది. వీణపై నొకింత సంగీతము వాయించినది. రామమూర్తి యత్యంతసుఖపారవశ్యమున ప్రమీల పర్యంకమునతలవాల్చి త్వరలో

రామమూర్తికి స్వప్నవృత్తాంతమంతయు జ్ఞాపకమున్నది. కాని కంఠమెత్తి యాకఠోరనామము నుచ్చరించితినని మాత్ర మెఱుగడు. ప్రమీల జిహ్వాగ్రమునుండి యానామాక్షరములు వెలువడినతోడనె రామమూర్తి తనయపరాధి హృదయమును మఱుగుపఱచుకొనలేక పోయెను. అతడేమని ప్రత్యుత్తర మీయగలడు? స్నిగ్ధహృదయయగు ప్రమీలయంతరంగమున జన్మించిన యాయాక్రాంతి యెన్నినెపములు చెప్పిన శాంతింపగలదు? అతడేమియును తోచక నిరుత్తరుడై యూరకుండెను.

ప్రమీలమాత్ర మూరకుండలేదు. „వల్లీ,, యన నర్థమేమో తెలిసికొన వలయునని యామె యాతురపడుచుండెను. అదియొక స్త్రీ వ్యక్తియై యుండునని యామె విశ్వసించినది. ఆవిశ్వాస కారణముననే యామె మనస్సునందంతటి యావేదన బయలుదేఱినది. కాని ప్రకాశముగా నావిశ్వాసమును రామమూర్తి కెఱిగించుట కామెకు ధైర్యము చాలలేదు. „వల్లియన నేమి?,, యని మాత్ర మడుగ దలచినది. లేకున్న „ఆవల్లియెవరు?,, అనిమాత్రము ప్రశ్నింప దలచినది. కాని సంశయ కళంకితమగు నామె హృదయము బలవత్తరమై యామె కీరెండు ప్రశ్నల నడుగనీయలేదు. ప్రమీల మాటలు తడవుకొనుచు తలవని తలంపుగా,

"ఆమె యెవరు ?" అని రామమూర్తినడిగెను. అంతలో రామమూర్తి నెవరో క్రిందినుండి పిలిచిరి. ప్రమీల యడిగిన ప్రశ్నకు ప్రత్యుత్తర మిచ్చుట కతని కవకాశము లేకపోలేదు. కాని యా సమాధాన మీజన్మమునందు కుదురదు. ఎంత వ్యవధి యున్నను ప్రమీల సందేహము నతడు తీర్పజాలడు. అందుచేత నాక్రింది పిలుపు నొక నెపముగా గొని "ఇదె వచ్చెదనని" వెడలిపోయెను. ప్రమీలకు సందేహము తీరినది. నిర్మలమగు నామె జీవనాకాశ మంతయు మేఘావృతమై యంధకారమయమై పోయినది. రామమూర్తి చరిత్ర మెన్నియో యజ్ఞాత విషయములతో, ననేక రహస్యములతో, నగాధమై యున్నట్లామె భావించినది. ఆయంతఃపుర గవాక్షమున కేలుమోపి, తన సమక్షమున కాన్పించు నంతరిక్షమువలె తన జీవనమంతయు శూన్యమై పోయినదని యామె వేడికన్నీళ్లు విడిచెను. తన జీవితము నొక్కసారి స్మరించుకొనినది. తన భవిష్యము నూహించి చూచికొనినది. ఎచ్చట తిలకించినను నామెకు దుఃఖమె, దురదృష్టమె విస్పష్టమైనవి. ప్రమీల హతభాగినియైనది.

రామమూర్తి మేడనుండి దిగి క్రింద కేగిన తోడనే సేవకుడొక యుత్తరమువతని చేతికిచ్చెను. ఆలేఖను గొనితెచ్చిన వారెవరని రామమూర్తి యడుగగా

నొక యశ్వశకటమంతకు ముందే వచ్చి వాకిట నిలచిన దనియు తానచ్చటికేగగా ఈయుత్తరము రామమూర్తి గారికీయుమని యొకకాగితము తన చేతనుంచిరనియు నిచ్చిన వారెవ్వరో బండి లోపలగా నుండుటచే తాను పరికించి చూడలేదనియు బండియప్పుడే దాటి పోయి నదనియు సేవకుడు చెప్పెను. రామమూర్తి యాలేఖ నిట్లు సావధానముగా చదువుకొనెను.

వదాన్యులగు రామమూర్తి పంతులుగారి సముఖమున రత్నవల్లి ప్రణామము లాచరించి చేయువిన్నపములు.

మీరును మీస్నేహితులగు దుర్గాప్రసాదులును నాకీజన్మమున నొనర్చిన సహాయమునకు నేనెంతయు కృతజ్ఞురాలను. మీరిరువురుకలసియెన్నియో ప్రయత్నములొనర్చి నాకీబ్రతుకుపై యాశపోవునట్లొనర్చితిరి. నాయందున్న భోగకాంక్ష సంపూర్ణముగ చల్లారిపోయినది. నాబంధనములన్నియు తెగిపోయినవి. నేనీనాటి నుండియు విముక్తురాలనయితిని. దారిద్ర్యము మరణము, ప్రవాసమునన్నిక భయపెట్టజాలవు. కావున రత్నవల్లినిక వెనుకటియుదాసీన భావముతో చూడకుము. రత్నవల్లి భాగ్యము లంతరించిన మాటనిజము. నీపై పగమాత్ర మట్టెనిలిచియున్నది. మఱచిపోకుము. నీకింకను బ్రతుకవలెనని సుఖమును భవింప వలయునని యాశయున్నది. ఆయాశకు నేను నిరంతరము నడ్డము

వచ్చుచుందును. నన్ను తప్పించుకొని పోజాలవు, నీజీవ నమంతయు నీనాటినుండి నేనే నియమించెదను. నాయాజ్ఞనతిక్రమించుటకు నీకు ధైర్యమున్నదా? పర్యాలోచించికొనుము. రత్నవల్లికి మంచి మేలుచేసితివి. అందుకై మరల నావందనము లర్పించుచున్నాను.

రత్నవల్లి.

రామమూర్తిపని మరల మొదటికివచ్చినది. ఆతడేమి చేయదలచునో యెవరికెఱుక ?

ఆనాడే ధనవల్లియందు సింహాచలమును చలపతియును దుర్గాప్రసాదుని గూఢోపాయములను గూర్చి తర్కించుకొనుచుండిరి. సింహాచలము విచారగ్రస్తుడై కూర్చుండియుండెను. హత్యాసందర్భమున నతడొనర్చిన పరిశోధనమంతయు సకలజన శ్లాఘాపాత్రమైనదనియు, దుర్గాప్రసాదుని బంధించు విషయమై యంతవిచారపడ నవసరములేదనియు చలపతి యతనికి ధైర్యము చెప్పుచుండెను. సింహాచలము మాత్ర మందులకు సమ్మతింపక, మొదటినుండి తుదవరకును, కీలుబొమ్మనువలె దుర్గాప్రసాదుడు తన్నాడించుచుండెననియు, పరిశోధనమునందును, సాహసమునందునుకూడ నతడఖండుడనియు చెప్పి, యతనియన్వేషణమునకై ప్రయత్నములు విడువరాదనియు, దుర్గాప్రసాదుని రహస్యవిధానమును భంగపఱచుటయె తనకిక కర్తవ్యమనియు చెప్పెను. అంతలోనొక

యుత్తరము వచ్చెను. అది యేయూరినుండి వచ్చినది యు వ్రాసియుండలేదు. క్రిందనంతకము "దుర్గాప్రసాదుడ"నిమాత్రముండెను. ఇంకొక విశేషమేమనగా నాకాగితములమధ్య సన్నని పసుపుపచ్చని పట్టుదారము నుండెను. ఆయుత్తరమంతయు పఠించినయెడల పాఠకుల కన్నిసందర్భములును విశదముకాగలవు.

పరిశోధకవరేణ్యులగు సింహాచలముగారి సన్నిధికి.

నేను మీకు చిరపరిచితుడ నగుటచే నీయుత్తరమును వ్రాయుటకు కారణములు తెలుపనక్కరలేదనుకొందును. ప్రప్రథమమున మీయసామాన్యమగు పరిశోధనకళాపరిజ్ఞానమును కొనియాడుచున్నాను. సత్యవాడ హత్యావిషయమై మీరొనర్చిన ప్రయత్నములు శ్లాఘాపాత్రములని వేఱుగ చెప్పనక్కరలేదు. హంతకుని మీరు గుర్తింపగలిగితిరి. కాని రాజశేఖరము హత్యకు ప్రయోజనమును మాత్రము మీరుకనుగొనజాలకుంటిరని నాకుచాల చింతగానున్నది. మీరా విషయమై ప్రయత్నములు మానవలదు. ఆయన్వేషణమునకై మీకుసహాయకారిగా నుండుటకు "మంగళసూత్రము" నొకదానినిందుతో పంపుకొనుచున్నాను. దాని చిత్రకథయంతయు నదియే మీకు శాగ్రబుద్ధికి విన్నవించునను నమ్మకముతో పంపియుంటిని. ఆకథావృత్తాంతమంతయు వెల్లడిచేయు భారము మీపైనుంచి

నాను. అదియునుగాక రాజశేఖరము వ్రాసిన మరణ లేఖయొక్క రహస్యముకూడ మీకు బోధపడనట్లున్నది. అదికూడ విచారింపుము. తఱచుగా మీక్షేమమును విచారించుచుందును. మనవిరోధము చిరకాలము వర్ధిల్లునుగాకయని నాకోరిక.

దుర్గాప్రసాదుడు.

ఇంతవరకు దుర్గాప్రసాద విజయమను నొక కధముగిసినది. సింహాచల విజయమిక ప్రారంభము కావలయును. అదివేఱొక కధ.



# భక్తియోగము

తృతీయముద్రణము.

కొలదిప్రతులు మాత్రమేయున్నవి.

వెల రు 1—8—0

మానేజరు

సరస్వతీ నికేతనము.

మచిలీపట్టణము.

# లండను రహస్యములు

రెనాల్డ్సున కనువాదము.

అన్ని భాషలలోనికిని తరుజుమా అయినది.

ఆంగ్లసభ్యతయందలి జంజాటములను ఛిద్రవ్యాపారములను ఇంగ్లీషు రానివారును తెలిసికొననగును.

20 భాగములుగా ప్రచురింపబడును.

ప్రథమభాగము తయారైనది.

మూల్యము —

| | |
|---|---|
| చందాదారులకు | ౦-౪-౦ |
| ఇతరులకు | ౦-౬-౦ |

మానేజరు

కథా రత్నాకర గ్రంధమాల

బందరు.

